9908578239

# చతుర

నూతన సంవత్సర శుభాకాంక్షలు

జనవరి 2017
రూ.15/-



అమ్మలైనా ముద్దుగుమ్మలే!
..122

వారెవ్వా!

## బడా బడా.. జెడాంగ్!

ప్రపంచంలోని అతిపెద్ద విగ్రహాలలో ఒకటిగా ఉన్న చైనా విప్లవ నేత మావో జెడాంగ్ శిల్పమిది. నూట ఐదు అడుగుల ఎత్తున్న ఈ అద్భుత కళాఖండాన్ని 2007లో తీర్చిదిద్దారు. ఫ్యుజియాన్ నుంచి తెచ్చిన ఎనిమిది వేల గ్రానైట్ రాళ్లతో రూపొందించారు. జెడాంగ్ ముప్పై రెండేళ్ల వయసు నాటి రూపమిది. ఆధునిక చైనా ఆర్థిక వ్యవస్థకు పునాది వేసిన జెడాంగ్ మీద ప్రజల అభిమానానికి నిదర్శనమిది. ఆరెంజ్ ద్వీపంలోని ఛంగ్ షాలో ఉన్న ఈ శిల్పం ఓ చక్కని పర్యాటక కేంద్రంగా మారింది.





# మనసున ఉన్నదీ...

★ డిసెంబరు 2016 'చతుర' అందించిన సీనియర్ రచయిత అల్లం రాజయ్య 'టైగర్ జోన్' ఆసక్తికరంగా సాగింది. అడవి బిడ్డలైన ఆదివాసీల జీవన వృత్తాంతాన్ని రచయిత కళ్లకు కట్టినట్లు చిత్రించారు. అరిపిరాల సువర్ణ 'తరాలు.. అంతరాలు' ఎంతో వైవిధ్యంగా ఉంది. నవలావలోకనం 'సరళీస్వరాలు' ద్వారా ఆడపిల్లల మనస్తత్వాలు తెలుసుకోగలిగాం.

*– గానుగపెంట నరసింహులు,* బద్వేలు, కడప జిల్లా.

★ నవలిక 'టైగర్‌జోన్' బాగుంది. పేరుకు తగ్గట్టుగా టైగర్ ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. నవలిక 'తరాలు.. అంతరాలు' బాగుంది. మధ్యతరగతి కుటుంబంలో జరిగే విషయాలే అయినా ఎక్కడా విసుగు లేకుండా చాలా బాగుంది. చతుర 'సమ్'గతులు ఆసక్తిగా ఉన్నాయి. 'చతుర ప్ర.జ.' ద్వారా ఆధ్యాత్మిక విషయాలు తెలుసుకుంటున్నాం.

*– వై. హేమబిందు,* డోర్నకల్

★ అల్లం రాజయ్యగారి నవలిక 'టైగర్ జోన్' ప్రకృతి, సామాజిక విధ్వంసాలకు సంబంధించింది. ప్రపంచీకరణ తర్వాత వ్యక్తి, సమాజం, దేశం అన్నింటా స్వార్థంతో బాటు డబ్బు యావ పెరిగింది. రచయిత యథార్థాన్ని చక్కగా చిత్రించారు. 'తరాలు.. అంతరాలు' నవలిక కుటుంబంలోని వ్యక్తుల మనస్తత్వాలను చిత్రించింది. కళ్యాణి పాత్రను ఆదర్శంగా తీర్చిదిద్దారు. రెండు నవలికలూ ఉత్కంఠగా చదివించాయి.

*– ధఫ్వూరి శ్రీధరాచార్యులు,* హైదరాబాద్

★ 'టైగర్‌జోన్' వాస్తవానికి దగ్గరగా అందర్నీ ఆకర్షించే విధంగా ఉంది. రచయితకు అభినందనలు. క్రిస్టమస్ కేకు నోరూరించింది. కాలాతీతం ద్వారా సుప్రసిద్ధ రచయిత గాబ్రియల్ గారిని పరిచయం చేసినందుకు అభినందనలు. 'నవలావలోకనం'లో వచ్చిన సరళీస్వరాలు నవలపై సమీక్ష బాగుంది.

*– కరణం శివానందరావు,* కర్నూలు

★ వన్యప్రాణుల సంరక్షణ పేరుతో భూముల్ని సేకరించి పరిశ్రమలు పెడతామంటున్న నేటి పరిస్థితిని 'టైగర్‌జోన్'లో చక్కగా చిత్రించారు. 'తరాలు.. అంతరాలు' నవలికను నడిపించిన తీరు బాగుంది. చతుర 'సమ్'గతులు ద్వారా అందించిన విషయాలు ఆసక్తికరంగా ఉన్నాయి. 'సరళీస్వరాలు'లోని నవలపై సమీక్ష బాగుంది. 'చతుర ప్ర.జ.' ద్వారా ఆధ్యాత్మిక విషయాలు తెలుస్తున్నాయి.

*– కంజర్ల అనంతాచార్యులు,* జగిత్యాల

★ అత్యుత్తమ సాహితీ విలువల సమాహారం అల్లం రాజయ్యగారి టైగర్‌జోన్. వ్యవస్థ తీరుతెన్నులను కళ్లముందు ఆవిష్కరించారు. 'తరాలు.. అంతరాలు' నవలిక నేటి తల్లిదండ్రుల వాస్తవ జీవితాన్ని కళ్లకు కట్టింది. సంస్కృతీసంప్రదాయాలకు సంబంధించిన సందేహాలను తీరుస్తున్న 'చతుర ప్ర.జ.'కు అభినందనలు. 'సరళీస్వరాలు, క్రానికల్ ఆఫ్ ఎ డెత్ ఫోర్ టోల్డ్' విభిన్న కథాంశాలతో అలరించాయి. 'నారింజతో ఆరోగ్యం.. సౌందర్యం!' ద్వారా తెలియని విశేషాల్ని తెలుసుకున్నాం.

*– పి. శైలజాజానకి,* నవులూరు, గుంటూరు జిల్లా

★ సువర్ణగారి 'తరాలు.. అంతరాలు' వాస్తవికతకు నిలువుటద్దంగా నిలిచింది. చమత్'కారం' శీర్షిక ఎంతో ఆకట్టుకోవడంతో పాటు వినోదాన్ని, విజ్ఞానాన్ని అందిస్తోంది. 'చతుర'కు అభినందనలు.

*– సంతోష్‌కుమారాచార్య*

★ గిరిజనులు ఎదుర్కొంటున్న సహజ విషయాన్ని రచయిత అల్లం రాజయ్య అత్యంత స్పష్టంగా, హృదయాన్ని హత్తుకునేలా మన ముందుంచారు. 'తరాలు.. అంతరాలు' నవలికలో కుటుంబ సంబంధాలు ఆర్థికంగా ముడిపడి ఉన్నాయనే వాస్తవాన్ని తెలిపిన అరిపిరాల సువర్ణ అభినందనీయురాలు.

*– ఆర్.కె. అరవింద*

సంపుటి -39,
సంచిక - 12
468వ సంచిక,
పేజీలు : 132,
జనవరి 2017

# చతుర

'చేయి చాస్తే షేక్‌హ్యాండివ్వు. హగ్ చేస్తే నువ్వూ హత్తుకో. బెరుకూ భయా లొద్దు..'అని తీసికెళ్ళాడా భర్త. ఆమె అనుకున్నట్టు అక్కడున్నది ఆడవాళ్ళు కాదు, ఎందరో పురుషులు. బెదిరిన భార్యకు భయం లేదని సైగ చేశాడు భర్త. తినేసే చూపులు, నలిపేసే చేతులకు భయంతో, బాధతో కుంచించుకుపోయింది. ఆలంబనగా వుండాల్సిన భర్త మందు తాగడంలో లీనమయ్యాడు. తర్వాతేం జరిగింది?

నేటి సమాజంలోని కొందరు ప్రబుద్ధుల తీరుతెన్నుల్ని అక్షరబద్ధం చేసిన యక్కలూరి శ్రీరాములు నవల **లగ్నజిత**



పేజీ నెం. 6



★ రెండో కవరు : వారెవ్వా!
★ పుస్తకాలంకరణ : రాజు యాట

e-mail: vipula.chatura@eenadu.net / vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

నవలావలోకనంలో..

నాడు గ్రామాల్లో ఉన్నతవర్గాలవారి అధికార, ధన దాహానికి బలైన అట్టడుగు వర్గాలవారి బతుకుచిత్రానికి అక్షరరూపంగా నిలిచిన **డా. కేశవరెడ్డి** **ఇన్‌క్రెడిబుల్ గాడెస్**

పేజీ నెం. 112

కాలాతీతంలో..

స్వేచ్ఛ అంటే ఏంటి? స్వేచ్ఛకు సమాజానికి మధ్య సంబంధమేంటి? సమాజం పట్ల వ్యక్తి ఎలా ప్రవర్తించాలి? వంటి ప్రశ్నలకు జవాబు.. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికన్ సాహిత్యంలో సంచలనం సృష్టించిన నోబెల్ గ్రహీత **సాల్ బెల్లో** నవల **డాంగ్లింగ్ మాన్**

పేజీ నెం. 118

శ్రీకాంత్ తమకాన్ని ఆపుకోలేక కారులోనే తడిమాడు లక్ష్మిని.
పారిపోలేని పరిస్థితే కాదు, కనీసం
అడ్డయినా చెప్పలేని అశక్తత ఆమెది.
కారణం మద్యం మత్తు ఆమెని
పూర్తిగా వశపరచుకుంది
అప్పటికే.
తర్వాతేమైంది?
ఇంతకీ ఆమె ఎవరు?
ఆమె మత్తులో
ఎందుకు ఉంది?
శ్రీకాంత్ అనేవ్యక్తి
కారులో ఆమె
ఎందుకు ఎక్కింది?
జీవిత చదరంగంలో
అడుగడుగునా గెలుపు
ఓటముల్ని చవి చూసిన
ఓ మహిళ కథ

## లగ్నజిత

చతుర నూతన
సంవత్సర కానుక!



వి రిసిన పువ్వులో ఒళ్లు విరుచుకుంటున్న రెండు గులాబి రేకులు!

విప్పారిన నవ్వుతో కళ్లు తెరుచుకుంటున్న రెండు సీతాకోకచిలుక రెక్కలు!

మంచు గిన్నెలోంచి మధువు వొంచుకున్న ఆ నిండు రెండు పెదవులు!

సాయంకాలం నుంచి మొదలైన సురాపాన సేవనం నడినెత్తిన చంద్రుడు మబ్బుల్లో పరుగెడుతున్న సమయం వరకు కాలమంతా మత్తుతో సాగుతూ కదిలిపోయింది.

వెన్నెల పుప్పొడి ఆమె కన్నుల్లో పడి నీటిలో మంచుముక్కలా కరిగిపోయింది.

పున్నమిరోజు రేయంతా వేడివేడి కోరికల జ్వాలల్లో అణువణువూ నగ్నంగా అగ్నిగుండంలో పడిన శ్వేతవర్ణ తనువు చివరికి స్వేద బిందువులతో పూర్తిగా తడిసిపోయింది.

ఒక రాత్రి గడిచింది.

ఒక పగలు గడిచింది.

మూసిన ముత్యపు చిప్పల్లోంచి ఆమె కనురెప్పలు విప్పడానికి కాలం వెలుగు కిరణాలతో ఎదురు చూస్తోంది.

ముసిరిన మసక చీకటిలోని సూర్యుడు వెలుతురుతో దోబూచులాడుతున్నట్టు ఆమె ముఖంలో అప్పుడప్పుడే కదలిక మొదలైంది.

పసిమి కాంతి శరీరంతో పరుపుపై ఆమె అటు మెదిలి ఇటు కదిలింది.

ఉదయం పది గంటలవుతోంది.

పడుకున్న పరుపు పక్కనే ఆనుకుని ఉన్న టీపాయ్ మీదికి మెత్తని పట్టు దుప్పటి పుట్టలోంచి గోధుమ వన్నె త్రాచు లాంటి ఆమె చేయి బయటికొచ్చింది.

సివంగి కోరల్లాంటి గోళ్లతో ఉన్న అయిదు వేళ్లతో ఆమె బీరు సీసాను మెల్లగా తాకింది.

చేతికి చల్లదనం తగలగానే కనురెప్పలు మెలమెల్లగా తెరచుకుని చూసింది. చూపు సూదంటురాయిలా సీసాను తాకింది.

వెన్నెల్ని నింపుకున్న ఆ రెండు కళ్లు నిండు చందమామలై కనురెప్పల కటకటాల్లోంచి తొంగి చూసిన చూపు బీరు సీసాపై మత్తుగా పడింది.

సీసాను నోటికానించి పళ్లతోనే మూత తీసింది. ఒక సీసా బీరు పట్టే ఖాళీ మగ్గులో బీరును నింపింది.

సముద్రపు నురగల బుడగలతో నిండిన ఆ బీరు మగ్గును విచ్చుకుంటున్న మందార పెదవులకందించింది.

శంఖంలా ఒంపు తిరిగిన కంఠంలోకి ద్రవాన్ని వొంపింది.

ఒక్క గుక్కతో మగ్గు బీరును చుక్క మిగల్చక తాగేసింది. ఆమె దినచర్యలో మొదటి అంకం ముగిసింది.

గోధుమవన్నె త్రాచు కాటేస్తే ఎవరికైనా విషమెక్కుతుంది.

తాజా తేనెతో లేలేత వెన్నెలతో కలిపి తయారుచేసిన వన్నె చిన్నెల త్రాచు తనువుతో ఆమె మాత్రం ఉదయాన్నే తనలోకి విషాన్ని ఎక్కించుకుంటుంది.

పట్టెమంచం దిగి తామరతూడులాంటి రెండు కాళ్లను నేలమీద ఆనించింది.

చల్లదనం కాళ్లని ముద్దిడుకోగానే ఆమె కళ్లు పూర్తిగా తెరిచింది.

ఏకకాలంలో రెండు పున్నములు ఒక్క రోజే వచ్చినట్టయింది.

పండు వెన్నెల గదంతా ఒక్కసారిగా విచ్చుకున్నట్టయింది.

ఉష్ణం ఉష్ణేన శీతలం.

మందు మందేన శిరోభార ఉపశమనం.

అందరూ ఉదయం కళ్లు తెరవగానే దేవుడి చిత్రపటం వైపు చూసి దండం పెడితే.. ఆమె మాత్రం అద్దంలో తన ముఖాన్ని చూసుకుని పెదాల ప్రమిదలో చిరునవ్వును దివ్వెగా వెలిగించి చూపుల అగరొత్తుల పొగలను ముఖాన పడ్డ కురుల్లోకి పంపి, గులాబీమొగ్గ లాంటి నోరు

విప్పి.. ఉఫ్.. అని ముఖం మీద పడిన వెంట్రుకల్ని ఊది తన అందానికి తనే సెల్యూట్ చేసి..

'మై బ్యూటీ.. మై గాడ్!' అనేస్తుంది.

'నా అందమే నాకు దైవం.

నేనెవర్నీ ప్రేమించను.

నన్ను ప్రేమించమని కోరను.

నన్ను నేను ప్రేమించుకుంటాను.

నన్ను ఆరాధించమని, పూజించమని అడగను. నేను ఎవర్నీ పూజించను, ఆరాధించను.

ఒకరు మరొకరిగా కాక ఎవరికి వారుగా జీవించడమే జీవితమంటాను.

గర్వమను.. పొగరను.. మరేమైనా అను..' అని తనతో తనే అనేస్తుంది.

మంచం పక్కనున్న ఉడెన్ డ్రాయర్ హ్యాండిల్ లాగింది.

నిగనిగలాడే మిన్నాగు పడగలాంటి పిస్టల్ వైపు చూసి చిన్నగా నవ్వుకుంది.

బాత్‌రూమ్ వైపు నడిచింది.

ప్రతిరోజు తన దినచర్య ఇలాగే ఉంటుంది. ..దటీజ్.. ధనలక్ష్మి.

'ధన'.. లక్ష్మి

'ధన్'.. లక్ష్మి

అటు బంగాళాఖాతాన్ని ఇటు అరేబియా సముద్రాన్ని తన రెండు కళ్లలో నీలంగా నిలుపుకుని, దేశంలాంటి దేహాన్ని నగరం నాలుగు చెరగులా పరచి పలు జీవితాల్ని సులువుగా ఆటాడిస్తూ, మెలకువతో జీవితాన్ని గడుపుతోంది.

ఆగర్భ శ్రీమంతులు.. అధికార అనధికారులు.. రాజకీయ నాయకులు ఒక్కరేమిటి? అందరికీ కేంద్ర బిందువు, వరాల సింధువు 'ధన్..'లక్ష్మి. 'ధన' లక్ష్మి!

ఒక్కసారి కనురెప్పలు విప్పి చూసిందో.. ఉక్కిరిబిక్కిరి కావాల్సిందే!

పెదాల చివరి నుంచి ఒక్క నవ్వు అలవోకగా జారవిడిచిందో.. గుండె స్థానభ్రంశం చెందాల్సిందే!

నోరువిప్పి ఒక్క పలుకుముక్క విసిరిందో మనసు చుక్కల లోకం చూడాల్సిందే!

దటీజ్ 'ధన్.. లక్ష్మి.. ధనలక్ష్మి..

అలియాస్.. 'లక్కీ'!

హైదరాబాద్ నగరానికి పెళ్లయిన కొత్తలో వచ్చింది.

పెద్దగా చదువుకోలేదు.

అప్పుడప్పుడు తనలాంటి ఆడాళ్ల మధ్య కూచొని బీరు సేవిస్తూ మత్తుగా నెల్లూరి యాసలో గమ్మత్తుగా మాటాడుతుంటే.. నవ్వాలో.. జీవితంలో తను ఏమైపోతుందోనని.. ఏడ్వాలో.. అర్థం కాదు.. దగ్గరగా గమనించిన వాళ్లకి.. కానీ..

హైదరాబాద్‌కి వచ్చిన కొత్తలో ఇంటి బయటికి రావాలంటే భయపడేది ధనలక్ష్మి. భర్త రమేష్ తోడు లేనిదే గడప దాటేది కాదు. రమేష్ సేల్స్ రిప్రజెంటేటివ్‌గా పనిచేసేవాడు. తన జోన్ పరిధిలో తిరుగుతూ వారానికి రెండు రోజులు మాత్రమే ఇంట్లో ఉండేవాడు. ఉన్న ఆ రెండ్రోజులు కాసేపు తిండి, కాసేపు మాటలు, కాసేపు శృంగారం, కాసేపు నిద్ర.. ఫర్లేదు.. సాఫీగానే.. జీవితం సాదాసీదాగా సాగిపోయేది.

రమేష్ క్యాంపుకెళ్లిన తరువాత బట్టలు ఉతుక్కోవడం, వంట వండుకోవడం, తినడం, పడుకోవడం.. ఇంటిని శుభ్రపరుచుకోవడం మినహా పెద్ద పనులు ఉండేవి

## కొత్తగాలి...

**ఏ పుట్టలో ఏ పాముందో**
**పాత సామెత!**
**ఏ బ్యాంకులో ఎంత రష్షుందో**
**కొత్త సామెత!**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

కావు. జీవితాన్ని పెద్ద పెద్ద కోరికలతో ఏనాడూ ఊహించుకోనూ లేదు. రమేష్‌కి వచ్చే జీతం, టి.ఎ. అలవెన్స్‌లతో జీవితం హాయిగా గడిచిపోయేది.

ఒకరోజు..

రమేష్ రావడం.. రావడంతోటే ఆనందంతో ముఖం వెలిగిపోతూ వచ్చాడు.. కారణం ప్రమోషన్ వచ్చిందని చెప్పాడు.

జీతం ఎంత పెరిగిందని అడగటం కూడా తెలియక తనూ ఆనందించింది.

కంపెనీలో జీతంతోపాటు గౌరవం మరి కాస్త పెరిగిందని చెప్పాడు.. తనూ సంతోషించింది.. ఆనాటి నుండి అందుకు తగినట్లుగానే అలవాట్లు పెరిగాయి. అంతకు మునుపు ఆ అలవాట్లన్నీ వున్నా.. ఇంటి దాకా రానివ్వక.. జాగ్రత్తగా మెయిన్‌టెయిన్ చేసేవాడు.. కానీ ప్రస్తుతం ఇంట్లోనే అంగడి తెరిచాడు.

మొదట్లో బాధపడింది.

ఆ తరువాత రాను రాను.. బాధపడటం అలవాటయింది.

ఆ అలవాట్లు అంతటితో ఆగిపోయి వుంటే బావుండేది. కట్నం ఎక్కువ తేలేదని.. చదువులేని మొద్దువని.. ఉద్యోగం లేదని.. సంపాదన లేదని.. ఉన్న గంటసేపులో అరవై నిమిషాలు వేధించడం ప్రారంభమయింది. సొంత ఇల్లు.. సొంత కారు.. సొంత భూమి.. లేదని తన కోరికల్ని ప్రతిపూట ఏకరువు పెట్టడం మొదలయింది. ప్రమోషన్ మూలంగా ఫీల్డ్ వర్క్ తగ్గింది. పనులన్నీ ఫోన్ల మీదనే జరిపించడంతో ఇంటి దగ్గరే వుండటం జరుగుతోంది. సేల్స్ పెరిగిపోతున్నందున ఎవరైనా రమేష్ మీద కంప్లయింట్ చేసినా 'కంపెనీ' పట్టించుకునేది కాదు. కంపెనీలకు కావాల్సింది టార్గెట్‌ని క్రాస్ చేయడం.. అదే ముఖ్యం. ప్రతి నెలా టార్గెట్‌ని మించి చేస్తుంటే రమేష్‌నే కాదు.. ఎవరినీ డిస్టర్బ్ చేయరు..

రమేష్ ఇంటిపట్టునే ఎక్కువ రోజులుండటంతో ధనలక్ష్మికి ఇదివరకటి వారానికి రెండురోజుల సుఖం పోయి, రమేష్ వేధింపులతో నెలకు ముప్పై రోజులు.. రోజుకు ఇరవై నాలుగు గంటలు, గంటకి అరవై నిముషాలు.. నిముషానికి అరవై క్షణాలు.. క్షణం.. క్షణం.. బాధ, దుఃఖం.. నరకం అగుపించేది. నరకం పూర్తిగా.. అనుభవించేది.

★ ★ ★

మనిషి, జంతు దశనుండి విడిపోయిన క్షణం నుంచి.. నిద్ర.. తిండికే గాక, శారీరకంగా శ్రమపడని దిశలోకి మళ్ళుతూ శారీరక సుఖాలనిచ్చే సౌకర్యాలకి వెళుతుండటం జరుగుతున్న పరిణామం. ఈ దశలోనే కొందరు మనుషులు మనుషులన్న స్పృహ కోల్పోయి క్రూరులవుతున్నారు. జంతువుల్ని ఆహారంగా తీసుకోవడమన్నది కొన్ని జంతువులకి ప్రకృతి పరంగా సంక్రమించిన సహజగుణం. కానీ, మనిషి జంతువు కంటే వికృతంగా మారి క్రూరంగా కర్రలతో, రాళ్ళతో, లోహాయుధాలతో, అణు ఆయుధాలతో మహామారణాయుధాలతో సామూహికంగానే గాక, ఒకరినొకరు మట్టు బెట్టుకునే విధంగా ప్రవర్తిస్తాడని నాటి అనాగరికదశనుండి నేడు నాగరికమనే దిశవరకు నిరూపితమవుతూనే వుంటోంది. స్వార్థం, ఆధిపత్యం, వికృత సుఖలాలసత్వంతో మనిషన్న మాటే మరిచిపోతున్న సంఘటనలు మన చుట్టూ స్పష్టంగా కనిపిస్తున్నాయి.

మనిషి ఒక దురలవాటుని పరిచయం చేసుకోవడంతోటే మరో దురలవాటుకు అలవాటు పడటం ఆనవాయితీగా చూస్తుంటాం. మొదట దొంగచాటుగా సిగరెట్ తాగడంతో మొదలైన ఓ దురలవాటుని అందరూ చూస్తుండగానే మద్యం సేవించే విధానాన్ని గమనిస్తుంటాం. ఏ అలవాటైనా మితిమీరనని చెప్పే ప్రబు

# ట్విటర్, ఫేస్‌బుక్, వాట్సప్‌లు లేవక్కడ!

చతుర సమాచారం

ఇంటర్నెట్ మీద చాలా దేశాలు అనేక నిషేధ చట్టాలు విధించాయి. ఆ వివరాలు..

★ యు.ఎ.ఇ. దేశాల్లో పోర్నోగ్రఫీకి చెందిన అన్ని వెబ్‌సైట్లు, ఛాట్‌రూములు, డేటింగ్ సైట్లు, స్కైప్, ట్విటర్ లాంటివి నిషేధించారు. దాంతో కొన్ని వికీపీడియా పేజీలు అక్కడ తెరుచుకోవు.

★ ఇంటర్నెట్ వల్ల కాలం, డబ్బు వృథా అన్న అభిప్రాయంతో 2010 నుంచి జోర్డాన్ ప్రభుత్వం యాభైకి పైగా వెబ్‌సైట్లను బ్లాక్ చేసింది.




★ ప్రపంచంలో ఇంటర్నెట్‌ని అధికంగా ఉపయోగించే టాప్‌టెన్‌లో సౌత్‌కొరియా ఒకటి. పదివేల మందికి పైగా చదివే వెబ్‌సైట్‌లో నేషనల్ ఐడెంటిటీ నంబర్ని ఇవ్వకుండా ఏది పోస్టు చేసినా, చివరికి కామెంటైనా ఐదు సంవత్సరాలు జైలు శిక్ష విధిస్తారు.

★ క్యూబాలోని ఇంటర్నెట్ కేఫ్‌లో జాతీయ, అంతర్జాతీయ కనెక్షన్లు ఉంటాయి. జాతీయ కనెక్షన్‌లో ప్రభుత్వం నడిపే ఈ మెయిల్ సేవ మాత్రమే ఉంటుంది. అంతర్జాతీయ కనెక్షన్లు రాష్ట్ర ప్రభుత్వానికి తప్ప ప్రజలకు అందుబాటులో ఉండవు.

★ బర్మాలోని సైనిక ప్రభుత్వం ప్రజలకి ఇంటర్నెట్‌ని అందుబాటులో ఉంచదల్చుకోలేదు. దాంతో ఇంటర్నెట్ ఫీజ్ చాలా ఎక్కువే. గంటల లెక్కన చాలా చెల్లించాలి. మోడెమ్స్‌ని అక్రమంగా దిగుమతి చేసుకుంటే పది హేను నుంచి అరవై ఐదు ఏళ్ల జైలు శిక్ష విధిస్తారు.

★ మొరాకోలో ఇంటర్నెట్ సెన్సార్‌షిప్ లేదు. కానీ ప్రభుత్వం, టెలికం ఆపరేటర్లు తమ ఇష్టం వచ్చిన సైట్లని నిషేధిస్తూ మళ్లీ నిషేధాన్ని ఎత్తేస్తున్నారు. ఆ రకంగా యూట్యూబ్, గూగుల్‌లని కూడా నిషేధించారు.

★ ఆఫ్ఘనిస్తాన్‌లో ఫేస్‌బుక్, ట్విటర్, పెళ్లిళ్లు కుదిర్చే సైట్లు, ఆల్కహాల్, సెక్స్, గాంబ్లింగ్ సైట్లు మొదలైన అన్ని సోషల్ వెబ్‌సైట్లని నిషేధించారు.

★ లక్షలాది వెబ్‌సైట్లు తమ దేశంలోకి రాకుండా చైనా నిషేధిస్తోంది. అరవైకి పైగా ఇంటర్నెట్ నియమాలు ఆ దేశంలో అమలులో ఉన్నాయి.

ద్ధులు అతిమీరి ప్రవర్తించడం, చివరికి మాన ప్రాణాల్ని కూడా హరించడానికి వెనుకాడరని ప్రత్యక్షంగా చూస్తున్నాం. సంపాదనల్లో నేడు సులభంగా ధనం సంపాదించడమన్నది నగరాల్లో తొండలా ప్రవేశించి కొండచిలువగా మారిందనడంలో సందేహంలేదు. ధనం సంపాదించడమన్నది సక్రమమో, అక్రమమో, అవినీతి వ్యవహారమో, వ్యభిచారమో అది ఏ రూపంలోంచి వచ్చినా ఆనందంగానే ప్రీతితో స్వీకరిస్తున్న వ్యక్తులు.. మనుషులమనే ముసుగేసుకున్న క్రూర జంతువులు తామర తంపరగా పెరిగి పోతున్నారనడంలో సంశయమక్కర్లేదు.

రమేష్ ప్రస్తుతం అన్ని దురలవాట్లకి కట్టుబానిసగానే గాక పీకలోతుల్లో ఆర్థిక దుస్థితిలో మునిగిపోయాడు. ఈ క్రమంలో తన ఉద్యోగ ధర్మాన్ని విస్మరించడంతో కంపెనీ నుంచి ఉద్వాసన వాసనలు ఘాటెత్తి పోటెత్తిస్తున్న తరుణంలో 'సులభ సంపాదన' వైపు మెదడులో దురాలోచన పాకుతూ కంటికి అగుపించిన వాటినల్లా కాటెయ్యాలని చూడడం మొదలయ్యింది. ధనాన్ని సంపాదించాలంటే ఎంతోకొంత పెట్టుబడి అవసరం. వ్యాపార లావాదేవీల్లో లాభాలకి వ్యవహరించే తీరులో తెలివి అత్యవసరం. ఆ రెండూ మొదట్లో అంతో ఇంతో వున్నా ప్రస్తుత

శాశ్వత వ్యసనాలలో అవి మూసుకుపోయాయి. ఈ పరిస్థితుల్లో తనకి తోచిన ఏకైక మార్గం పెట్టుబడి లేని వ్యాపారం.. తాళి కట్టిన తన భార్యేనని అనుకోవడానికి ఎక్కువ సమయం పట్టలేదు..

★ ★ ★

"పార్టీ వుంది.. బయటికెళ్ళాలి.. తయారు కమ్మని" చెప్పాడు ధనలక్ష్మితో ఓ రోజు రమేష్.

పెళ్ళినాటి పట్టుచీరతో..

నుదుటున రూపాయి బిళ్ళంత బొట్టుతో, మల్లెల జడతో..

తుమ్మెద రెక్కల్ని అతికించుకున్న కాటుక కనురెప్పలతో..

అచ్చం పదహారణాల తెలుగింటి ఆడపడుచుగా మహాలక్ష్మిగా తయారయింది.. ధనలక్ష్మి.

ధనలక్ష్మిని రోజూ చూస్తున్నా.. ఈ రోజు నిండుగా చూసేసరికి కొన్ని క్షణాలు కనురెప్ప వేయడం మరిచిపోయాడతడు.

అందానికి ముగ్ధుడై నోటమాట పెగలలేనివాడుగా మౌనంగా వుండిపోయాడు. కాసేపట్లో తేరుకుని నవ్వుకున్నాడు. ఇక నుంచి ధనలక్ష్మి తన పాలిట సాక్షాత్తు లక్ష్మిగానే, మహాలక్ష్మిగానే తలచాడు.. 'ధన' లక్ష్మిగానే నిర్ధారణ చేసుకున్నాడు.

"మనం వెళుతున్నది.. పేరంటానికి కాదు.. పార్టీకి.. ద రిచెస్ట్ పర్సన్స్‌తో, మోస్ట్ క్లాసికల్, కాస్ట్‌లీ పార్టీకి.. ఇలా తయారయితే నవ్వుతారు" అంటూ రమేష్.. ముందే తెచ్చివుంచిన జీన్స్‌ప్యాంట్, టీషర్ట్ తన బ్యాగ్‌లోంచి తీసిచ్చాడు.

ఆ బట్టల్ని వేసుకోడానికి ధనలక్ష్మి అయిష్టత తెలియచేసినా.. అతని నాన్‌స్టాప్ కోపం ముందు.. గంట తరువాత ధరించక తప్పలేదు.

ఆ దుస్తుల్లో తనని చూడటంతో రమేష్ పెదాలపై ఓ వంకర నవ్వుతో విప్పారిన ముఖం ఆమెకి ఇప్పటికీ గుర్తుంది.

రాత్రి తొమ్మిది గంటలయింది.

ఇంటిముందు టాక్సీ ఆగింది.

ఎక్కడికెళ్ళాలో టాక్సీ డ్రైవర్‌కి ముందే చెప్పడం వలన కారు రోడ్డుపై వేగంగా దూసుకుపోతోంది. ధనలక్ష్మి మాత్రం ఆ మాడ్రన్ డ్రెస్‌తో అనీజీనెస్‌తో అటుఇటు కదులుతోంది.

రాత్రి తొమ్మిది గంటల నలభై అయిదు నిమిషాలవుతోంది. కారు బంజారాహిల్స్‌లోని 'హ్యాపీ క్లబ్-పబ్' ముందు ఆగింది.




"ఎవరినైనా పరిచయం చేస్తే సోషల్‌గా బిహేవ్ చేయాలని.. మూవ్ కావాలని.." టాక్సీలో ప్రయాణిస్తున్నంత సేపూ సూచిస్తూనే వున్నాడు రమేష్.

"అంటే!" అన్న ఆమె ప్రశ్నకు.. షేక్‌హాండ్ ఇస్తే షేక్ హాండ్ ఇవ్వాలని.. హగ్ చేస్తే హగ్ చేయాలని, మనిషిని హత్తుకోవాలని తెలియజేశాడు. అలా చేసేది తనలాంటి ఆడాళ్ళతో అనుకుంది గానీ.. మగవాళ్ళతో అని పబ్‌లోకి వెళ్ళాకే తెలిసిందామెకు.

పబ్ డోర్ ముందు ఆగగానే ఇరువురికీ చేతులపై రబ్బర్ స్టాంప్ వేశారు.

పబ్ తలుపు తెరచి అడుగేయగానే బౌన్సర్ తలొంచి స్వాగతం పలికాడు.

ఊఫర్స్ నుంచి వచ్చిన విపరీతమైన మ్యూజిక్ సరిగ్గా ధనలక్ష్మి గుండెని బాదినట్టయింది. ఒక్కసారిగా వచ్చిన విపరీత

మయిన శబ్ద ప్రకంపనలకి ధనలక్ష్మి శరీరం భయకంపితమయింది. వెనక్కు వెళదామనిపించింది. కాని మొదట్లో ఇది మామూలే అన్నట్టు ధనలక్ష్మి చేయి పట్టుకుని రమేష్ లోనికి కదిలాడు.. చెంపలకు చల్లదనం చందనంలా మెత్తగా, మృదువుగా తాకుతోంది గానీ.. విపరీతమైన శబ్దంతో గదంతా భీకరంగా తోచింది.

స్టీవార్డ్ ఎదురొచ్చి కూచోవడానికి ఖాళీగావున్న టేబుల్ వైపు తీసుకెళ్ళాడు.

నల్లని దుస్తుల్లో కండలు తిరిగిన శరీరాలతో పబ్బులోని ప్రతి ఒక్కర్ని అలవోకగా చూస్తూ తీక్షణమైన చూపుల్తో గమనిస్తున్నారు బౌన్సర్స్. వారివైపు చూడబోతున్నామని తెలిసేసరికి తమ చూపుల్ని తిప్పి మరొకరిని బౌన్సర్స్ గమనించడం జరుగుతోంది. కేవలం పరిశీలన కోసమే కాదు. ఏ చిన్న గొడవ జరిగినా.. జరగబోతోందని తెలిసినా.. ముందే పసిగట్టి క్షణాల్లో వారి ముందు వాలిపోతారు. మర్యాదగానే సర్ది చెబుతారు. వినకపోతే మర్యాదగానే బయటికి తీసుకెళ్తారు.. మితిమీరితే.. తమ ట్రీట్‌మెంట్ రుచి చూపిస్తారు.

పబ్‌కొచ్చే మనుషులు సామాన్యంగా గొడవకు దిగరు. ఎప్పుడైనా డ్యాన్స్ ఫ్లోర్‌లో డ్యాన్స్ చేసేప్పుడు వెకిలిగా ప్రవర్తించడం జరుగుతుంటుంది. కానీ క్షణాలలోనే అటువంటి వారిని పక్కకు తొలగించడం చేస్తుంటారు బౌన్సర్స్.

పబ్‌లోకొచ్చిన మనుషులు తమకు కావల్సినవన్నీ పెదాలతోనూ చూపులతోనూ సఫలీకృతం చేసుకుంటుంటారు. ఇక గొడవలతో పనేముంది?

ధనలక్ష్మికి మాత్రం ఏదో ఓ కొత్త గ్రహంలోకి వచ్చిన అనుభూతి కలుగుతోంది. మసక మసక వెలుతురుతో చీకటిగదిలో మంచుపరదాలు ఊగుతున్నట్టుంది.

ఏం జరుగుతోందో.. ఏం జరగబోతోందో అర్థం కావడం లేదు. పరిసరాలను చారెడంత కళ్ళతో పరిశీలిస్తోంది.. కానీ చాలామంది కళ్లు ఆమెనే గమనిస్తున్నాయని ఆమెకు తెలియడం లేదు.

కారణం..

రెగ్యులర్‌గా వచ్చే వాళ్ళందరూ.. ఈ కొత్తగా వచ్చిన స్టన్నింగ్ బ్యూటీ ఎవరా? అని ఆలోచిస్తున్నారంటే.. ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు.

ఎందుకంటే..

అందం ఆమెకు పాదాభివందనం చేస్తోంది. రింగులు తిరిగిన కురులు ఆమె తలలో నల్లగులాబీలు పొదిగినట్టున్నాయి. లేలేత కొబ్బరి గుజ్జులో చందనం కలిపినట్టు ఆమె చర్మం సువర్ణకాంతులీనుతోంది.

కన్నులు రెండు, ముక్కలు చేసి అతికించుకున్న నీలాకాశాన్ని తలపిస్తున్నాయి.

తేనెను నింపుకున్న భరిణెల్లా తీయని ధారను కొసలలోంచి వొలకబోస్తున్నాయి, ఆమె కంటిపాపలు.

అప్పుడప్పుడే మంచుతో కడిగిన ఆపిల్ ముక్కల్లా పెదాలు ఎర్రగా నిగనిగలాడుతున్నాయి. బిగుతుగా వేసిన టీషర్ట్‌లోంచి ఉబికిన వక్షోజాలు జలంతో నిండిన మేఘభాండాలైనాయి. అమాయకంగా చుట్టూ పరికిస్తున్న ఆమె చూపుల పరికిణీల కుచ్చిళ్ళు అందరి ముఖాలపైకి వెన్నెల కుప్పల్ని తన్నినట్టున్నాయి.

ఆమె అణువణువు చూపరులకి నక్షత్ర మండలాన్ని చూపిస్తున్నాయి.

మంచు పొదో.. మాయతుమ్మెదల రొదో.. పబ్ మొత్తం మల్లెల సౌరభం తెల్లగా వెదజల్లినట్టుంది.

పబ్‌లోని అందర్నీ ఆమె అమాయక అందం మంత్రముగ్ధుల్ని చేస్తోంది.

మాడ్రన్ జీవితాలకు

పబ్ ఓ మంత్ర నగరి

మందుతో చిందులేసే వారికి పూనకం తెప్పించే మహమ్మారి

మాటలు వినిపించక చూపులతో కొత్త

కొత్త వారిని సరికొత్తగా కవ్వించే గడసరి

మత్తుని నింపుకున్న నిగనిగలాడే సీసాలతో అద్దంలాంటి సొగసరి

పర్సులోంచి తీసే కరెన్సీపై ఆధారపడి పరిచయమైన ప్రతి ఒక్కరికి గమ్మత్తుని విరజిమ్మే వెన్నెల సిరి

పొరపాటున అలవాటయితే మాసిపోని మాయని లేనిపోని జబ్బుగా మారే మందోపదేశ దిమ్మరి

కైపును ఒయాసిస్‌గా భావించే వారికి గమ్యం చూపని ఎండమావుల దారి

అప్పటికి.. ఆ క్షణానికి.. అందరూ ఒక్కటేనని భ్రమింపచేసి మరుసటి రోజు అడ్రసు రాయని ఉత్తరంలా ఎవరికి ఎవరో తెలియని ఒంటరి.

పబ్..

భావనలో స్వర్గం..

కాలక్రమాన నరకం..

మధ్యతరగతి మనిషికి నగరం నడిబొడ్డులో వెలసిన అచ్చమైన ఎడారి.

రమేష్ మొబైల్ వెలిగింది.

ఊఫర్స్ నుంచి వచ్చే శబ్దంలో మొబైల్ మోగినా వినిపించదని టేబుల్ మీదనే వుంచాడు. ఆత్రుతగా మొబైల్‌ని వెంటనే ఆన్ చేశాడు. చుట్టూ చూస్తూ తన టేబుల్ ఎక్కడుందో అవతలి వారికి చెప్పాడు.

కాసేపట్లో..

ఇద్దరు పురుషులు, ఒక స్త్రీ తమ టేబుల్ దగ్గరికొచ్చారు.

రమేష్ లేచి విష్ చేశాడు.

సైగలతో ధనలక్ష్మిని పైకి లేచి విష్ చేయమన్నాడు. కానీ ఆమెకు అర్థం కాలేదు. తనే వారికి సీట్లు ఆఫర్ చేసి కూర్చోపెట్టాడు.

ధనలక్ష్మి కూచుందా! నిలుచుందా! విష్ చేసిందా! అనే విషయాన్ని మరచి వచ్చిన వాళ్లు మంత్రంతో తంత్రంతో అంత్రం కట్టిన బొమ్మలై కూచున్నారు.

"సునీతా! మీట్ మై మిసెస్.. లక్ష్మి" అన్నాడు రమేష్ పరిచయం చేస్తూ..

"హలో! నైస్ టు మీట్ యు" నవ్వునంతా లిప్‌స్టిక్ పెదాల నుంచి వొలకబోస్తూ సునీత చెయ్యి చాచింది.

అప్రయత్నంగానే ధనలక్ష్మి తను చేయి చాచి షేక్‌హ్యాండ్ ఇచ్చింది.

సునీత మాటాడుతున్నప్పుడు లిప్‌స్టిక్ జిగట బలవంతంగా పెదాల్ని లాగినట్టు సాగదీస్తోంది.

"అండ్ మీట్.. మిస్టర్ శ్రీకాంత్.. అండ్.. రవి" అంటూ భార్యకు పరిచయం చేశాడు రమేష్.

శ్రీకాంత్ షేక్ హ్యాండ్ ఇవ్వడానికి చేయి చాచాడు.

అంతకు మునుపే.. రమేష్ కొరకొర చూపుల కోరలకి భయపడి వెంటనే చేయందించింది ధనలక్ష్మి.

శ్రీకాంత్‌కి షేక్‌హ్యాండ్ ఇస్తుంటే బెరుకుగా తోచింది. తను తాకీ తాకనట్టు మునివేళ్ళతో సున్నితంగా తన వేళ్ళను తగిలించాడు.

రవి మాత్రం తన చేతిని గట్టిగా నులిమినట్టు షేక్‌హ్యాండ్ ఇచ్చాడు.

"రమేష్! హౌ బ్యూటిఫుల్ వైఫ్ యార్! అమేజింగ్.. యు.. సో లక్కీ! షి లుక్ లైక్ వైజయంతి మాల ఇన్ వోల్డ్ ఫిల్మ్, అండ్ మందాకిని ఇన్ న్యూ ఫిల్మ్.. బ్యూటిఫుల్ స్ట్రక్చర్!" చూపుల్ని ధనలక్ష్మి వక్షస్థలంపై కేంద్రీకరించి అంటున్నా.. సంస్కారం.. కు..సంస్కారం అన్నవి తెలియని.. మరిచిపోయిన పదాలుగా, భావాలుగా అక్కడ మారిపోయాయి.

రవి.. రమేష్ పనిచేసే కంపెనీ సి.ఇ.ఓ. శ్రీకాంత్ మరో ఫార్మసి కంపెనీకి యజమాని.

సునీత శ్రీకాంత్ పర్సనల్ అసిస్టెంట్.

శ్రీకాంత్ మౌనంగా ధనలక్ష్మి అందాల్ని చూపులతో సిప్ చేస్తూ కన్నుల గిన్నెల్లోకి వంపుకుంటున్నాడు.

# అంధులకోసం ప్రత్యేక లేబుళ్లతో బీర్!

చతుర సమగటుట

మనదేశంలో బీర్ ప్రేమికులకి తెలిసిన ఒకే ఒక రకం వేగర్. కానీ ప్రపంచంలో అనేక రకాల బీర్లు అందుబాటులో ఉన్నాయి.

★ బీర్ + మిల్క్ కలిపి చేసిన బీర్ పేరు బిల్క్. జపాన్‌లోని హొక్కైడోలో గల ఓ బ్రీవరీ ఈ బీర్‌ని మార్కెట్‌లోకి కొత్తగా ప్రవేశపెట్టింది. ఇందులో మూడో వంతు పాలు, మిగిలింది బీర్. ఇది ఫ్రూట్ ఫ్లేవర్‌లో ఉండడంతో ఆడవాళ్ళు అధికంగా కొంటున్నారు.



★ అంధుల కోసం డస్సెల్ డార్ఫ్ బ్రాండ్ బీర్‌ని బ్రెయిలీ భాషలో ముద్రించిన లేబుళ్లతో విడుదల చేశారు. తమ నోట్లోకి ఏం వెళ్తుందో రుచిని బట్టి కాక ముందే తెలుసుకునే అవకాశం ఈ లేబుల్ అందిస్తోందని తయారీదారులు చెప్తున్నారు.

★ షాంపేన్, బీర్ కలిపి చేసిన షాంపేన్ వేగర్ బీర్ అమెరికాలో విరివిగా దొరుకుతోంది. దీనిలో షాంపేన్ తయారీలో ఉపయోగించే ద్రాక్ష పళ్ళు, బీర్ తయారీలో ఉపయోగించే హాప్స్ వాడుతున్నారు. ఒక్కో సీసా ఖరీదు 12 డాలర్లు.

★ చికాగోకి చెందిన టామ్ సీఫర్త్ పీజా రుచి గల బీర్‌ని తయారు చేసి స్థానికంగా అమ్ముతున్నాడు. ఇందుకోసం పీజాల్లో వాడే టొమటో, వెల్లుల్లి, తులసి ఆకులు మొదలైనవి వాడి ఆ రుచిని తెప్పిస్తున్నారు. వీటిని స్థానిక ఇటాలియన్ రెస్టారెంట్లలో సర్వ్ చేస్తారు.

★ జపాన్‌కి చెందిన సతోషీ టొమోడా పిల్లల కోసం బీర్‌ని ఉత్పత్తి చేస్తున్నాడు. దీని పేరు 'కిడ్స్ బీర్'. ఆల్కహాల్ లేని ఈ బీర్ ఏటా 10 లక్షల సీసాలు అమ్ముడవుతోంది.

★ స్టాంపెడీ బ్రాండ్ బీర్‌లో బి విటమిన్, ఫోలిక్ యాసిడ్, ఇతర విటమిన్లూ ఉంటాయి. అమెరికాకి చెందిన లారెన్స్ ఈ విటమినైజ్డ్ బీర్‌ని తయారుచేసి అమ్ముతున్నాడు.

★ ప్రపంచంలోని ఖరీదైన బీర్ సీసా 110 డాలర్లు! ఏడాదికి 8 వేల బాటిల్స్‌ని మాత్రమే బోస్టన్ బీర్ కంపెనీ విడుదల చేస్తోంది.

సునీత ఆ విషయాన్ని అందరికంటే ముందే పసిగట్టింది.

సునీత శ్రీకాంత్ పి.ఎ.. కంపెనీ.. పి.ఎ.. అనేకంటే శ్రీకాంత్ అన్ని అవసరాల్ని తీర్చే.. అన్ని విధాల వుపయోగపడే.. అంటే సరిపోతుందేమో..

స్టీవార్డ్ టేబుల్ దగ్గరికి నవ్వుతూ వచ్చాడు..

ధనలక్ష్మి వెనుకనుంచి రవిని చూస్తూ..

మామూలుగా వచ్చే రెగ్యులర్ కస్టమర్స్‌ని, టిప్స్ భారీగా ఇచ్చేవారిని ఏ స్టీవార్డ్ మరిచిపోడు. నవ్వుతూనే అన్నీ సమకూరుస్తారు. టేబుల్ సమీపానికి వచ్చి ధనలక్ష్మిని చూసి కనురెప్పలు కొట్టని శిల్పంగా నిలుచుండిపోయాడు.. స్టన్నింగ్ బ్యూటీ ముందు స్టాచ్యూ అయ్యాడు..

ఎంతో మందిని చూశాడు.. అలంకరించుకున్న అందాల్ని తను చాలానే చూశాడు కానీ, అన్నీ అమరిన ఆకాశాన్ని ఈరోజే చూస్తున్నాడు. మామూలుగా.. స్టీవార్డ్‌లెవరూ అలాగే చూస్తూ వుండిపోరు.. మానర్స్‌ను మరచి ఎదుటివారికి అసహనం కలిగించరు..

కానీ.. ఆమె అందం పాలుపోసి పెంచిన ఓ మల్లెపువ్వు.. చంద్రమండలాన్ని విడిచి నేలకు నడిచి వచ్చినట్టుంది. మొదటి ఊపిరి తీసే క్షణం నుంచి చివరి ఊపిరి పోయే క్షణం దాకా ఏ మనిషినైనా

## కొత్తగాలి...

**గంధర్వులను**
**గానగంధర్వులను చేయ**
**గగనానికెళ్లేడు**
**విశ్వరూప సంగీతశాస్త్రజ్ఞుడు**
**మంగళంపల్లి!**

*– అంబటి వెంకట శివారెడ్డి,*
యర్రగుంట్ల, కడప జిల్లా

నిట్టనిలువునా నిలబెట్టి తీరుతుంది.

ఎవరికి ఏం కావాలో సునీతకి బాగా తెలుసు.. బా..గా తెలుసు. అందుకే క్షణాల్లో 'మెను' చూడకనే ఆర్డర్ చేసింది. ఎవరూ తనను అడగకనే అన్నీ అందించే మనస్తత్వంతో, తను అన్నీ పొందగలిగే సామర్థ్యం వున్న వనిత సునీత.

కానీ.. ధనలక్ష్మి దగ్గరే ఆగిపోయింది.

"లక్ష్..మి.. వాట్స్ యువర్ బ్రాండ్?" అడిగింది సునీత.

ధనలక్ష్మి రమేష్ వైపు చూసింది.

రమేష్ "మార్గరెట్" అన్నాడు.

"ఓ.. ఫైన్ చూజ్.." నవ్వుతూ సునీత ధనలక్ష్మి వైపు చూసింది.

స్టీవార్డ్ ఆర్డర్ తీసుకుని వెళ్ళిపోయాడు.

రవి గలగల మాట్లాడుతున్నాడు. శ్రీకాంత్ మౌనంగా ధనలక్ష్మిని చూస్తున్నాడు.

సేల్స్ బాగా పెరగడానికి రమేష్ చేస్తున్న కృషిని సునీత శ్రీకాంత్‌కి కళ్ళు చారెడంత చేసి చెబుతోంది. అంతేకాదు.. అందమైన అర్ధాంగిని పొందినవాడే.. ఆ అందాన్ని అలవోకగా సంపాదించుకున్న వాడే.. ఈ ప్రపంచంలో అత్యంత ధనికుడని.. రమేష్‌కే ఆ అర్హత అందిందని.. ఇక నుంచి ధనలక్ష్మిని.. లక్కీ అని పిలుస్తానని.. అందరూ అలాగే పిలవండని.. లొడలొడ వాగేస్తోంది.

స్టీవార్డ్ డ్రింక్స్ తెచ్చాడు.

మండుతున్న సీసాలతో ఫ్లయర్ విన్యసిస్తున్నాడు.

ధనలక్ష్మి.. ఉరఫ్ 'లక్కీ'కి అయిదు శాతం కూడా ఈ పబ్ ప్రపంచం అర్థం కావడంలేదు.

డ్రింక్స్ చేతుల్లోకి తీసుకున్నారు.

రమేష్ చీర్స్ చెబుతూ.. సైగ చేస్తే బావుండదని తన గ్లాసుని ఎడమచేత్తో ఎత్తి కుడిచేత్తో మార్గరెట్ డ్రింక్‌ని లక్కీ పెదాలకి అంటించి సిప్ చేయించాడు.

"వాట్..ఎ.. కాంబినేషన్.. యార్.. భార్యను ఇంత బాగా చూసుకోవడం.. తన చేతుల్తో ముద్దనే కాదు మందునీ ఇవ్వడం, పెదవుల్తో పేరునే కాదు ముద్దుని అందివ్వడం.. అందరిలోనూ అందరికీ చేతగాని విధానం.. అది రమేష్‌కే చెందడం లక్కీ అదృష్టం" ఏమాత్రం తటపటాయించక అన్నాడు రవి, తన పెదాలను కొరుకుతూ.. లక్కీని చూస్తూ..

సభ్యత సంస్కారం అన్నవి ఏనాడో తగలేసిన ఓ క్రూకెడ్ కల్చర్.. కల్చర్ అనడానికి మనసొప్పదు. సో కాల్డ్ సొసైటీ లో.. సోకాల్డ్ పర్సన్స్.. సోకాల్డ్ కల్చర్..

అందాన్ని ఆరాధించడం వేరు.. పొగడడం వేరు.. కెలకడం వేరు..

ఒకే సిప్‌లో డ్రింక్ మొత్తం తాగేశాడు శ్రీకాంత్.

సునీత అర్థం చేసుకుంది.

దగ్గరికి రమ్మని స్టీవార్డ్‌ని సైగ చేసింది.

"అంటక్విటి.. వన్‌మోర్ పెగ్.. అండ్ రవి.. యస్.. రమేష్.. యస్.. హె లక్కీ.. యూ ఆర్ వెరీ స్లో.. దిస్ ఈజ్ ఫస్ట్‌పెగ్ యా.. టేక్ ఇట్ ఫాస్ట్ అండ్.. ఓకే.. యస్.. నౌ ఆర్డర్ ఈజ్ త్రీ లార్జ్ అంటిక్విటి అండ్ వన్ మార్గరెట్ ఓకే" ఆర్డర్ చేసింది.

ఈసారి లక్కీకి తన చేతులతో డ్రింక్‌ని అందించింది సునీత. ధనలక్ష్మి.. లక్కీకి ఆ డ్రింక్.. ఏదో పుల్లపుల్లగా.. ఉప్పు

ప్పుగా... వగరువగరుగా.. జబ్బు పడ్డప్పుడు నిమ్మసోడా తాగినట్టుంది.

ధనలక్ష్మికి రమేష్ ముందే చెప్పాడు.. హాట్ డ్రింక్స్ మేం తీసుకున్నా నీకు కూల్ డ్రింక్ తెప్పిస్తానని.. అందుచేతనే మొదటి పెగ్ భయం లేకుండా తాగేసింది. గ్లాసు అంచుల్ని పెదాలు తాకిన క్షణం పులుపు ఉప్పు కలబోసిన రుచి తగులుతుంటే సులభంగానే గొంతులోకి జారింది ద్రవం. రెండో పెగ్ మొదలు పెట్టగానే దాని ప్రభావం మెల్లగా చూపుతోంది గానీ.. కొత్త వాతావరణం.. చెవులు చిల్లులు పడే శబ్దం.. బహుశా మసక వెలుతురూ.. కారణం కావచ్చునేమో అనుకుంటూ రెండో పెగ్‌ని రెండో సిప్‌చేసి ఎదురుగా వున్న రమేష్‌ని చూసింది. రమేష్ పక్కనున్న శ్రీకాంత్‌ని చూసింది.

శ్రీకాంత్ నవ్వీ నవ్వనట్టు పెదాల్ని కదిలించాడు. రవి వైపు చూసింది. రవి సునీత వైపు చూస్తూ లక్కీ ఎదపై దృష్టిని విసురుతున్నాడు.

సునీత రవిని కనురెప్పలతో మాటాడిస్తోంది.. చూసే వారికి ఏమాత్రం అనుమానం రాని విధంగా జరగబోయే శృంగారాన్ని 'నయనావధానం' చేస్తున్నారు.. ఇలా కొత్తవాళ్ళని కలిసినప్పుడల్లా రవి, సునీతతో గడపడం.. ఆ రాత్రి రవి, సునీత ఒక రాత్రిగా మారిపోవడం సహజం.. మామూలే.

కారణం..

కొత్తగా పరిచయమైన స్త్రీని ఆ రోజు సునీత హేండిల్ చేస్తుంది. రవి సహకరిస్తాడు. శ్రీకాంత్ ఆ స్త్రీని రాత్రంతా డ్రైవ్ చేస్తాడు. కొత్తకొత్త అనుభవాల కోసం మెత్తమెత్తని శరీరాలతో మత్తుమత్తుగా సుఖాలను తీర్చుకోవడానికి అలవాటు పడిన శరీరం శ్రీకాంత్‌ది.

డబ్బుంది..

చంచాగిరి చేసే రవి, సునీతలున్నారు.

అందుకే శ్రీకాంత్ మొదటి పెగ్‌ని ఒక్కసారిగా తాగేసినా రెండోపెగ్‌ని జస్ట్ సిప్ చేశాడు. పార్టీ ఎంత త్వరగా ముగిస్తే అంత మంచిదని ఆలోచిస్తున్నాడు.

రవి, సునీతల్లాంటి వ్యక్తులు తమకు పరిచయమైన మనుషుల బలహీనతల్ని కనిపెట్టి తాము అరేంజ్డ్ బ్రోకర్స్‌గా మారి ఓ వైపు డబ్బుని, మరో వైపు పదవిని, వెనక వైపు పెదవిని పొందడం నగరంలో జరుగుతున్న మామూలు వ్యవహారం.

సునీత వంటి పరు(పు)వు వ్యక్తులు.. పచ్చిగా చెప్పదలిస్తే పడుపు వ్యక్తులు లోకంలో బోల్డ్ మందేవున్నారు.. వీళ్ళకు వ్యక్తిత్వం కంటే డబ్బు ముఖ్యం.. అందరితోనూ అనుభవం పొందడం స్టేటస్ చిహ్నం. సొసైటీలో రిచ్ అన్నవారి అందరి జాతకాలూ తను నైటీలో చూశాననే మానసిక సంతృప్తి..

ఇలాంటి వ్యక్తులంతా.. చివరికి ఏ బ్రోతల్ కంపెనీలనో బహిరంగంగా నడుపుతారనడానికి ఏమాత్రం సందేహం, అణుమాత్రం ఆశ్చర్యం పడాల్సిన పనేలేదు. వీళ్ళకు రవిలాంటి వాళ్ళు 'పెట్'లు. ఎవరికి ఎవరూ దొరకనప్పుడు..

ఆ రాత్రికి సునీతే రవికి దిక్కు.

సునీతకి రవిలాంటివాడే కిక్కు.

పబ్‌లో డి.జె. పాటలతో అదరగొట్టేస్తున్నారు. 'ఐ గెట్ ఎ ఫీలింగ్' పాట ఊఫర్స్ నుంచి ఉబికుబికి వస్తోంది.

పెగ్‌మీద పెగ్ పడటంతో ఎనిమిదో పెగ్‌తో అవుటయిపోయాడు రమేష్.. టేబుల్‌పై మత్తుగా సోలిపోయాడు.. రెండో పెగ్‌తో 'లక్కీ' మారుమాట లేని మనిషై సునీత భుజంపై వాలిపోయింది.

"షల్.. వుయ్.. మూవ్.." పరిస్థితిని అర్థం చేసుకుని పైకి లేచాడు రవి.

సమయం పదకొండూ పది!

స్టీవార్డ్ వచ్చాడు.

బిల్ పే చేసి టిప్‌గా వెయ్యి రూపాయ

లుంచింది సునీత.

అందుకు కారణం, దాని అర్థం.. రమేష్‌ను పబ్‌లో వున్నవాళ్ళు మోసుకెళ్ళి ఇంట్లో చేర్చడం.

రవి, సునీతలు లక్కీ చేతుల్ని తమ భుజాలపై వేసుకుని లేవదీశారు.

రెండు కొండల నడుమ చంద్రబింబం పైకి లేచినట్టుంది.

శ్రీకాంత్ కళ్ళు మెరిసిపోతున్నాయ్..

కొత్త మత్తును అనుభవించబోతున్నందుకు రోమాలు నిక్కబొడుచుకున్నాయ్..

రవి కళ్ళు ఇలాంటి సన్నివేశాలకు అలవాటు పడ్డాయ్.. కొన్నాళ్ళ తరువాత ఆ మత్తుని తనూ అనుభవించడం జరుగుతుందని తనకు తెలుసు.. అంతవరకు తన ఖాతాలో డబ్బు చేరుతుందనీ తెలుసు.. ఇలాంటి విషయాలతో.. ఇలాంటి (రమేష్) వారిని వెతకడం రవికి ఓ వ్యాపారం.. అందుకు సహకరించడం సునీత వ్యవహారం.

రవి, రమేష్ భార్య అందం గురించి శ్రీకాంత్‌కి చెప్పడానికి కారణం.. తన కంపెనీలోని ఓ వర్కర్ పెళ్ళిలో ధనలక్ష్మిని చూడడంతో రవికి మతిపోయింది. ఎలాగైనా.. అనుకున్నాడు.. అందుకు ఖర్చుకాని మార్గం ఎన్నుకున్నాడు. ఇది సహజంగా రవి మనస్తత్వం.. డబ్బు ఖర్చు కాకుండా సుఖించడమన్నది, తనపని సులువుగా నేరవేర్చుకోవడమన్నది రవి సహజ గుణం. అందుకు మొదట శ్రీకాంత్‌ని ముగ్గులోకి దింపడం మామూలుగా జరిగే వ్యవహారం.. ఇంత అందాన్ని శ్రీకాంత్‌కి మొదట అర్పింపచేస్తే.. శ్రీకాంత్ కొత్త ఫార్మసీ కంపెనీలో తనకు ఉచితంగా అయిదు శాతం పార్టనర్‌గా చేస్తున్నందుకు కృతజ్ఞతా పూర్వకంగానూ వుంటుంది. తను పైసా ఖర్చు లేకుండా ధనలక్ష్మిని ఆ తరువాత అనుభవించడానికి మార్గం సులువైపోతుంది.

సునీత కళ్ళు కలలు కంటున్నాయ్..

ఇంతటి స్టన్నింగ్ బ్యూటి లక్కీని పడగొట్టడంలో సహకరించినందుకు రేపు తన బర్త్‌డే పార్టీలో శ్రీకాంత్ ఇచ్చే ఫైవ్‌లాక్స్ డైమండ్ నెక్లెస్‌ని తలచుకుంటోంది.

పగలు నిజమయ్యే విషయానికి రాత్రి కల అంకుర్పారణ చేస్తుంది.

ఒక అద్భుతమైన అందాన్ని అక్రమంగా అందించినందుకు తమకి ఇన్నాళ్ళూ ఇవ్వాలనుకుంటున్న వాటిని రేపు తప్పక ఇవ్వబోతున్న విషయాన్ని, శ్రీకాంత్ కళ్ళలోని వెలుగు చెబుతున్న దృశ్యాన్ని కనిపెట్టారు రవి, సునీతలు.

రమేష్‌కి సరే సరి.. ఒక్కరాత్రి తను మత్తుతో కళ్ళు మూత పడిపోయినందుకు గమ్మత్తుగా తన అకౌంట్‌లో మూడు లక్షలు పడబోతున్నాయ్.

అంతే కాదు.. రవి, సునీతలు చెప్పినట్లు 'లక్కీ' మూడు నాలుగు నెలలు శ్రీకాంత్‌తో వుంటే ఓ త్రిబుల్‌బెడ్‌రూం ఫ్లాట్ కూడా స్వంతమవుతుంది.

ఆ తరువాత..

రవి, సునీతల తార్పుడుతనంతో నగరం నగరమే లక్కీని తమ చేతులతో వాలీబాల్ ఆడుతుంది. చివరికి.. ఆ నగరమే కాళ్ళతో ఫుట్‌బాల్ ఆడుతుంది.

గోల్‌లో పడిన ప్రతిసారి బంతి చిన్నబోతూనే ఉంటుంది.

ఎవరు ఓడినా, ఎవరు గెలిచినా.. బంతి విరామమెరుగని కాళ్ళ దెబ్బలు తింటూనే వుంటుంది.

స్త్రీకి అన్ని విధాలా ఇలా జరుగుతూనే వుంటుంది.

తంతే బుట్టలో పడ్డట్టు.. రవి బూరెల బుట్టలో, సునీత పూల బుట్టలో పడ్డారు.

లక్కీని శ్రీకాంత్‌కి అప్పజెప్పడంతో ఇద్దరి దిశ కూడా ఒకేసారి మాంచి దశ తిరగబోతోందని శ్రీకాంత్ ఒక్కసారిగా ఏకబిగిన పబ్‌లో పెగ్ తాగినప్పుడే

అర్థమయింది.

ఎంతో మందిని మొదట పరిచయం చేసినా.. ఎంతో అందంగా వాళ్ళున్నా.. మొదటి పెగ్‌ని మూడుసార్లు తీసుకునే వాడు. అలాంటిది ఇప్పుడు ఒక్కసారిగా తాగేశాడంటే అర్థం.. తమ పంట పచ్చగా పండు వెన్నెల్లా పండుతోందని అర్థం..

లిక్కర్ కాలిక్యులేషన్.. ఈక్వేషన్.. ఈ లోకంలో పర్ఫెక్టుగా ఉంటుంది, అనుకు న్నవి జరిపి తీరుతుంది.

పబ్ గ్రౌండ్ ఫ్లోర్‌లో వున్న కారులోకి లక్కీని చేర్చారు సునీత, రవిలు.

డ్రైవర్ పక్క సీట్లో రవి.

శ్రీకాంత్, సునీతల నడుమ లక్కీ.

శ్రీకాంత్ తన తమకాన్ని ఆపుకోలేక కారులోనే లక్కీని తడిమాడు.

"ఆ".. "వూ".. అని కూడా అనలేని మత్తులోకి వెళ్ళిపోయిన లక్కీని.

నేలపై పొడిచి నింగిలో రాలిపోబో తున్న ఓ తోకచుక్కని.

అమావాస్యలోకి బలవంతంగా తోయబ డుతున్న ఓ వెన్నెల ముక్కని.

తన భర్తకేగాక మరొకరి రాపిడికి దోపిడి కాబోతున్న గంధం చెక్కని.

కారు విండోస్‌లోంచి సునీత రోడ్ వైపు చూస్తోంది.. తనకు తెలుసు కారులో ఏం జరుగుతోందో.. తనకూ ఓ నాటి అనుభ వమే.. అందుకే తన చూపుని సహజం గానే పక్కకి తిప్పుకుంది.

నగరంలో అలుముకున్న చీకటిని చూస్తూ.. పులుముతున్న 'కటి'క చీ'కటి'ని గురించి ఆలోచిస్తూ..

రాత్రి పన్నెండు పది!

కారు గెస్ట్‌హౌస్ ముందు ఆగింది.

రవి, సునీతలు లక్కీని గెస్ట్‌హౌస్‌లోకి తమ భుజాల మీద తీసుకొచ్చారు. బెడ్ మీద పడుకోబెట్టారు.

శ్రీకాంత్ బాత్‌రూంకెళ్ళాడు.

ఒక్క క్షణం ఆలస్యం చేయక రవి, సునీ తలు గెస్ట్‌హౌస్ నుంచి అదే కారులో

## చతురలో నా తొలి నవల!



### యక్కలూరి శ్రీరాములు

పుల్లేటిపల్లి, ధర్మవరంలలో బాల్యం. అనంతపురం, భాగ్యనగరాల్లో సాహితీ ప్రస్థానం సాగుతోంది. ఈనాడు ఆదివారం అనుబంధం సహా అనేక పత్రికల్లో నా రచన లు ప్రచురితమయ్యాయి. తొమ్మిది దీర్ఘకవితా సంపుటాలు, ఏడు వచన కవితాసంపుటాలు, రెండు కథాసంపుటాలు, నాలుగు వ్యాస సంపు టాలు, ఓ నాటికల సంపుటి ముద్రితం.

నా తొలి నవల 'చతుర'లో రావడం ఆనం దంగా ఉంది. నాకు నేనే సాహిత్యంలో గురు శిష్యునిగా సాహితీప్రయాణం చేయడం.. పరి సరాల్ని, మనస్తత్వాల్ని గమనించడం సమూ హంలో ఒంటరిగా మిగిలిపోవడం.. ఒంటరిత నంతో సమూహంలో కలిసిపోవడం.. అను కున్న విధంగానే నన్ను నేను నిర్మించుకోవ డంతో నా జీవితం నాదైంది. ఏ భావానికి ఏ ప్రక్రియ సరిపోతుందో అందులోనే అసంకల్పి తంగా రచన ఇమిడిపోవడంతో నేననుకున్నది స్పష్టంగా ప్రస్ఫుటించగలుగుతున్నందుకు సంతోషంగా వుంది.

నా సాహిత్యాన్ని అమితంగా ఇష్టపడే శ్రీమతి లక్కరాజు దేవికి ఈ నవలను అంకి తమిస్తున్నందుకు పరమానందంగా వుంది.

చతురకి మనస్ఫూర్తిగా ధన్యవాదాలు.

**చిరునామా:**
**యక్కలూరి శ్రీరాములు**
12-3-257
6, క్రాస్, సాయి నగర్
అనంతపూర్ - 515 001
ఆంధ్రప్రదేశ్.

సునీత ఇంటికి వెంటనే వెళ్ళిపోయారు.

శ్రీకాంత్ బాత్‌రూం నుంచి బయటకొచ్చాడు. పరుపుమీద లక్కీ ముఖం చామంతి పూలవన్నెతో కన్నుల మిన్నగా మెరిసిపోతున్నది.

శ్రీకాంత్ మది కదిలిపోయింది.

లక్కీని చూసిన క్షణం నుంచి క్షణానికి లక్షసార్లు చెదిరిపోతూనే వుంది. అంతరంగంలో అనేకసార్లు శృంగారభావనతో స్కలనం జరిగిపోతూనే వుంది.

ఫ్రీజర్‌లోంచి ఐస్ క్యూబ్స్ తీశాడు.

టీపాయ్ మీదున్న స్కాచ్ బాటిల్ లోంచి గ్లాసులోకి ఓ లార్జ్ పోశాడు.

ఓ పెద్ద ఐస్ క్యూబ్ వేశాడు.

స్కాచ్‌లోకి ఐస్ క్యూబ్ పడగానే ఐస్ క్యూబ్ నరనరాల్లోకి స్కాచ్ సరసరా ఎక్కి మంచుగడ్డ, గడ్డ కట్టిన బంగారు ముద్దలా అగుపిస్తోంది..

రాక్!

గ్లాసును వేళ్ళ మధ్యకు తీసుకుని పెదాలకానించి స్కాచ్ క్యూబ్‌పై నాలుక వుంచగానే ఆల్కహాల్ రుచి చప్పగా వున్నా చురుక్కుమంది..

కేరళ అడవుల్లోని గిరిజనులు మత్తు కోసం సారాయి.. కల్లు.. తాగి తాగి.. అవి శరీరానికి మత్తివ్వడం తగ్గిపోగానే.. చిన్ని చిన్ని విషపు పాములతో తమ నాలుకలపై కాటేయించుకోవడం.. ఆ విషపు మత్తు వెంటనే శరీరానికెక్కి తూలి పడిపోవడం జరుగుతుంది. ఆ మత్తు గంటో రెండు గంటలో కాదు. ఇరవై నాలుగు గంటలకు తక్కువుండదు.. ఒక్కోసారి ప్రాణం పోయేంత మత్తు.. మత్తులోనే ప్రాణం పోవడమూ జరుగుతూ వుంటుంది.

శ్రీకాంత్‌కి ఎందుకో ఆ విషయం గురుతొచ్చింది.

ఆల్కహాల్ పొగలు గక్కుకుంటూ నోటిలోకి జారింది.

'లక్కీ' టీషర్ట్ తొలగింది.

శ్రీకాంత్ స్కాచ్ క్యూబ్‌ని రెండోసారి మరీ గట్టిగా పీల్చాడు.

'లక్కీ' జీన్స్‌పాంట్ జారింది.

శ్రీకాంత్ మూడోసారి స్కాచ్ క్యూబ్‌ని మరీ గట్టిగా పీల్చాడు, టెన్నిస్ బాల్ అంత స్కాచ్ క్యూబ్ గోలీ గుండంత పరిమాణానికి దిగింది.

లక్కీ 'చర్మశిల'గా మిగిలింది.

సర్వావయాల్ని ఉలులుగా చేసుకున్న శ్రీకాంత్ ఆ రాత్రంతా 'శిల్పి'గా మారాడు.

మెలకువ లేకనే 'లక్కీ' తొలిసారి భర్త కాని మరో శరీరంతో కలిసిపోయింది.

రెండోసారి చివరి దశలో మత్తు, మెలకువ నడుమ గడిచిపోయింది.

వెలుతురులోనే మూడోసారి మెలకువ వున్నా.. ఏదో కొత్త శరీరంతో జరిగిపోతోందని తెలుస్తోంది.

అయితే అది చీకటిలోనే.

దిగ్గున లేచి కూచుంది.

చుట్టూ చీకటి కాచుకున్న విషయం గమనించింది.

భయంతో.. భీతితో.. తను ఎక్కడుందో తెలియనితనంతో గొంతు పెగలడం లేదు.

పబ్ గురుతొచ్చింది.

ఆ తరువాత ఏమి గురుతుకురాకుంది.

బాధ మాత్రం దుఃఖాతి దుఃఖంగా ఎదను తొలుచుకొస్తోంది.

కన్నీళ్ళతో కప్పేసిన కటిక చీకటిలో కళ్ళు తెరచుకున్నా చూపు వెలగడం లేదు.

భయబాధతో దుప్పట్లో దూరి.. ఇంకా ఇంకా చీకటి కావాలనిపించింది. చీకటిలోనే కళ్ళు మూసుకుంది.

నిద్రమత్తులో కాక మత్తు నిద్రలోకి జారిపోయింది.

ఉదయం పది గంటలవుతోంది.

లక్కీ మెల్లగా కళ్ళు తెరిచింది.

శ్రీకాంత్ ఫ్రెష్‌గా తయారై డైనింగ్ టేబుల్ చైర్‌లో కూర్చుని టీ తాగుతున్నాడు.

బెడ్ మీది నుంచే లక్ష్మీ ఆ దృశ్యాన్ని చూసింది.

రాత్రి చూచాయగా ఛాయగా అనుకున్నా పట్టపగలు ఆ సత్యం తనకు 'బట్ట' బయలయ్యింది.

ఇప్పటికిప్పుడు తను చచ్చిపోతే బావుండనిపించింది.

దుప్పటిలోంచి లేవాలని చూసింది.

దుస్తుల కోసం చుట్టూ పరికించింది.

టీషర్ట్ ఓ చోట.. జీన్‌ప్యాంట్ మరో చోట.. నేలపై దూరంగా కనిపించాయి!

మెడ నుంచి నడుము వరకున్న భాగాన్ని ఒక చోటికి, తన రెండు కాళ్ళను మరోచోటుకి బెడ్‌పై నుంచి దూరంగా విసిరేసినట్టు అనిపించింది.

తలను తొలగించి వుంటే ఎంత బావుండేదో కదా! అని విలపించింది.

కానీ.. పరుపు పక్కనే టీపాయ్ మీద ఓ కొత్త నైటీ..

కళ్ళు మళ్ళీ మూసుకుంది.

కళ్ళలో నీళ్ళు చెంపలపై జారాయి.

ఎవరూ గురుతు రావడం లేదు.

తన శరీరంపై జరిగిన 'దాడి'కి మోసపూరిత 'దోపిడి'కి ఎవరూ నిందితులు కారు.. తన.. తన.. తన భర్తే.. కారకుడు..

మూలకారకుడు.

ఎవర్నీ ఏమీ అనడానికి వీల్లేదు.

ప్రపంచంలో ఎవరి కోరికలు వారివి..

ఎదుటివారితో పనేలేదు.

ఎదుటివారి ఇష్టాయిష్టాలతో ఏ ఒక్కరికీ అవసరమే లేదు.

డబ్బు పెట్టి ప్రతిదీ కొనేవారికి ఈ ప్రపంచమంతా ఓ వ్యాపార కేంద్రం..

అందులో దొరకనిదంటూ ఏదీ లేదు.

కంటికి కనబడ్డవన్నీ కొనగలరు.. శరీరంతో సహా..

హృదయంతో.. మనసుతో పనేలేదు. వాటి అవసరం కొనేవాడికి అనవసరం. అమ్మేవాడికి అనవసరం. నడుమ దగ్ధమవుతున్న వారికి మాత్రమే నరకకూపం.

లోకం దృష్టిలో తనిప్పుడు.. 'వ్యభి'.

తనకు తెలియకనే.. 'వ్యభి'..

తన స్థితిలో వున్న ఏ స్త్రీయైనా ఏం చేస్తుంది? తప్పదు.. దుఃఖం, కోపం రెండూ రెండు కళ్ళ నిండా కసిగా మండిస్తుంటే కనురెప్పలు మెల్లిగా తెరిచింది.

నవ్వుతూ.. ఎదురుగా శ్రీకాంత్.

అతని ముఖంలో ఏ భావనా లేదు.

సహజంగా వున్నాడు..

ఏమీ జరగనట్టే.. లోకంలో అన్నీ జరిగినట్టే.. ఇదీ సహజమన్నట్టే.. మామూలుగా నవ్వుతూ..

ఎలా చూడాలో తెలియక.. ముఖం చటుక్కున పక్కకు తిప్పేసుకుంది.

"నిజం చెబుతున్నాను.. నీ అంతటి అందాన్ని అనుభవించినందుకు నా జన్మ ధన్యం.. నీకేం కావాలో చెప్పు. రమేష్‌కి ఏం కావాలో! అన్నీ చేస్తాను.. సరేనా!" సూటిగా శ్రీకాంత్.

'రమేష్' అన్నమాటతో.. ఆ పదంతో.. లక్ష్మీ ముఖం వివర్ణమయింది.

ఆకాశంలోని ఇంద్రధనుస్సుపై పిడుగు పడి ముక్కలైన రంగురంగుల గాజుముక్కలు సరిగ్గా హృదయంలో గుచ్చుకుని రక్తం అంతరంగంలోనే స్రవించి స్రవించి.. నింగిలోకి భళ్ళున చల్లినట్టయింది.

'ర..మే..ష్' ఆ పేరు వినడానికి కూడా చెవులు సిద్ధంగా లేవు.

మాటాడలేకపోతోందని గ్రహించాడు శ్రీకాంత్.

"ఓకే.. లేచి ఫ్రెషప్ అయితే.. కాఫీ వస్తుంది.." అంటూ గెస్ట్‌హౌస్ బయట లాన్‌లోకెళ్ళి ఓ చెట్టు నీడన కూచున్నాడు.

లక్ష్మీ బాత్‌రూంకెళ్ళింది దుప్పటితోనే!

బాత్‌రూంలో షవర్ ఆన్ చేసింది.

దుప్పటి తొలగించింది.

తన శరీరాన్ని తనే చూడలేక కళ్ళు మూసుకుంది. తన తనువును తన

చేతుల్తో కడగలేకపోయింది.

షవర్‌లోంచి నీళ్ళు చల్లగా నెత్తిపై నుంచి జారుతున్నా నిప్పు కణికలు రాలుతూ లావాతో శరీరమంతా కాలిపోతున్నట్టనిపించింది. బూడిద కుప్పగా తను మిగిలి, నీటితో కరిగి మురికికాలువలో బతుకు ముగిసిపోతే బావుండనిపించింది.

ఎంత ఆలోచించినా.. ఎవరు ఏమి చేసినా.. తనదే తప్పుగా.. తప్పు తనదనే భావనతో రగిలిపోయింది.

శరీరమున్నందుకు తప్పక తప్పు తనదేననే భావనలోంచి బయటకి రాలేకపోతోంది.

మహానగరం..

ఒంటరి ఆడతనం..

భర్త నిర్వాకం..

మానసిక శారీరక విలాపం..

ఎక్కడికి పోగలదు..?

ఎవరితో మొరపెట్టుకోగలదు..?

ఇటువంటి భర్తలు.. కాదు.. కాదు.. మ(మృ)గాళ్ళున్న లోకంలో అమాయక భార్యల జీవితాలు.. ఇలాగాక ఎలా వుంటాయి..?

పువ్వులపై నిప్పు రవ్వలు పడితే రేకులెలా నవ్వులు విరబూస్తాయి..

బాత్‌రూంలోంచి బయటికొచ్చింది.

తన తనువుపై తన చేతినే తగలనీయక టర్కీటవల్‌తో శరీరాన్ని తడిమింది.

తన శరీరాన్ని తను తాకడానికే అసహనంగా అసహ్యంగా వుంది.

బెడ్ పక్కనున్న కుర్చీలో కూచుంది. కానీ.. కుర్చీలో కూచున్నట్టు లేదు.

శూన్యంలో వేలాడుతున్నట్టుంది.

తాడు లేకనే ఉరి వేసుకున్నట్టుంది.

శ్రీకాంత్ తన తనువుతో ఏం సుఖం పొందాడోగాని, తలుచుకున్న ప్రతి క్షణం తాను నరకమనుభవిస్తోంది.

శారీరకంగా మానసికంగా అనుక్షణం రాత్రి జరిగిపోయిన విషయాన్ని తలచుకోని క్షణం లేదు.

శారీరకంగా జరిగిపోయింది.. శరీరమెలా మరిచిపోతుంది!

అవయవాలు మామూలుగానే వున్నా.. కొన్ని అవయవాల్ని తీసేస్తే బాధ తగ్గుతుందనిపించింది.

మానసిక ఘర్షణలో మనసుకయిన గాయం శరీరానికి తగిలిన దెబ్బకంటే ఎంతగా క్షోభ పెడుతుందోనని అప్పుడనిపించింది. తనువు మొద్దుబారినా మనసులో పడిన ముద్ర చెరగనంటోంది.

రాక్షసుడు..

దుర్మార్గుడు..

కిరాతకుడు..

హంతకుడు..

శాడిస్ట్.. ఘోస్ట్.. వాడెవడైనా కావచ్చు. వాడెలాంటి వాడైనా కావచ్చు. భర్త అనేవాడినే 'ఆ ఒక్క భర్తనే' కావాలనుకుంటుంది. ఆ భర్త శరీరంతోనే ఐక్యమవాలనుకుంటుంది. వాడి మనసులో చోటు కోసం జీవితమంతా వేచి చూస్తుంది. తన తనువుపై మనసుపై పూర్తి హక్కు అతనికే వుండాలని వేరు ఆలోచనే లేని స్థితిలో వుంటుంది భారతదేశంలోని స్త్రీ.

"సరే.. కాఫీ తాగు" ఎప్పుడొచ్చాడో.. బెడ్ మీద కూచున్నాడు.

ఇరువురి నడుమ ఓ చిన్న టీపాయ్‌పై వున్న కాఫీ కప్పుపై వున్న మూతను తొలగిస్తూ.. శ్రీకాంత్.

కళ్ళలో నీళ్ళు నింపుకుంది..

తలవొంచుకుని కూచుంది.

శ్రీకాంత్ మామూలుగా వున్నాడు. అయితే.. అత్యంత ఆనందంగా వున్నాడు.

తను కోరింది.. డబ్బు పెడితే దొరుకుతూనే వుంది.. వస్తువుల్ని కొన్నట్టే శరీరాల్ని కొన్నాడు.. కానీ ఇప్పుడు కొన్నది అత్యంత విలువైన, మృదువైన శరీరం.

ఏనాడూ.. మరో విధంగా ఆలోచించనే లేదు.. తను జీవించే విధానం అలా అల

వోకగా సాగిపోతున్నప్పుడు ప్రతి మనిషికి ఇష్టాయిష్టాలు.. ఒక మనసు.. ఓ హృదయం.. అనేవి వుంటాయని.. వాటికీ స్పందనలుంటాయనే ఆలోచనే రాదు. మనుషులు పలు రకాలు కాదు, అవయవా లొకటే. కానీ ఆలోచనా విధానాలతోనే అసలు స్వరూపం బయటపడుతుంది.

"బహుశా.. రమేష్ తరువాత.. నేనేన నుకుంటాను.. అయితే.. లక్ష్మీ.. నా జీవి తంలో ఇంత స్టన్నింగ్ బ్యూటీని చూడడం.. అనుభవించడం ఇదే ప్ర థమం.. ఇది నిజం. నీకు ఏం కావాలో చెప్పు.. ఏదైనా.. ఎంతైనా.. ఏమైనా.. వెనుకాడను.. నీ ఇష్టం.." శ్రీకాంత్.

మౌనంగా తలొంచుకుని నేలనే చూస్తోంది 'లక్ష్మీ'.

భూమి నిజంగా గుండ్రంగా తిరుగు తోందో లేదో గాని తన తల మాత్రం అన్ని వైపులా వేయి ప్రకంపనలతో తిరుగు తోందనిపించింది.

కళ్ళలోని నీళ్ళ పొర నిరంతరం సన్నగా కరిగి, కాళ్ళ కింద సముద్రం ఏర్పడుతోంద నిపిస్తోంది.

"సరే.. నేను కాస్త పని చూసుకుని.. సాయంత్రం ఐదింటికొస్తాను. అంత లోపల నీకు కావల్సినవన్నీ నౌకర్లు అరేంజ్ చేస్తారు.. ఓకే.." అంటూ భుజంపై చెయ్యి మెల్లగా వేశాడు.

శరీరంపై పాము పడ్డట్టు ఒళ్ళంతా జల దరించింది.

వేళ్ళతో నొక్కాడు.

ఎముకల్లోకి కోరలు దిగినట్టయ్యింది.

లక్ష్మీ జవాబు కోసం చూడకుండా శ్రీకాంత్ వెళ్ళిపోయాడు.

పని మనుషులు.. వంట మనిషి.. వచ్చి ఎదురుగా నిలబడ్డారు.

'వంట ఏం చేయాలో.. ఏమేం వస్తు వులు తీసుకురావాలో' అడిగారు.

మౌనంగానే వుంది..

ఎంతకూ వాళ్ళు వెళ్ళకపోవడం గమనిం చింది. తనను ఏ దృష్టితో చూస్తున్నారో అర్థం చేసుకోవడానికి క్షణకాలం పట్టలేదు. వీలయినంత తొందరగా వాళ్లు దూరంగా వెళ్ళిపోతే బావుండనిపించింది.

"మీ ఇష్టం.. నాకేం అక్కర్లేదు.."

ఆ మాటనగానే వాళ్ళు వెళ్ళిపోయారు..

పెళ్ళి కావడం..

హైదరాబాద్ రావడం..

రమేష్.. తనను ఇలా తయారు చేయడం.. ర..మే..ష్ పేరు తలచుకుం టుంటేనే ఒళ్ళంతా కంపరమెత్తుతోంది.

ఎలాంటి మగాళ్ళు..

ఎలాంటి ఆడాళ్ళున్నారు.. (సునీత) ఈ లోకంలో..

ఒకడు అనుభవం కోసం (శ్రీకాంత్) శరీరాన్ని కోరతాడు.

ఒకడు డబ్బు కోసం మరొకడి కొమ్ము (రవి) కాస్తాడు.

మరొకడు అందం కోసం కథను నడుపు తాడు. ఇంకొకడు అవసరం కోసం అమ్ముడుబోతాడు.

వేరొకడు డబ్బుకోసం పెళ్ళాన్నే (రమేష్) వేరొకరికి అప్పచెబుతాడు.

ఒకామె బంగారం కోసం, సొసైటీలో పరపతి కోసం సాటి స్త్రీనే సమకూరు స్తుంది. వీళ్ళంతా చదువుకున్నవాళ్ళు..

డిగ్రీలు తగిలించుకున్నవాళ్ళు..

పల్లెవాసులకి వీళ్ళందరూ నాగరికత చిహ్నాలు.

చివరికి.. చివరికి.. డబ్బు.. శారీరక సుఖం.. అంతే..

లోకంలో అవి రెండు మినహా ఏవీ లేవని.. ఏదీ లేదని ప్రవర్తించడం..

ఛీ..ఛీ.. తన శరీరం మీద.. తన స్థితి మీద.. పరిస్థితి మీద.. ఆడ పుట్టుక మీద అసహ్యం.. అసహ్యం.. అసహ్యం..

'థూ' అని ఉమ్మినా తుడుచుకుని..

ఆహ్వానిస్తుంది.

'శరీరాన్ని' మాత్రమే ఆహ్వానిస్తుంది ఈ లోకం అన్పించింది.

దుస్తుల్లోని అవయవాల పొంకం చూసి మోహించే మనుషులకి.. అందంగా అగుపించే అతివలోనూ మలినాలని విసర్జించే అవయవాలుంటాయని ఆ క్షణాన గురుతు రాదేమో.. అసలు.. మలినాల్ని విసర్జించే అవయవాలు వాటి అనుసంధానమైనవిగా అగుపించవేమో..

కామాతురాణాం న భయం న లజ్జ.

కిటికీ అద్దాల్లోంచి ఎండ శరీరంపై పడి చుర్రుమంటోంది.




**ప**దే పదే.. రాత్రి తనకు తాగించిన డ్రింక్ మినహా ఏమీ గుర్తురావడం లేదు.

ఏదైనా ఏదేమైనా తెల్లవార్లూ తనపై జరిగిన శారీరక దాడిలో శరీర స్వచ్ఛత తనకు తెలియకనే తెల్లారిపోయింది.

బతుకు ఏమిటో తెలిసిపోయింది.

జీవితం తేలిపోయింది.

ప్రస్తుతస్థితిని రాబోయే పరిస్థితిని విశ్లేషించుకుంటూ.. ఆలోచించి.. ఆలోచించి.. ఓ గాఢమైన నిర్ణయానికొచ్చేసింది.

మొట్టమొదట..

ర..మే..ష్..

'ఛీ'.. జీవితంలో ఇక వాడి ముఖం చూడకూడదనే నిర్ణయం.

రెండోది తన.. 'మరణం'.

మూడోది ఈ రెంటి నడుమ జీవితం.

ఏదోఒకటి.. అతి త్వరలో.. నిశ్చయంగా నిర్భయంగా జరిగిపోవడం ఖాయం.

అయితే.. ఈ రాత్రిలోపలే ముగిసిపోవడం నిజం..

తప్పదు..

సాయంత్రం ఏడు గంటలవుతోంది..

కారు ఆగిన శబ్దం వినిపించింది.

నౌకర్లు పరుగులు..

ఆ తరువాత నిశ్శబ్దం ఆవహించింది.

గదిలోకి శ్రీకాంత్ అడుగు పెట్టాడు.

నక్షత్రాలు పొదిగినట్టు చిన్నిచిన్ని చుక్కల నల్లనినైటీలో జాబిలి ముఖంతో 'లక్కీ'.

అలాగే చూస్తుండిపోయాడు.

లక్కీ తలదించుకోలేదు. కాని.. కళ్ళు నేలకేసిన చూపుల్తో చలువరాతి బండని రాస్తున్నాయ్..

తదేకంగా చూస్తున్న శ్రీకాంత్ కాస్త తేరుకున్నాడు.

స్నానించి వచ్చాడు.

నౌకర్లు అన్నీ అరేంజ్ చేసి వెళ్లారు.

లక్కీ ఓ కుర్చీలో కూచుంది.

శ్రీకాంత్ లక్కీకెదురుగా కూచున్నాడు.

ఓ క్షణం.. శ్రీకాంత్ కళ్ళలోకి చూసి తల దించుకుంది.

"ఆలస్యమయింది.. పనులు కదా! ఏమాలోచించావ్? నిజం చెప్పాలంటే.. నిన్ను వదులుకోవాలని లేదు.. ఆ ఆలోచనే రావడం లేదు.. నీతోనే ఉండిపోవాలనిపిస్తోంది. నిజం.. ఏదైనా నీ ఇష్టంపైనే ఆధారపడి ఉంటుంది. ఇక విషయానికొస్తే రేపు ఉదయమే వెళ్ళి సాయంకాలానికి వచ్చేట్టుంటే వెళ్ళు.. మరో మాట.. ఉండిపోవాలనుకుంటే.. ఇక్కడే ఉండొచ్చు నాతోనే.. శాశ్వతంగా.. ఇక రమేష్.."

ఆ పేరు వినడంతోనే..

"ఛీ" అనుకుంది గాని.. పదం బైటికే వచ్చింది.

శ్రీకాంత్ ముఖంపై ప్రశ్నార్థకం పడింది..

"సరే.. నీవు వెళ్ళకపోయినా.. అతను ఏమీ అనుకోడు.. అతనికి కావల్సింది.. డబ్బు.. పంపిస్తాను.. ఏమంటావ్?" అన్నాడు శ్రీకాంత్.

చాలా సేపు మౌనంగా ఉండిపోయింది.

లక్ష్మీ హృదయాన్ని పక్కకి నెట్టి ఒక్కసారి మెదడుతో పదునుగా ఆలోచించింది.

రేపు నేను రమేష్ దగ్గరికెళ్ళినా.. ఇంత కంటే ఎక్కువ డబ్బు ఇచ్చేవాడుంటే.. వాడి దగ్గరికి పంపడని సందేహమక్కర్లేదు..

ఇటువంటి వాళ్ళకెందరికి తనను తారు స్తాడోనని భయపడింది.

డబ్బుకోసం.. రోజుకొకడి కింద.. ఛీ.. జీవితం అనుకుంది.

కాగితాలను ఎంచుకుంటూ.. 'వాడు'..

కాళ్ళను విప్పుకుంటూ.. కళ్ళు మూసుకుంటూ.. 'తను'..

ఛీ.. ఛీ..

"చెప్పు లక్ష్మీ..! నీకేం కావలన్నా నే.." శ్రీకాంత్ చెప్పబోయేంతలో..

మౌనాన్ని ఛేదిస్తూ.. "సరే.. మీతో వుంటాను.. మీతోనే వుంటాను. శాశ్వతంగా.." అంది నిశ్చలంగా నిర్భయంగా.

ఆశ్చర్యం, ఆనందం కలబోసిన శ్రీకాంత్ శరీరంలో ఓ తీపిదనం ప్రవేశించింది..

తను తేరుకోవడానికి మొట్టమొదటిసారి చాలా సమయం పట్టింది.

"ఓకే..! అయామ్.. వెరీ హ్యాపీ..! ఇంత త్వరగా డెసిషన్ తీసుకున్నందుకు. నన్ను సందిగ్ధంలో పడేయనందుకు.. నువ్వు పడనందుకు.. నీకేం లోటు రానివ్వను.. రేపు.. నీ పేరు మీద బ్యాంక్‌లో అకౌంట్ ఓపెన్ చేస్తాను. అపార్ట్‌మెంట్ ఒకటి నీ పేరు మీద రిజిష్టర్ అయిపోతుంది. నీకు నచ్చిన నగలు, డ్రస్సులు.. ఏం కావాలో.. రేపు ఉదయం నుండి సాయంత్రంలోగా అన్నీ అరేంజ్ అవుతాయి" ప్రపంచంలోని అందాన్ని తన స్వంతం చేసుకున్నానన్న ఆనందంతో శ్రీకాంత్.

లోకంలోని భోగభాగ్యాలు అలవోకగా అందుబాటులోకి వచ్చాయనే తృప్తికంటే.. మొగుడు.. కాదు.. తార్పుడు మొగుడు నుంచి తప్పించుకున్నాననే సంతృప్తి..

ఒక బలమైన ఆధారం దొరికిందన్న విషయం తన్ను సమాధాన పరుస్తోంద న్నది వాస్తవం.. నిజం..

అవస్థలో అవసరాన్ని గుర్తించి పరిష్కరించుకోవడమే విజ్ఞత.

పాఠశాలల్లోని చదువు అన్నింటినీ నేర్పుతుందన్నది నిజం కాదు. సమస్యలొచ్చినప్పుడు సానుకూలంగా.. సంఘర్షణ వున్నప్పుడు సావధానంగా జీవితాన్ని దారిలో నడపగలిగి, జీవితమంతా ప్రశాంతతని చ్చేదే అసలైన చదువనిపించింది.

చదువు అక్షరాల్ని నేర్పుతుంది.. అది కేవలం జీవితాన్ని రికార్డు చేయడానికి మాత్రమే పనికొస్తుంది.

గుణం లేనివాళ్ళ నడుమ సుగుణంతో జీవించడమే సిసలైన జీవిత పాఠం.

అవసరం అన్నింటినీ నేర్పుతుంది.

జీవితాన్ని అనుభవాలు నేర్పుతాయి. ఎంత త్వరగా గ్రహిస్తే అంత వేగంగా మనిషి పయనిస్తాడు.

నేడు ఆలోచనైనా.. మొట్టమొదటి అడుగు రేపటి నుంచే.. జీవితాన్ని సాధ్యమైనంత వరకు ఏ లోపం లేకుండా జరిపించుకుంటూ.. మరణం తనకు ముహూర్తం పెట్టేంతవరకు సాగుతూ పోవడమే..

ప్రస్తుతం మరణానికి తనే ఫుల్‌స్టాప్ పెట్టింది.

రాత్రి.. జాబిలిపై ఉన్న మబ్బు మూత తొలిగింది.

బిందువు బిందువుగా వెన్నెల మధువు అతని గొంతులోకి దిగింది.

అతని కోసం తనూ.. తయారయింది.

మధువు తాకిన.. తాగిన వధువుగా మారింది.

పెదవి మౌనాన్ని కోరింది.

# ఊరుపిండి వంటకం

చతురోక్తారం,

కృష్ణదేవరాయల ఆస్థానానికి ఒక పండితుడు వచ్చాడు. అష్టదిగ్గజాలను జయించాలని వచ్చానని రాయలవారితో అన్నాడు. ఇప్పటికిప్పుడు వాదం జరిగితే మన కవులు జయిస్తారో? లేదో? అని రాయలు సంశయించారు. సభ ఏర్పాటుచేస్తానని, పంటపొలాల మధ్య ఉన్న మేడలో ఆయనకు బస ఏర్పాటుచేశారు. ఆ రోజే రాయలవారు తెనాలి రామకృష్ణకవితో ఇదంతా చెప్పారు.

మరునాడు ఉదయమే రామకృష్ణకవి రజకుడి వేషంలో ఆ పండితుడున్న మేడ పక్క ఏరులో బట్టలు ఉతుకుతున్నాడు. ఆ పండితుడు తన బట్టలు తెచ్చి ఉతకడానికి రామకృష్ణకవికి వేశాడు. అదే సమయంలో రామకృష్ణుడి భార్య చద్దన్నం తెచ్చింది. తిరిగి వెళుతూ మధ్యాహ్నం వంట ఏం చెయ్యమంటావని అడిగింది. దానికి రామకృష్ణుడు

*నల్లీనదీ సంయుక్తం విచారఫలమేవచ*
*గోపత్నీ సమాయత్తం గ్రామ చూర్ణంచ వ్యంజనమ్* అన్నాడు.

సరేనని వెళ్లిపోయిందామె. ఇదంతా చూసిన పండితుడికి మతిపోయింది. రాయలవారి రాజ్యంలో రజకులూ శ్లోకాలు చెబుతారా? అని ఆశ్చర్యపోయాడు. దాని అర్థం కూడా తెలియలేదు. ఒక రజకుడి శ్లోకమే అర్థం కాని తాను అష్టదిగ్గజ పండితులతో వాదం చేయగలుగుతానా? అని మథనపడసాగాడు.

సభ ఏర్పాటు చేస్తున్నట్లు మూడోరోజు రాయలవారి నుంచి కబురు వచ్చింది.

ఆ పండితుడు ఆస్థానానికి వస్తూనే ఈ విషయమంతా చెప్పాడు. ఆ రజకుడి శ్లోకానికి ఎవరైనా అర్థం చెబితే చాలని ఇక వాదాలతో పనిలేదని అన్నాడు. ఒకవేళ ఆ శ్లోకానికి అర్థమేమీ లేదంటే అప్పుడు వాదం చేయాలో? లేదో? నిర్ణయించుకుంటానంటూ ఆ శ్లోకం చెప్పాడు.

ఇదేదో తెనాలివాని పనేనని గ్రహించి, ఆ శ్లోకానికి మా రామకృష్ణకవి అర్థం చెబుతాడని రాయలవారు ప్రకటించారు.

రామకృష్ణకవి లేచి ఆ శ్లోకం ఏ సందర్భంలో చెప్పాడని అడిగాడు. ఆ రజకుని భార్య భోజనానికి ఏం వండమంటారు? అని అడిగితే చెప్పాడని పండితుడు అన్నాడు. అంటే ఈ శ్లోకం రజకుని భార్యకు అర్థమయినట్లే కదా! ఆ పాటి కూడా మీకర్థంకాలేదా? అని పండితుని ఎగతాళి చేశాడు. అవును నిజంగానే తనకు ఏమీ తెలియలేదని పండితుడు చెప్పాడు.

నేరుగా పదాలకు అర్థాలు నిఘంటువుల్లో చూస్తే భావం బోధపడదు. ఇది వక్రోక్తి సంప్రదాయంలో చెప్పిన శ్లోకం. నది అంటే ఏరు, నల్లి+ ఏరు = నల్లేరు,

విచార.. చింత, ఫలం..పండు.. చింతపండు అని అర్థం.



గో..ఆవు, పత్నీ..ఆలు.. ఆవు+ఆలు = ఆవాలు,

గ్రామ..ఊరు, చూర్ణం..పిండి.. ఊరు పిండి అని అర్థం.

నల్లేరును చింతపండుతో నూరి, ఇంత ఆవపిండి కలిపి ఊరుపిండి చేయమని అతని భావన అన్నాడు రామకృష్ణుడు.

ఆ పండితుడు తన ఓటమిని అంగీకరించాడు. తానేదో పుస్తకాలు చదివి కంఠస్థం చేశానే గాని ఒక్కో పదానికి ఇన్ని అర్థాలు, భావాలు ఉంటాయని గ్రహించలేక పోయానన్నాడు. వాదానికి వచ్చిన పండితుని ఒక్క శ్లోకంతోనే ఓడించిన రామకృష్ణకవిని, వినయంతో ఓటమిని అంగీకరించిన ఆ పండితుని రాయలవారు సత్కరించారు. ఊరు పిండి అంటే వడియాలు పెట్టుకోడానికి చేసే పిండి లాంటిది. ఎముకల పుష్టికి, విషం విరుగుడుకు నల్లేరు మంచిదంటారు వైద్యులు.

పైట భుజంపై భారమయి జారింది.

మల్లెపూల పొదరిల్లులో అతను ఆమెను తెల్లార్లూ అల్లుతూనే ఉన్నాడు.

ఎడారిలో ఒయాసిస్సు దొరికిన బాట సార్లై, దాహాన్ని రెండు దోసిళ్ళతో తీర్చు కుంటున్నాడు.

ఆకురాలు కాలంలో పూలతోటలలో పూచిన గులాబిని చూసి రెక్కల ల్లార్చుతూ ఆత్రుతతో వచ్చిన సీతాకోకచిలు కయ్యాడు.. అమావాస్యపై కొడవలి ఝళి పించే నెలవంకయ్యాడు.

లక్ష్మికి అవేమీ తెలియకపోయినా అడ్డు చెప్పక అనుసరించింది.

ఆ.. అమాయకత అతనికి మరింత ఆనందాన్నిచ్చిందని తెలిసింది.

★ ★ ★

ఉదయం 'లక్ష్మి' నిదురలేవడాన్ని గమ నిస్తూ ఎదురు చూస్తున్నారు నౌకర్లు.. క్షణాలలో సౌకర్యాలను కలుగజేసేందుకని అర్థమయింది.

శ్రీకాంత్ ఉదయమే వెళ్లిపోయాడు.

వెళ్ళే ముందు.. ఆమెను ఎలా చూసుకో వాలో చెప్పి మరీ వెళ్ళినట్టుంది. ఆ విషయం అనుక్షణం వాళ్ళ ప్రవర్తనలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

ఫోను రింగవుతోంది..

పరుపుమీది నుంచి లేచి మొబైల్ అందుకునే లోపునే నౌకరు తెచ్చిచ్చాడు.

అవతలవైపు శ్రీకాంత్ మాటాడాడు.

"సరే" అంది..

లక్ష్మి గదిలోంచి బయటికొచ్చింది.

వెనుక సీట్లో శ్రీకాంత్..

డ్రైవర్ దిగి కారు డోర్ తెరిచాడు.

శ్రీకాంత్ పక్కన లక్ష్మి కూచుంది.

ఏసీ గదిలోంచి రెండడుగులు, అంతే.. ఏసీ కారులోకి.. పాదం మోపింది.

జీవితం చల్లగా మలుపు తిరిగింది. నగ రంలో అత్యంత పేరొందిన నగల దుకాణం ముందు కారు ఆగింది.

బంగారు నగల షాపులో ప్రత్యేకంగా లక్ష్మి కోరుకున్నవేం లేవుగాని.. ఆమె చూపు పడి.. క్షణమాగిన ప్రతి నగ, తన శరీరంపై అలంకరించాడు శ్రీకాంత్. అంతేగాక అతనికిష్టమైనవి అదనంగా తీ సుకున్నాడు, తన కోసమే.. కేవలం తన ఇ ష్టాన్ని అందివ్వాలనే తపనతోనే కొన్నాడు.

అంతేకాదు.. చీరలు, మాడ్రన్ డ్ర స్సులు.. పాంటీస్.. షూస్.. ఒకటేమిటి? ఒక్క గంటలో ఎన్ని లక్షలో.. క్షణాల్లో ఎగిరిపోయాయి. నగదు నదిలా షాపులో ప్రవహింప చేశాడు. బంజారాహిల్స్‌లోని ఓ అపార్ట్‌మెంట్‌లోకెళ్ళి కారు ఆగింది. డ్రైవర్ కారు డోర్ తెరిచాడు.

శ్రీకాంత్, లక్ష్మి దిగారు. లిఫ్ట్ థర్డ్ ఫ్లోర్‌లో నిలిచింది.

లిఫ్ట్‌బాయ్.. లిఫ్ట్ డోర్ తెరిచాడు. థర్డ్ ఫ్లోర్‌లోని కార్నర్ ఫ్లాట్ దగ్గరికి శ్రీకాం త్‌తో నడిచింది లక్ష్మి..

నాక్ చేయకనే డోర్ తెరిచాడు నౌకరు. గదిలోంచి పర్ఫ్యూం సువాసన సుతారంగా లక్ష్మి సంపెంగ ముక్కుకు తాకింది.

ఓ చల్లని పిల్లగాలి ఒక్కసారిగా తను వుకు సోకింది.. అప్పుడప్పుడే అన్నీ అలం కరించినట్టుంది.

ప్రతి అంగుళంలో నూతనత్వం కొట్టొచ్చి నట్టు అగుపిస్తోంది.

గదిని పరికిస్తోంది లక్ష్మి.

"ఎలా ఉంది?" అన్నాడు శ్రీకాంత్.

"చాలా బావుంది" మాటకంటే.. కళ్ళే బాగా సమాధానమిచ్చాయి. శ్రీకాంత్‌ని లక్ష్మి చూపులు తృప్తి పరిచాయి.

ఓ టేబుల్ మీదున్న బ్యాంక్ అకౌంట్ అప్లికేషన్ ఫారాల మీద సంతకం చేయిం చాడు లక్ష్మితో.

కాలింగ్ బెల్ మోగింది.

"కమిన్" అన్నాడు.

"సార్..! బ్యాంక్ నుంచి వచ్చాం" అన్నాడో యువకుడు.

"ఓకే.. దిసీజ్ యువర్ అప్లికేషన్.. అండ్ దిసీజ్ మై చెక్ ఫర్ న్యూ అకౌంట్ పర్పస్.. క్రెడిట్ ఇన్ హర్ అకౌంట్.." అంటూ లక్కీ సంతకం చేసిన అప్లికేషన్, తన చెక్ రెండూ ఇచ్చి పంపించాడు.

"ఓకే లక్కీ..! ఇది మన.. కాదు నీ స్వంత ఫ్లాట్! ఇదిగో ఈ రిజిస్ట్రేషన్ పత్రాల మీద సంతకం చేస్తే సరిపో తుంది.. మళ్లీ వచ్చి కలుస్తాను. నీకేం కావాలో ఈ నెంబరుకి ఫోన్ చెయ్.. నౌకర్లొస్తారు.. సరేనా.." శ్రీకాంత్.

"సరే" అంది ఓ చిన్నినవ్వు చిందిస్తూ.

"గుడ్! ఐ వాంట్ దట్ స్మైల్.." అంటూ బుగ్గమీద చిటికేసి వెళ్ళిపోయాడు. అపార్ట్‌మెంట్‌లోని అద్దాల్లోంచి బయటికి చూసింది. చుట్టూ గుట్టలపై పెద్ద పెద్ద బండరాళ్ళు. రాతి బండల మధ్యన పాలరాతి భవనాలు..

పావురాల గూళ్ళుగా అపార్ట్‌మెంట్లు.

నగరంలో మనుషుల కంటే పావురాలు, ఇతర పక్షులే నయమనిపిస్తుంది. ఉదయం వెళ్ళి సాయంకాలం కాగానే గూళ్ళకు చేరుకుంటాయి. మనుషులు మాత్రం ఏ అర్ధరాత్రో, అపరాత్రో చేరుకుంటారు.

వద్దన్నా అప్పుడప్పుడు శ్రీకాంత్ లక్కీని బలవంతంగా బయటికి తీసుకెళ్ళేవాడు. నాలుగు గోడల నడుమనే బాగుందని చెప్పినా.. వినిపించుకునే వాడు కాదు. జస్ట్‌ఫర్ చేంజ్ అనేవాడు. ఎప్పుడూ.. ఈ గదిలోనే పొద్దెలా పోతుంది? అలా బయటికెళితే రిలాక్స్‌గా ఉంటుందని తీసుకెళ్ళి సంతోషించేవాడు.

పని మనుషులు ఆమెని దేవతలా చూసుకునేవారు. ఇక శ్రీకాంత్ గురించి.. చెప్పే పనే లేదు.

నగరంలోని ముఖ్యమైన స్థలాలు.. హోటల్స్.. పబ్స్.. అన్నింటికీ.. శ్రీకాంత్ తనకి ఇష్టమైన దుస్తుల్లో తీసుకెళ్ళేవాడు. బ్యూటీ పార్లర్‌కెళ్ళి హేర్ స్టైల్ డిఫరెంట్‌గా చేయించేవాడు.. లక్కీలోని ప్రతి వెంట్రుక వాసి శరీరాన్ని పాలతో కడిగి పూలతో పూజించి వెన్నెల పాన్పుపై శయనింప చేసేవాడు.

సిటీలో ఎందర్నో పరిచయం చేశాడు. మరెందరితోనో తన గురించి తన ఎదుటే పొగిడేవాడు.

ఆడాళ్ళు కూడా తనని కళ్ళార్పక చూడడం గమనించింది.

మగాళ్ళ చూపుల్లో శ్రీకాంత్ అదృష్టవంతుడన్న భావనని చదవగలిగింది.

సునీత కలిసినప్పుడలా.. తనని మెచ్చుకోలుగా చూస్తూ.. పట్టణంలోని బిగ్ షాట్స్ గురించి చెప్పేది.

అత్యధిక ధనవంతుల గురించి వాళ్ళ అలవాట్ల గురించి.. వాళ్ళు పెట్టే ఖర్చు విధానం గురించి తెలిపేది.

ఎందుకంటే..

లక్కీ గురించి.. ఎందరో.. సునీతను కదిపారు.

అందుకే శ్రీకాంత్‌కి తెలియకుండా సునీత లక్కీకి తెలిపేది. శ్రీకాంత్ ఆ సమయంలో వచ్చినా.. క్యాజువల్‌గా మాట్లాడినట్లు.. ఎవరెవరివో ఎఫైర్లు, ఆఫర్లు చెప్పినట్లుగా చెప్పేది.

ఏ క్షణమైనా లక్కీ తన మాటలకు మొగ్గు చూపుతుందేమోనని చూసేది. ఇతరులు పడే తపనను ఏకరువు పెట్టేది.. కానీ.. లక్కీకి కాదన్నట్లు మాట్లాడేది.

ఎందుకంటే..

శ్రీకాంత్‌ని సునీత కూడా పోగొట్టుకోదలచలేదు. కారణం.. అందరిలోనూ శ్రీకాంత్ డిఫరెంట్! అంతే కాదు.. అడగకనే తనకూ గిఫ్టలు ఇచ్చేవాడు. ఎవరి నుంచి ఏ గిఫ్ట్ వస్తుందో..? ఎవరు ఎలా తనను లిఫ్ట్ చేస్తారో..? ఎందుకొచ్చిన శత్రుత్వం. అందరితో కలుపుగోలుగుంటే చాలు. మంచిగుంటే జీవితానికి అదే 'పదివేలు'.. అప్పుడప్పుడు తనకు కావల్సిందానికన్నా



ఎక్కువగానే ఇచ్చేవారు. పాము చావ కుండా, కట్టె విరగకుండా వ్యవహారాల్ని సుతిమెత్తగా నడిపేది.

చెప్పినట్టే శ్రీకాంత్ అపార్ట్‌మెంట్‌లోని ఫ్లాట్‌ని లక్కీ పేర రిజిస్ట్రేషన్ చేయిం చాడు. ఆమె బ్యాంక్ అకౌంట్‌లో ఇరవై లక్షలు వేసి.. తాళాలతో సహా ఓ కారు అప్పగించాడు.

షాపింగ్‌లు, ఎంటర్‌టైన్‌మెంట్లతో నాలుగు నెలలు క్షణాల్లా గడిచిపోయాయ్.

ఈ నాలుగు నెలల్లో ఎందరో బిగ్‌షాట్స్ పరిచయాలు. అందర్నీ 'హలో' అనేదేగాని, శ్రీకాంత్‌కి తెలియక ఎవరితోనూ విడిగానే కాదు పొడిగానూ మాట్లాడేది కాదు. స్పష్టంగా వుండేది.

అయితే.. అందర్నీ పరిశీలించేది.

★ ★ ★

తటాకంలోని నీటిలా కాలం నిశ్చలంగా ఉండదు. ఓ గాలి రివట చాలు.. కొలనుని అలలు అలలుగా చెరిపివేయడానికి, కాని గాలి కంటికి కనపడదు.

అందుకు ఉదాహరణ..

హఠాత్తుగా శ్రీకాంత్ ఓ రోజు ఆక్సిడెంట్‌లో చనిపోవడం!

పరాయి వ్యక్తిగా కాక తన మనిషిగా తనంటే ప్రాణమిచ్చే వ్యక్తిగా అతన్ని ఇష్టపడుతున్న సమయంలో జరిగిన ఈ సంఘటన లక్కీని ఒక్కసారిగా కుదిపేసింది.

శ్రీకాంత్‌ని చూడడానికి ఇప్పుడు ఏం చేయాలో.. ఎవరితో వెళ్ళాలో.. ఎటెళ్ళాలో అర్థంకాని స్థితి ఏర్పడింది.

శ్రీకాంత్ భార్యాపిల్లలతో పరిచయమే



లేని తనం, అసలు తనెవరో, ఏమిటో వారి కుటుంబ సభ్యులకు తెలియని విషయం గానే వుంచాడు. లక్కీ కూడా ఎప్పుడూ శ్రీకాంత్ ఇంటి విషయాలని ప్రస్తావనకు తీసుకురాలేదు. ఆ అవసరం రాలేదు..

అందుకే..

అందరిలాగ శ్రీకాంత్ ఇంటికి వెళ్ళలేక పోయింది.

ఉదయాలు సాయంత్రాలు రాత్రులు గదిలో గడిపింది.

ఇద్దరు పని మనుషులు, డ్రైవర్ రావడం.. తను మౌనంగా ఉండటం చూసి తమ పని తాము చేసుకుని వెళ్లడం జరిగింది.. జరిగిపోతోంది..

వాళ్ళకు జీతాలివ్వాలని ఒకటో తేదీన తెలిసింది.

తన దగ్గర డబ్బు చూసుకుంది.

ఇరవై వేలుంది..

అప్పుడు ఆలోచించింది.

డ్రైవర్‌కి, పనిమనుషులకు పదిహేను వేలు పోను.. అయిదు వేలు.. ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో ఇరవై లక్షలు..

అంతే!

ఏం చేయాలో తోచని పరిస్థితి..

సరిగ్గా అప్పుడొచ్చింది..

సునీత నుండి ఫోన్..

సునీత మాటాడుతున్నంత సేపు ఏడుస్తూనే వుంది.

శ్రీకాంత్‌ని తలచుకుని.. ఇద్దరూ వెక్కి వెక్కి ఏడ్చారు. సాయంత్రం వచ్చి కలుస్తానని చెప్పింది, సునీత.

అన్నట్టుగానే సాయంత్రం రవితో కలిసి

వచ్చింది. ముగ్గురూ కాసేపు మౌనంగా కూచున్నారు..

ఆగలేకపోయారు.. కన్నీళ్ళు తన్నుకొని వస్తుండటంతో భోరున ఏడ్చేశారు. ఎవరు ఎలాంటి వ్యక్తులైనా ఒకానొక ఆత్మీయత ఎదుట కన్నీరు కార్చాల్సిందేననిపించింది.

'ఏం చేయదలచుకున్నావని' సునీత వెళ్ళే ముందు లక్ష్మిని ఒకే ఒకమాట అడిగింది.

లక్ష్మిలో జవాబు అగుపించక, కళ్ళలో శూన్యం కదలాడడం చూసి..

"సరే.. నేను రేపు వచ్చి కలుస్తాను.. లేదంటే ఫోన్ చేస్తాను.." అని రవితో వెళ్ళిపోయింది సునీత.

★ ★ ★

"లక్ష్మీ.. ఏం చేస్తున్నావ్?" సునీత నుంచి ఫోన్.

"ఏం లేదు.. అలా కూచున్నాను.." లక్ష్మి జవాబు.

"సరే.. బి ప్రాక్టికల్.. నేను చెప్పేది శ్రద్ధగా విను.. జరిగిందేదో జరిగిపోయింది. శ్రీకాంత్ వున్నన్నాళ్ళూ నిన్ను బాగా చూసుకున్నాడు. నీకు ఏ అవసరం రాకుండా అన్నీ తనే అయిపోయాడు. డబ్బు గురించో, రేపటి గురించో ఆలోచించే అవకాశం నీకు రాలేదు.. కొన్నాళ్ళుంటే.. నీ కాళ్ళపై నీవు నిలబడే స్టేటస్‌ని ఇచ్చేవాడేమో.. అది నీకూ తెలిసొచ్చేదేమో.. కాని తను హఠాత్తుగా పోవడంతో.. అపార్ట్‌మెంటు, ఇరవై లక్షలు మాత్రమే మిగిలాయి. ఇక ఇప్పుడు కారు, పెట్రోలు, పని మనుషులు, డ్రైవరు, ఇంటి మెయింటెనెన్స్. నెలకు కనీసం యాభైవేలు అవసరం. శ్రీకాంత్ వున్నప్పటిలా వుండాలంటే.. మినిమం లక్ష పై మాటే.. పోనీ.. ఇప్పుడున్న ఇరవై లక్షలు విత్‌డ్రా చేసినా.. నలభై నెలలు రావు.. ఇక అటు రమేష్ దగ్గరికెళితే నిన్ను వాడుకోవడానికే చూస్తాడు గాని నీ చేతికి చిల్లిగవ్వ రానివ్వడు. అతని మనస్తత్వం అర్థమయినదానివి.. నేను నీకు చెప్పాల్సిన పని లేదనకో.. సరే.. విషయానికొస్తాను. నేను చెప్పినట్టు చేశావంటే.. డబ్బుకు డబ్బు.. ఇదే మెయింటెనెన్స్.. అన్నీ.. అన్నీ ఇలాగే వుంటాయి. జీవితకాలానికే కాదు.. కొన్ని తరాలకు సరిపడా సమకూరుతాయి. లేదంటే నీవెవరో తెలిసిన వాళ్ళు.. నిన్ను నిన్నుగా వుండనివ్వరు. ప్రస్తుతం.. ఎవరో ఒకరు నీకు తోడు అవసరం. తప్పనిసరిగా అవసరం.. సెక్యూరిటి చాలా అవసరం. సరే.. ఇంతకు మునుపే చెప్పాను కదా! బిగ్ షాట్స్ గురించి.. ఇప్పటికీ వాళ్ళంతా క్యూలో ఉన్నారు. నీకు నచ్చిన, నిన్ను మెచ్చినవానితోనే కొనసాగింపును కొనసాగించు. ఈ సందర్భంలో ఇలా చెప్పాల్సి వస్తున్నందుకు క్షమించు. నీ సెక్యూరిటీని దృష్టిలో పెట్టుకునే చెబుతున్నాను. అయితే.. శ్రీకాంత్ లాగ వీళ్ళెవ్వరూ నిన్ను జీవితాంతం చూడరు. మొహం మొత్తగానే వెళ్ళిపోతారు. వీళ్ళందరూ 'చైన్' సిస్టం గాళ్ళు. 'లైన్' సూత్రం పాటిస్తారు. కాబట్టి అలాంటి మనస్తత్వాలతో మనం వీలైనంత కరెన్సీని ఎక్స్‌చేంజ్ చేసుకోగలగాలి. ఒకరు ఎన్నాళ్ళు మనల్ని అతుక్కుని వుంటారో.. అన్నాళ్ళూ మన దృష్టంతా.. వాడి షాపింగ్‌తో నగలు.. ఎ.టి.ఎం.తో డబ్బు ప్రధానంగానే సాగాలి.. ఆడాళ్ళుగా సుఖం అనేది మనం కనీసం శారీరకంగా కూడా, ఏనాడూ మనసివ్వని ఏ మగాడి నుండి పొందమని తెలుసు.. సమయమంతా.. వాడి తమకం తీర్చుకోవడంతోనే సరిపోతుంది.. మన ఇష్టాయిష్టాలు.. వాడికనవసరం.. ఇక్కడ వాడు మనతో పొందుతున్న సుఖాన్ని మనం కనీసం కరెన్సీగానైనా కాష్ చేసుకోవాలి. విచ్చలవిడిగా గాకుండా.. లిమిటెడ్ పర్సన్స్‌తో.. ప్రస్తుతం.. నువు ఒకరితో తప్పక వుండాల్సిన పరిస్థితి నీది.. తప్పదు.. నువ్వు సరే

నంటే.. రేపు ఎనిమిది గంటలకి 'హ్యాపీ పబ్'కి వచ్చేయ్.." సునీత లక్కీ జవాబు వినకుండానే ఫోన్ కట్ చేసింది.

లక్కీకి ఎక్కువసేపు ఆలోచించాల్సిన అవసరం లేకపోయింది.

సరే! బి ప్రాక్టికల్.. బి ప్రాక్టికల్!!

ఊబిలోకి ఒకరు తాళికట్టి మరీ తోయడం జరిగింది.

అడుగు అడుసులో పడింది.

బురదలో కూరుకుపోవడం జరుగుతోంది. బయటికి రావడమన్నది జరగని పని అని తెలిసిపోయింది.

లోకంలో జరుగుతున్న తతంగమంతా ధనంతోనేనన్న విషయం గ్రహించడానికి ఎక్కువ సమయం పట్టలేదు.

సరే! సరే!

★ ★ ★

సునీత చెప్పినట్టే.. మరుసటి రోజు రాత్రి ఎనిమిదింటికే హ్యాపీ పబ్ కెళ్ళింది లక్కీ. రాత్రి ఎనిమిదింటి నుండి తొమ్మిది వరకు లేడీస్‌కి ఫ్రీ ఎంట్రెన్స్, ఫ్రీ డ్రింక్స్. తొమ్మిది తరువాత వచ్చే వారికందరికి ఎంట్రెన్స్ ఫీజు వసూలు చేస్తారు. డ్రింక్స్ ఖర్చు అదనం.. ఒంటరిగా వచ్చిన లేడీస్ అప్పటికే మత్తెక్కిన స్థితిలో వుంటారు.. తమ కనురెప్పల కదలికలతో ఒంటరిగా వచ్చిన జెంట్స్‌ని పడగొట్టడం.. వాడు పడిపోవడం.. బిల్లు తడిసి మోపెడవడం.. జేబు చిల్లు పడడం మామూలే.. జెంట్స్ వస్తున్నదే.. అందుకు! డబ్బేవడు ఖాతరు చేస్తాడు.. బిల్లు చెల్లించేటప్పుడు.. వాడి పర్స్‌ని లేడీసే హాండిల్ చేస్తారు.. డబ్బు ఎంతుందో చూస్తారు. మినిమం పదివేలు తీసుకుంటూ.. "ఇట్స్ మైన్ డార్లింగ్" - అనేస్తారు. అంతే! కాసేపు ఆమె కంపెనీతో గడిపినందుకు.. ఆమె వీడికి కంపెనీ ఇచ్చినందుకు ఆమె తీసుకునే రెమ్యూనరేషన్ అది.. అంతే!

లక్కీ పబ్‌లో అడుగు పెట్టింది.

నవ్వుతూ చేయి ఊపింది.. పబ్ మధ్య ఓ టేబుల్ వద్ద కూచున్న సునీత.

లక్కీ నేరుగా వచ్చి సునీత పక్కన కూచుంది.

"గుడ్ అండర్‌స్టాండింగ్".. కితాబిచ్చింది సునీత.

"యా.." అంది లక్కీ.. గతమంతా మరిచిపోయినట్టు.

లక్కీ నెల్లూరి దగ్గరి పల్లెలో కొద్దిమాత్రమే చదివినా రెండు నెలలు ట్యూషన్‌తో ఇంగ్లీషు బాగా వంట పట్టింది శ్రీకాంత్ పుణ్యమా అని..

"గుడ్.. ఇప్పుడు.. ఇక్కడికి.. ఇద్దరు వస్తారు.. అంటే రవి గాక మరొకరన్న మాట.. పేరు శేఖర్.. నీవంటే ఇన్నాళ్ళూ పడి చస్తున్నాడనుకో! ఎంతైనా సమర్పించుకుంటాడు.. నువ్వు.. ఊ.. అంటే నాకు.. ట్వంటీ.. నీకు ఎయిటీ.." సూటిగా అడిగేసింది సునీత..

లక్కీ రావడంతోనే పూర్తిగా అర్థమయింది సునీతకి.

లక్కీకి సునీత చెప్పిన పర్సెంటేజ్ అర్థం గాకపోవడానికి అరబ్బీభాష కాదు.. అచ్చంగా పచ్చనోట్ల భాష.

"ఎంతడగాలి? " అంతే స్పష్టంగా ముక్కుసూటిగా అడిగింది లక్కీ.

"వావ్!" గట్టిగా అరిచింది సునీత. "జస్ట్ ఎ మినిట్" అని మొబైల్ తీసి నొక్కింది.

## కొత్తగాలి...

**విజయానికి మాల్యా సూక్తి**
**బ్యాంకులను దోస్తే ఎంతొస్తుంది?**
**బ్యాంకుతో దోస్తీ కోట్లిస్తుంది!**

– చిత్తూరు సాయిప్రసాద్‌రెడ్డి,
చింతలగూడెం, ప.గో. జిల్లా

"హలో.. గుడీవినింగ్ శేఖర్.. యువార్ వెల్‌కం.. వెల్‌కం టు హ్యాపీ పబ్! యువార్ మోస్ట్ వెల్‌కం విత్ ప్లెజర్.." నవ్వుతూ చెప్పింది.

"చెప్పనే లేదు.." రెట్టించింది లక్కీ.

"లక్కీ.. నువ్వింత ప్రాక్టికల్ అవుతావని.. అనుకోలేదు. ఎనీ వే.. హ్యాపీ! చెబుతా.. వాడు.. వాడు.. ఓ మూణ్ణెల్లు.. అంతే! అంతకంటే ఎక్కువ వుండడు.. పెళ్ళాంతోనే రెన్నెళ్ళున్నాడు.. ఆ తరువాత బోర్ కొడుతోందని విడాకులిచ్చాడు.. వాడి భరణంతో ఇప్పటికి ముగ్గురు పెళ్ళాలు మాజీలుగా మారి హాయిగా బతుకుతున్నారు.. స్ట్రీట్ డాగ్ తరహా.. సరే! వాడెవడైతే మనకేంటి? మనకు కావల్సింది.. మనం తీసుకోవాలి.. అంతే!"

"అమౌంట్.. చెప్పు" సూటిగా లక్కీ.

విస్మయంతో ఓ క్షణమాగింది సునీత.

"నిన్ను చూస్తుంటే.. రేపు ఈ హైదరాబాద్‌నంతా ఏలేట్టున్నావ్.. ఓకే ఆస్క్ టు ఫిఫ్టీలాక్స్.. అందులో.." సునీత చెప్పబోయేంతలో..

"టెన్ లాక్స్.. నీకు" అంది లక్కీ.

"ఆర్నమెంట్స్.. షాపింగ్.. మెయింటెనెన్స్.. నీకు చేతనయినంత నీవు పిండుకోవచ్చు కదమ్మా.. మూడు నెలలంటే మాటలా.. మూడు చెరువులు ఖాళీ చేయించొచ్చు. వాడు మోజుపడితే అడిషనల్‌గా అపార్ట్‌మెంట్‌లో ఓ ఫ్లాట్ నీకే కదమ్మా.." గోముగా అంది సునీత.

"ఓకే.. డన్.." లక్కీ.

"బిజినెస్ అంటే ఇలా వుండాలి" సునీత.

"అవును ఇదీ ఒక బిజినెస్సేగా.." లక్కీ.

"నా అంచనా తప్పు కాదు లక్కీ... నా మాట వట్టిపోదు.. రాబోయే రోజుల్లో నగరం నీ గుప్పిట్లో వుంటుంది" సర్టిఫికెట్ ఇచ్చింది సునీత.

"నిజమే.. సునీతా.. మూడు నెలలు అవసరం లేదు.. ఇకపోతే అపార్ట్‌మెంట్‌లో ఓ ఫ్లాట్‌ని వాడితో.. కేవలం కేవలం.. పదిహేను రోజుల్లో సమర్పించుకునేలా చేస్తాను" లక్కీ.

సునీత కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవిచేసింది.

అందమే కాదు ఆలోచన సైతం అంత పదునుగా వుండడంతో సంభ్రమాశ్చర్యాలతో లక్కీనే చూస్తూ కూచుంది.

ఇద్దరూ డ్రింక్‌ని లైట్‌గా సిప్ చేస్తూ కూర్చున్నారు.

గత స్మృతుల్ని సునీత చెబుతుంటే.. ప్రస్తుత స్థితిని లక్కీ అనుభవిస్తోంది.

తొమ్మిది నలభై నిముషాలు.

పబ్ డోర్ తీసుకుని రవి, శేఖర్ నవ్వుతూ వస్తున్నారు.

శేఖర్ ముఖంలో ప్రతి భాగం నవ్వుతో వెలిగిపోతోంది.

శేఖర్, రవి వచ్చి కూర్చున్నప్పటి నుంచి ప్లీజీగా మాటలు సాగుతున్నాయి.

అరగంటలో డ్రింక్స్ ముగించారు.

ఇలాంటి విషయాలలో కొత్తగా పరిచయమైనప్పుడు..

"మీలాంటి వారిని చూడడం ఇదే ప్రథమం.."

"మీతో మాటాడడం నా అదృష్టం.."

ఇలాంటి మాటలు మామూలే..

హృదయంలోంచి గాక పెదాలపై అలవోకగా దొర్లుతున్నాయి మాటలు.. అందాల్ని చూస్తూ..

మాటల మధ్యలో.. సునీత మొబైల్ నుంచి మెసేజ్ చేసింది.

శేఖర్ మొబైల్ వెలిగింది.

మెసేజ్ చూసుకున్నాడు.. ముఖం వెలుగుతుండగా రిప్లై ఇచ్చాడు.

రవికి సునీత మెసేజ్ చేసింది.

రవి తలూపాడు..

"ఓకే.. గైస్.. సీయూ.. టుమారో.. షల్ వుయ్ లీవ్.." సునీత లేచింది.

"ఓకే" పరస్పరం హగ్ చేసుకున్నారు.

రవి, సునీతలు వెళ్ళిపోయారు.

మాటలతో.. చూపులతో శేఖర్, లక్కీల మధ్య అయిదు నిముషాలు గడిచింది.

"సో.. షల్ వుయ్.. మూవ్..? " శేఖర్ తలూపుతూ.

"యా.." లక్కీ కుర్చీలోంచి లేచింది.

లక్కీ చేతిని తన చేతిలోకి తీసుకుని కదిలాడు శేఖర్, అతి దగ్గరలో వున్న తన ఓ అపార్ట్‌మెంట్‌కి..

కచ్చితంగా పదిహేను రోజుల్లోపల.. లక్కీకి ఇవ్వబోయే.. ఆ అపార్ట్‌మెంట్‌కి.. ఆ..పార్ట్.. పె..మెంట్.. ఫ్లాట్‌కి.. పేమెంట్.. ఫ్లాట్‌కి..




**సం**వత్సరం గడిచింది.

లక్కీకి నగరంలో నాలుగు అపార్ట్‌మెంట్స్‌లో నాలుగు ఫ్లాట్లు.. రెండు లేటెస్ట్ కార్లు.. మూడు కోట్ల ఆస్తిని అక్షరాల 'చెమటోడ్చి' సంపాదించింది. తన ఆలోచనా విధానంతో.. ఎక్కడా అపజయం లేకుండా నడిచింది.. తన జీవితానికి తనే రథసారథియై నడిపించింది.

ఒక్క.. పోలీసు డిపార్ట్‌మెంట్ వ్యక్తులతో తప్ప.. అందరితోనూ ఆడుకుంది.. ఆటాడుకుంది.

వ్యాపారం విస్తరించే దశలో.. ఎవరో ఒకరు తను నమ్మిన వ్యక్తి తనకు తోడుగా వుండాలి. డబ్బుకోసమే గాక తన కోసం.. ఏమైనా చేయగలవాడై వుండాలి. అటువంటి 'పీక్' దశలో అగుపించాడు గోపాల్! అటువంటి వ్యక్తి డ్రైవర్ అయితే ఇంకేముంది! అందుకే గోపాల్‌తో అన్నీ వివరంగా చెప్పేది.

గోపాల్ కూడా 'టీ' దగ్గరి నుండి గదిని శుభ్రపరిచే వరకు.. ఫోటో తీయడం నుంచి వీడియో తీసేవరకు అన్నీ తానై చేసేవాడు.. వచ్చే ఆఫీసర్లకు ఏమాత్రం అనుమానం రానీయక తనే ముందుండి పనులు చేయడం చూసి వాళ్ళంతా ప్రతి విషయం గోపాల్‌తో మొదట సంప్రదించి వచ్చేవాళ్ళు.

అయితే.. ఏ విషయాన్నీ తను తన కోసం ఉపయోగించుకోక.. వారి ఫోన్లు రాగానే.. వాళ్ళు ఏం మాటాడింది.. వెంటనే లక్కీకి చేరవేసేవాడు. లక్కీ చెప్పినట్లుగా నడుచుకునేవాడు. ఎవరైనా వేళగాని వేళలో ఫోన్‌చేస్తే అతడి 'స్థితి'ని అర్థం చేసుకునేవాడు. మర్యాదగానే "మేడంకి ఆరోగ్యం బాగాలేదనో కుటుంబ సభ్యులతో వున్నారనో" చెప్పేవాడు.

కొందరు.. ఎత్తుకు పై యెత్తు వేసేవారు. 'తోడు' ఉచితంగా పొందాలనుకునేవారు.. ప్రగల్భాలతోనో, బెదిరింపులతోనో వాడుకోవాలనీ చూసేవారు. అలాంటివారిని.. లక్కీ.. గోపాల్ ఆడుకునేవారు.

అటువంటి వ్యక్తుల్ని సమయం చూసి అన్నీ సరిచేసి రమ్మని చెప్పేది, కమ్మగా ఆహ్వానించేది లక్కీ.

ఇంటికి వారు రాగానే మర్యాదలతో ముంచేది.. టీ.. స్నాక్స్.. కాసేపటి తర్వాత 'రిలాక్స్'గా మాటాడేది. నవ్వుల్ని రువ్వుతూ.. ఎవరూ లేరనుకుని.. అవతలి వ్యక్తి.. దగ్గరగా వచ్చి లక్కీ మీద చెయ్యి వేసేవాడు. అతి త్వరగా దగ్గరగా తీసుకోవాలనే తమకంతో ఏదేదో వాగేవాడు.

అప్పుడు.. అప్పుడు.. 'సడన్'గా ప్రత్యక్షమయ్యేవాడు, గోపాల్.

"అమ్మగారూ..!" అంటూ.

"చెప్పు.. ఏంటి? " అనేది లక్కీ.

వచ్చినవాడు.. తిట్టుకుంటూ.. సర్దుకుని కూచొనేవాడు..

"సారు.. వస్తారు.. బిర్యాని తెమ్మని చెప్పారు కదా! తెచ్చానమ్మగారూ.. వడ్డించ మంటారా..? " అనేవాడు.

"ఏమండీ..! వడ్డించమంటారా..? భోం చేస్తారా? " వచ్చిన ఆఫీసర్‌తో లక్కీ సాగ దీసేది.

ఏం చెప్పాలో తోచక.. తలూపేవారు.

తను.. రాత్రిళ్ళు 'తిననని' చెప్పేది.

గోపాల్ మరికొంచెం 'మందు'ను సర్వ్ చేసేవాడు.

గోపాల్ తొందరగా వెళితే.. మంచిదని గబగబ తాగేసి తినేసేవాళ్ళు.

వచ్చినవాళ్ళకు 'ఇరిటేటింగా' వుండేది.

చివరకు.. అసహనంతో ఇక గోపాల్‌ని వెళ్ళమని తామే చెప్పేవాళ్ళు.

గోపాల్ నవ్వుకుంటూ వెళ్ళిపోయేవాడు.

అప్పుడు..

అప్పుడు.. బయటికి తీసేది లక్కీ..

ఇంతవరకు జరిగిన వ్యవహారాన్ని వీడియోలో బంధించిన విధానాన్ని వచ్చినవాడికి చూపించేది..

గోపాల్‌ది ఎంత చేతివాటమో.. కళ్ళకు రుచి చూపించేది. ..బ్లాక్ మెయిల్.. వెలుతురులో మొదలెట్టేది.

పోలీసు డిపార్ట్‌మెంట్‌తో, పొలిటికల్ లీడర్స్‌తో తనకున్న సంబంధాలను.. పరిచయాలను.. మెల్లిగా చెప్పేది.. పోలీసు డిపార్ట్‌మెంట్‌కి ఫోన్లు చేసి స్పీకర్స్ ఆన్ చేసి తనెవరో తెలిసేట్లు చేసేది.

పోలీసు డిపార్ట్‌మెంట్‌తో వాడి ముందరే తన 'లెవెల్' ఏమిటో? ఎంత గొప్ప హోదాలో వున్న వ్యక్తితోనైనా, ఎంత జోవియల్‌గా మాటాడుతుందో వినిపించేది.

అంతే!

వచ్చినవాడు తనకుతానే ఇంటికి వెళ్ళేట్టు.. త్వరగా వెళ్ళేట్టు పంపించేది. కాని ఉదయం పది నలభై నిముషాలకు 'అనుకున్నంత' డబ్బును వాడితో కక్కించేది.

ఆ.. దెబ్బకు రాత్రి తాగినదంతా.. చెమట రూపంలో దిగిపోయి కాళ్ళ బేరాని కొచ్చే వాళ్ళు.. చులకనగా తనను చూసే వారు కూడా తనవెంట పడటం.. చివరికి.. వీడియోలో పడటం.. తను చెప్పినంత సమర్పించుకోవడం జరిగేది. ఇలానూ ఓవైపు సంపాదన. తన కస్టమర్లంతా ఐ.ఎ.ఎస్., ఐ.పి.యస్., రాజకీయ నాయకులు, వ్యాపారవేత్తలే..

ఒకరినొకరు కాపాడుకునే సంతతికి చెందినవారే.

పోలీసు డిపార్ట్‌మెంట్‌లోని అత్యున్నత అధికార వ్యక్తుల్లో ఒకరు.. లక్కీ అంటే పడి.. పడి.. చస్తాడు.. ఇంకేముంది?

మూడు సంవత్సరాలు గడిచింది.

చీకటి వ్యాపారం లక్కీ జీవితానికి ఎంతో వెలుగునిచ్చింది.

నగరంలోని తన అపార్ట్‌మెంట్స్‌లో వున్న ఎగువ మధ్యతరగతి మహిళలు, పబ్‌లు, కొత్త రుచులు చూడాలనుకునే స్త్రీలతో పరిచయం పెంచుకునేది.

ఏ ఒక్క అపార్ట్‌మెంట్‌లోనూ తను సంవత్సరం కంటే ఎక్కువ వుండేది కాదు.

అపార్ట్‌మెంట్‌లోకి అడుగు పెట్టగానే అందర్నీ ఆహ్వానించి 'పార్టీ' ఇచ్చేది. అందర్నీ మాటాడిస్తూ ఎవరికి ఏం కావాలో అవి సమకూర్చేది. ఇందులో గోపాల్ సహాయం ఎంతో వుంది. వచ్చిన మగవాళ్ళలోని అలవాట్లను బయటికి తీసి డ్రింక్ సప్లై చేసేవాడు. ఆడవాళ్ళను తను మేనేజ్ చేసేది. ఆడవాళ్ళకు వాళ్లకు తెలిపే లెమన్ జ్యూస్‌లో జిన్ కలిపి అందించేది. భార్యకు తెలీక భర్త.. భర్తకు తెలీక భార్యా తాగి రాత్రి శరీరాన్ని మరింత మత్తుతో అనుభవాన్ని పొందే వాళ్ళు.. కొందరు తెలిసినా తెలియనట్టు ప్రవర్తించేవాళ్ళు.. తోడు దొంగలు.. అలాంటి వాళ్ళను ప్రత్యేకంగా మళ్ళీ ఓ

రోజు ఆహ్వానించేది. ఓన్లీ లేడీస్ పార్టీ నిర్వహించేది. ఊఫర్స్ పెట్టి సాంగ్స్ వేసి అందరికీ మందుపోసి డ్యాన్స్ కూడా చేయించేది. డబ్బు సంపాదించడంతో పాటు సుఖాల్ని పొందే తీరు వివరించేది. ముగ్గులోకి దించేది. నెలలో కనీసం అయిదారు మందిని తను చెప్పినట్టు చేసేలా చేసుకునేది. అలా వ్యాపార విస్తృతి చేసుకుంటూ పోయేది.

సునీత ట్వంటీ పర్సెంట్ తీసుకునేదని గుర్తుంది. తను మాత్రం ట్వంటీ పర్సెంట్ మాత్రమే ఇచ్చి ఎయిటీ పర్సెంట్ తీసుకునేది. ఎంత? ఏమిటి? అనేది తన దయా దాక్షిణ్యం మీదనే ఆధారపడేట్టు చేసుకునేది. సుఖంతోపాటు నెలకు లక్ష.. రెండు లక్షలు సంపాదించేలా చేసినందుకు అందరూ అణకువగా వుండేవాళ్ళు.

ఎవరి స్థాయికి తగ్గట్టు వాళ్ళకి, ఎవరి మనస్తత్వానికి తగ్గట్టు వాళ్ళని పరిచయం చేసి డబ్బు వ్యవహారాన్ని తను నడిపేది. ఏదైనా తేడా అగుపిస్తే వాళ్ళ వీడియో క్లిప్పింగ్స్ చూపించి నోరు మూయించేది.

పోలీసు డిపార్ట్‌మెంట్ దగ్గర మాత్రం లక్కీ నిజాయితీగా వుండేది. మిగిలిన వాళ్ళను ఖాతరు చేసేది కాదు.

పోలీసు డిపార్ట్‌మెంట్‌లోని హయర్ అథారిటీ పర్సన్స్ అపరాత్రి వచ్చి ఫలానా వ్యక్తి కావాలని, తను అంతకుముందు పొందిన అనుభవాన్ని గుర్తుంచుకుని వచ్చానని చెబితే అర్ధరాత్రయినా వాళ్ళకి ఫోన్ చేసేది, పంపించేది. వ్యవహారం నడిపించేది. అర్ధరాత్రి, అపరాత్రి సంసారంలో స్త్రీలు రాలేరని తెలిసి తను చిన్న కథ అల్లేది, వారి భర్తల కోసం.

ఓ రోజు ఇలాంటి సంఘటనే జరిగింది.

"నేను అరగంటలో నీ దగ్గరికొస్తాను.. ఫలానా రోజు నాకు పరిచయం చేసిన ఆమె కావాలి. ఇప్పుడు రాత్రి పదకొండవుతోంది. పన్నెండులోగా వచ్చి ఒంటిగంటకెళ్ళిపోతాను.." అని పోలీసు డిపార్ట్‌మెంట్‌లో ఓ ఉన్నత పదవిలో వుండే వ్యక్తి నుంచి ఫోనొచ్చింది.

వెంటనే లక్కీ ఫోన్ తీసి 'ఆమె'కి ఫోన్ చేసింది. భర్త ఫోన్ ఎత్తాడు.

"హలో! పద్మగారున్నారా? " అడిగింది.

"పడుకున్నారండి.. మీరెవరు? "

"నా పేరు 'లక్కీ' అండి"

"చెప్పండి.. మేడం.. ఎనీథింగ్ అర్జంట్? " అతను.

"కడుపు నొప్పితో అల్లాడిపోతున్నానండి. దయచేసి మీ ఆవిడను నాకు తోడుగా పంపించండి.. ఎవరూ లేరు.. డాక్టర్ దగ్గరికి పోవాలన్నా.."

"ఇప్పుడే.. పంపిస్తున్నాను" అతను..

పదిహేను నిముషాల్లో ఆమెను తన ఇంట్లో విడిచి వెళ్ళాడు.

ఆమెకూ తెలుసు కడుపునొప్పి కథ.

భర్త వెళ్ళగానే..

గ్లాసులు తీసి స్కాచ్‌ని సావధానంగా మొదలుపెట్టేవారు ఆ వ్యక్తి వచ్చేవరకు. రాగానే.. అతనికి ఆహ్వానం పలికేది. అతని కళ్ళు ఆత్రుతగా వెతికే వ్యక్తిని అందంగా అలంకరించిన గదిలో చూపించేది. అంతే.. అతను 'ఫ్లాట్' అయ్యేవాడు.

రోజంతా.. అప్పటివరకు లంచం రూపంలో అందరితోనూ పర్సెంటేజ్‌లు తీసుకునేవాడు. ఆ మొత్తం అంతా లక్కీ చేతిలో వుంచేవాడు. మినిమం.. ఆరోజు ఓ గంటలోపు లక్షపైగానే.. ఆ డబ్బు నగరంలో బ్రోతల్ హౌసెస్ నుంచి వచ్చిన దాంట్లో.. వాడి షేర్ మొత్తం.. వెళ్ళే ముందు లక్కీతో రేపు మనిషిని పంపిస్తాను.. ఏం కావాలో వాడితో నీకు అవసరమయ్యేవన్నీ తెప్పించుకో.. ఎంతైనా ఫర్లేదని చెప్పి 'మరీ' వెళ్ళేవాడు.

వాడు వెళ్ళిన తర్వాత ఆమె, తను కూచొని మళ్ళీ మందుకొట్టే వాళ్ళు. ఏ నాలుగింటికో మత్తులోనే నిద్రపోయే

వారు. పదింటికి లేవగానే ఫ్రెషప్ అయ్యే వాళ్ళు. రాత్రి ఇచ్చిన లక్ష 'పై' చిలుకులో ఇరవై వేలు ఆమెకు ఇచ్చేది.

ఎప్పటికప్పుడు కచ్చితంగా 'డబ్బు వ్యవహారం' సెటిల్ చేసేది.

ఈ విషయం కొన్నాళ్ళకు భర్తలకు తెలిసినా కొందరు డబ్బు కోసం, కొందరు పరువు పోతుందని మిన్నకుండిపోయేవారు. ఏ ఒక్కరన్నా గొడవకు దిగితే లక్కీ డిపార్ట్‌మెంట్‌తో రుచి చూపించేది. వందలో ఏ ఒక్కరో ఆత్మహత్య చేసుకున్న మగవాళ్ళు లేకపోలేదు. అటువంటి సమయంలో ఆమె కుప్పకూలిపోయేది. ఎందుకోసం.. ఇదంతా చేస్తున్నానని.. తన్ను తాను నిలదీసుకుని ప్రశ్నించుకునేది. ఎవరి మీద కసితో.. ఎవరిని బలి తీసుకున్నానని భోరున ఏడ్చేది. వారి సంసారానికి ఇంకా ఎక్కువ సంపాదన అందేలా చేసేది. వారు మళ్ళీ రావడానికి నిస్సహాయత చూపినా తనుమాత్రం డబ్బు పంపేది, కొన్నాళ్ళకు వాళ్ళే వచ్చేవాళ్ళు. ఓదార్చి.. పిల్లల జీవితాన్ని సరిదిద్దుకోవడానికి తప్పదని చెప్పేది. డ్రింక్స్ తీసుకుంటూ ఏదో వాగి తమకు తాము సమాధానం చెప్పుకునేవారు. అది అసంబద్ధమైనా, అసత్యమైనా కొన్నాళ్ళకన్నీ మరిచిపోయేవారు.

ఈ వ్యవహారమే కాదు! లక్కీ బ్లాక్‌మనీ వ్యవహారాన్ని అతి చాకచక్యంగా నడపడం నేర్చుకుంది. దేశంలో 'దొంగబాబాలు' చేస్తున్న వ్యవహారాన్ని తను చేయడం మొదలెట్టింది. దొంగబాబాల్ని నమ్ముకుంటే చివరికి బూడిద కూడా మిగలదని, తన్ను నమ్ముకుంటే క్షణాలలో సమస్య తీరుతుందని తన దగ్గర సొమ్ముంటే స్విస్ బ్యాంక్‌లో వున్నట్టేనని, లంచాల ఖాతాలు, వ్యవహారాలు నడిపినప్పుడు వచ్చే మొత్తాలు తన దగ్గరుంచి ఎప్పుడు కావాలంటే అప్పుడు తీసుకెళ్ళేలా చేసింది.

వ్యాపారస్తుల బ్లాక్‌మనీ, మంత్రులు తీసుకున్న లంచాల్ని, ఐ.ఎ.ఎస్., ఐ.పి.యస్.లు అక్రమంగా సంపాదించిన కోట్లు కోట్లు లక్కీదగ్గరే దాచేవాళ్ళు. ఎప్పుడు అవసరమైతే అప్పుడు తీసుకెళ్ళేవాళ్ళు. ఆమెకు అకౌంట్స్ తెలియకపోయినా వాళ్ళిచ్చిందంతా రూపాయతోసహా చెల్లించేది. తారీఖులు సమయంతో, సందర్భంతో సహా చెప్పేది. పైసాతో సహా జవాబుదారీగా వ్యవరించేది.

అచ్చం ఇండియాలో ఓ స్విస్ బ్యాంక్‌గా లక్కీ అందరికీ అండగా నిలిచింది.

అంతేకాదు..

ఎవరు ఏ వ్యాపారం చేస్తున్నారో.. ఆ డబ్బును ఎలా పెట్టుబడిగా చేసుకోవచ్చో తెలిపేది. కొత్తగా వ్యాపారాలు పెట్టేవారు.. తనను అడుగుతున్నారని.. అందులో మీరేమైనా ఈ అనఫిషియల్ అమౌంట్ ఇన్వెస్ట్ చేయడానికేమన్నా అవకాశం వుందేమో చూడమని సలహా ఇచ్చేది. తను వాళ్ళకి మీటింగ్‌నూ అరేంజ్ చేసేది.

గ్లాసుల మధుపానీయాల జలజలలతో జల్లు కురిపించేది.

గాజుల గలగలల జాణలతో వారి గుండెల్ని ఝల్లుమనిపించేది.

లక్కీని నమ్మిన వాళ్ళందరు సక్సెస్ అయ్యారు, అందరూ సంపూర్తిగా సఫలం చెందారనేది సత్యం. ఆ తృప్తి అందరిలోనూ అగుపించేది.

లక్కీకి అప్పగించిన వ్యవహారం వంద శాతం సక్సెస్ చేసేది. అది ఎలాంటిదైనా పరిష్కరించేది.

మొదట సామ, దాన, భేద దండోపాయాలతోగాక ధూమ, పాన, కామ, పూదండలతో విందు పొందు పసందులతో సున్నితంగా ఆనందంగా జరిపించేది. ఏ లోటు లేకుండా.. ఎవరికి ఏది కావాలో అది సమకూర్చేది.

ఓవైపు డబ్బు, మరోవైపు స్త్రీ సౌఖ్యం, నాణానికి రెండు వైపుల అలంకరించుకున్న లోకం. ఆ రెండింటి విలువల్ని పసిగట్టి ఆడుకోవడమే తన వ్యాపారం.

ధనం లేనిది బతుకు అసాధ్యం.

జీవితం తనకు నేర్పిన గుణపాఠం.. పరిస్థితుల్ని, అన్నివైపులా ఆలోచించి అడుగేయడమే విజయానికి సోపానం.

దసరా పండుగలో బొమ్మల కొలువులో ఒకే గూట్లో అన్ని బొమ్మల్ని ప్రదర్శించినట్టు అన్ని డిపార్ట్‌మెంట్స్‌ని తన కనుసన్నల్లోనే నడుపుతూ పోవడం లక్కీకి తెలిసిన విద్య. అందులో అనవసర సమస్యల్ని తలకెత్తుకోక డబ్బు ప్రధానమైన వాటిపైనే కేంద్రీకరించి తమకు ఏమి కావాలో అది పొందుతూ జీవించండని చెప్పడంతో అందరూ ఆనందంగా వుండగలుగుతున్నారు. వాళ్ళకి కావల్సింది లక్కీ దగ్గర దొరుకుతుందన్న సంతోషం.. వారిలో అణువణువునా అగుపించేది.

అడుగడుగునా కనిపించేది.

ఒక్కోసారి ఎంతటి రిస్క్ పనైనా తను తనదిగా భావించేది. అవతల నుండి తుఫానులెదురొచ్చినా, సుడిగుండాలున్నా తన వారిని, తను వారిని రక్షించడానికి వెనుకాడేది కాదు.

ఓసారి.. ఓ ఐ.ఎ.ఎస్., ఓ మంత్రి.. ఓ కేసులో తీసుకున్న డబ్బు మొత్తం రెడ్ హాండెడ్‌గా పట్టుబడే సమయంలో, తనే మేనేజ్ చేసింది. అవతల వాళ్ళు గాభరా పడుతున్న విషయం గమనించి కారు వేసుకుని వాళ్ళ దగ్గరికెళ్ళింది.

"మీరు ఆ కేసును డీల్ చేస్తున్నట్టు తెలపకపోయినా నాకు ముందే తెలుసు. అయినా దాపరికం గురించి చర్చించే సమయం ఇది కాదు. ఏదైనా మీరు వెంటనే డెసిషన్ తీసుకోండి" అంది లక్కీ.

ముచ్చెమటలతో తడిసిపోతూ సిగ్గుతో తలవొంచుకుని నిలబడ్డం చూసి.. ఇద్దరి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని.. 'నేనున్నాను' అని ధైర్యం చెప్పింది.

"లక్కీ..! ఎలా చేస్తావో, ఏమో? మా దగ్గర ఈ డబ్బు పట్టుపడకూడదు. మా పేరు బయటకు రాకూడదు. మొత్తం అమౌంట్ పోయినా ఫర్లేదు.. ఇంకా కావాలన్నా ఇస్తాం.. నీవేం చేస్తావో నీ ఇష్టం" చెప్పారు ఇద్దరూ.

"ఎక్కడున్నాయ్.. డబ్బు సంచులు? "

రెండు గన్నీ బ్యాగ్స్‌లో వున్న వెయ్యి రూపాయల నోట్ల కట్టలు.. తన కారు డిక్కీలో పెట్టించింది. వెంటనే అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

అదీ ఎలక్షన్స్ సమయంలో..!

భూమండలంలోంచి రెండు మైళ్ళ దూరంలో పోతున్న ఊపిరిని వాళ్ళు మళ్ళీ పీల్చుకునేలా చేసింది.

ఆ సందర్భంలో లక్కీ చేసిన, ప్రవర్తించిన విధానం అనూహ్యం.

సెల్ఫ్ కాన్ఫిడెన్స్ ముందు ప్రపంచంలో ఏదీ నిలబడదేమో అన్పించింది.

ఆందోళనలేనితనం అద్భుతమైన మార్గాన్ని చూపిస్తుందనిపించింది.

ఏం చేయాలో తోచనప్పుడు మనిషి గాభరా పడతాడు, తన్ను తాను కోల్పేయే దిశలో అతని ప్రవర్తనే అతన్ని పట్టిస్తుందన్నది సత్యం.

సామాన్యంగా, నిశ్చింతగా వున్నప్పుడు

## కొత్తగాలి...

**ముందు స్వచ్ఛ రోడ్లు**
**తర్వాత స్వచ్ఛ నోట్లు**
**ఆపై స్వచ్ఛ ఓట్లు!**

– ఇషాన్,
బెంగళూరు

## కొత్తగాలి...

**పెద్దనోటు**
**విలవిల!**
**చిన్ననోటు**
**కళకళ!**

*– జి.జి.కె. రావు,*
*శ్రీకాకుళం*

సమస్యలు వాటంతటవే తొలగిపోవడం చూస్తుంటాం.

'లక్కీ' క్షణం ఆలోచించలేదు.

కారుని వీలయినంత వేగంగా నడపమని గోపాల్‌కి చెప్పింది.

తనతో తను ఆడుకోవడం ఎంత బాగుంటుందో.. తనిష్టమొచ్చినట్టు ప్రవర్తించడం ఎంత ఆనందంగుంటుందో తెలిసిన లక్కీ తనలో తాను నవ్వుకుంది.

ఎక్కడి నుంచి ఎక్కడికి ప్రయాణం.. తెలియనిదే జీవితం..

బ్రాందీ షాపుముందు ఆగమంది, మాంచి కూల్ బీర్లు రెండు కేసుల్ని తెమ్మంది. ఓ కేసు తనకాళ్ళ దగ్గర వుంచుకొంది. మరొకటి పక్కన పెట్టుకుంది.

అంతదాకా నగరాన్ని చూస్తూ ప్రయాణిస్తున్న లక్కీ, కారు విండోస్‌ని క్లోజ్ చేసి, ఎ.సి. ఆన్ చేయమంది.

బీరు బాటిల్ నోటితో ఓపెన్ చేసి ఒక్కగుక్కన లాగించేసింది.

గోపాల్ చూపంతా రహదారి మీద, చెవులు లక్కీ మాటమీద పనిచేస్తున్నాయ్.

లక్కీ దగ్గరికొచ్చిన వారెవరైనా సరే.. హయ్యర్ పోలీస్ అఫీషియల్స్ తప్ప మిగిలిన వారందర్నీ తనతో మాటాడుతున్నా.. ఆటాడుతున్నా తన సెల్‌ఫోన్‌లో వారికి అనుమానం లేని విధంగా బంధించేది, గోపాల్‌తో బంధించమని చెప్పేది తనే.. కానీ 'లక్కీ' అంటే గోపాల్‌కి చులకన భావన లేదు. విపరీతంగా గౌరవిస్తాడు. ఆమె చెప్పింది.. ముందు వెనక ఆలోచించక చేసేస్తాడు. గొప్ప భక్తి భావం. తర్కానికి అందని ఆరాధన.

ఏం చెప్పినా చేసే వాళ్ళు ఆనాడూ వున్నారు.. ఈనాడూ వున్నారు.. రేపూ వుంటారు..! యజమానికోసం జీవితాన్ని అర్పించిన వాళ్ళెందరో అగుపిస్తారు. నేటికీ క్రిమినల్స్‌లోనూ, అండర్‌గ్రౌండ్ కార్యకలాపాల్లోనూ కనిపిస్తారు.

అంకితం.. అంకితం.. అంకితం.. అన్ని కాలాల్లోనూ మానవజీవితంలో ఒక సున్నితమైన భావనా ప్రపంచం.

కారు ఎక్కడికెళ్ళాలో తెలియాలంటే.. మాటాడకుండా లక్కీని డిస్టర్బ్ చేయకుండా వుండాలంటే.. ఒకటే మార్గం.

పెట్రోల్ బంక్ దగ్గర ఆపాడు. పెట్రోల్ పోయించాడు. టాంక్ ఫుల్!

గోపాల్‌కి అయిదువేలు తీసిచ్చింది.

పెట్రోల్ బిల్ పే చేశాడు.

కారు స్టార్ట్ చేసే సమయంలో "కర్నూలుకెళదాం" అంది గోపాల్‌తో లక్కీ.

"అలాగే మేడం!" గోపాల్.

కారు బయలుదేరింది.

నగర శివార్లలో చెకింగ్ జరుగుతోంది. ప్రతి వెహికిల్‌ని ఆపి చెక్ చేస్తున్నారు.

లక్కీ రెండో బీరుని కంప్లీట్ చేసింది.

"మేడం! చెకింగ్" గోపాల్.

"అయితే క్యూలో.. నిలువబోకు.. ముందుకెళ్ళి హారన్ కొట్టు" లక్కీ.

"మేడం" అంటూ క్యూలో నిలుచున్న కార్లని దాటేసుకుని సీదా పోలీసుల దగ్గరికొచ్చి ఆపాడు.

ఒకరిద్దరు పోలీసులు "ఏయ్.. ఏయ్!" అంటున్నా వినిపించుకోలేదు.

విజిల్స్ ఊదుతున్నా కారు ఆపలేదు. ఒక ఇన్‌స్పెక్టర్ వచ్చి డ్రైవర్ విండోను 'నాక్' చేశాడు.

గోపాల్ గ్లాస్ విండో దించాడు.

"అందరూ క్యూలో నిలుచుంటే నువ్వేం టి సీదా? " అని ఎస్సై ఇంకేమో అనబో తుండగా.. వెనక్కి చూడమని సైగ చేశాడు గోపాల్, కారులో లైటు వేస్తూ..

ఆకాశంలో జాబిలి కారులో ఉండటమే మిటి? అనేంతగా వెలిగిపోతున్న 'లక్కీ' ఓ వెన్నెల నవ్వు విసిరింది.

"సారీ మేడమ్..! యస్.. యుకెన్‌గో!" అంటూ సెల్యూట్ చేశాడు.

దారి విడిచి పక్కకు తప్పుకున్నాడు.

ఎన్నోసార్లు పోలీసు డిపార్ట్‌మెంట్‌లోని పెద్దాయనతో గెస్ట్ హౌస్‌కి వచ్చినప్పుడు అన్నీ అరేంజ్ చేసేవాడు ఈ ఎస్సై.

లక్కీ నవ్వుకుంది తెల్లగా.. డిక్కీలో సంచులు నవ్వుకున్నాయి పచ్చగా.

రాత్రి పదిగంటలవుతున్నది.

కర్నూలువైపు కారు దూసుకెళుతోంది.

మూడో బీరుసీసా ఓపెన్ చేసింది.

"చూడబ్బా..! నువ్వేం జేత్తావంటే.. కర్నూలు దగ్గరికెళ్ళుగాని టౌన్‌లో కెళ్ళ మాక.. కర్నూలు కనపడతాండగానే యెనక్కు మల్లు. మళ్ళీ షాద్‌నగర్ రాగానే యెనక్కు మల్లు. ఇట్టా రాత్రంతా తిప్పు తానే వుండు. మద్దెన నువ్వు చిన్న చిన్న హోటల్ల దగ్గర టీ తాగుతావుండు. పెద్ద పెద్ద ధాబాల దగ్గర ఆపమాక.. చెబు తూనే మూడో బీరు తాగేసిన లక్కీ నాలుగో బీరు పళ్ళతోనే ఓపెన్ చేసింది.

"మేడం" అంతే అంటున్నాడు గోపాల్.

రాత్రంతా గోపాల్ కారు నడుపుతూనే వున్నాడు.

లక్కీ ఒకటి వెంట ఒకటి బీర్లు తాగు తూనే వుంది. మధ్యలో గోపాల్ మూడు నాలుగు సార్లు టీ కోసం ఆగాడు.

లక్కీ కారులోనే నిద్రపోయింది మత్తు మెలకువ కలగలిపిన తనంతో.

ఉదయం ఏడుగంటలయింది.

లక్కీకి మెలకువొచ్చింది.

"యాడున్నామబ్బీ? "

"కర్నూలు శివార్లలో మేడం" గోపాల్.

"సరే ఇప్పుడు కర్నూలు టౌన్‌లోకెళ్ళు.. తెలుసుగదా! మన లాడ్జి.. అందులోనికి వెళ్ళు.." లక్కీ.

కర్నూలులో లాడ్జిముందాగింది కారు.

కారు చూసి గుర్తుపట్టిన లాడ్జి మేనేజర్ పరుగుతో వచ్చి కారు డోర్ తెరిచాడు. నమస్కారం పెట్టాడు.

గోపాల్‌కి రూం నెంబర్ చెప్పాడు, తనూ వెంట వచ్చాడు.

"ఇగో.. రూంని.. పేరుమీద బుక్ చేయమాక.. తెలుసుకదా.." లక్కీ.

"మేడం.. అలాగే మేడం.. తెలుసు మేడం" మేనేజరు.

లాడ్జి గదిలోకి రాగానే.. "సూడ ప్పయ్యా.. పదకొండు దాక నన్ను డిస్టర్బ్ చెయ్యమాక.. ఫోను రింగ్ కానీమాక.. అంతలోపల ఓ మేనేజరూ.. రెండు పంజాబి డ్రస్సులు, పాంటీలు.. ఏవో కల ర్వి తీసి వుంచు. ఫోన్ చేసినప్పుడు గదికి పంపించు.." అంటూ పర్సులోంచి చేతికి వచ్చినన్ని అయిదొందల నోట్లు తీసిచ్చింది. బహుశా పదిహేను వేలకి తక్కువ వుండవు. మేనేజర్ తలవొంచి తీసుకున్నా ముఖం వెలిగిపోతోంది.

"తెలుసుగా.. నేను దిగినట్టు ఎవునికీ సెప్పమాక. ఇంగ నువ్వెల్లు.."

మేనేజర్ వెళ్ళిపోయాడు.

గోపాల్‌తో "సూడయ్యా! నువ్వు లాడ్జిలో కారుంచమాక. ఆర్.టి.సి. బస్టాండ్ వెహి కల్ స్టాండ్‌లో కారుంచు. కానీ కారులో నువ్వు నిద్రపోమాక. ఆ సంచుల్ని డిక్కీ లోనే వున్నీ.. యాడికీ బోవు. నువ్వు.. ఆడందరు పడుకుంటారు సూడు.. ఆ మంచాల్లో తొంగో.. నీకు సాయంత్రం ఫోన్ సేత్తా.. నువ్వు సెయ్యమాక.. అంతోపల.. నువ్వు డ్రస్సులు కొనుక్కో.. ఏం కావాల్నో తీస్కో.. మేనేజర్ దగ్గరి

కెళ్ళు, ఖాళీ రూం చూపిస్తాడు. స్నానం చేసి బయల్దేరు.. సర్నా" అని పర్సులోంచి పిడికిళ్ళతో అయిదొందల నోట్లు తీసి చ్చింది. దాదాపు ఇరవై వేలుంటాయేమో.. సర్నా" బెడ్‌పై వాలిపోయింది లక్కీ.

గోపాల్ డోర్ వేసి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం పదకొండు గంటలు.. రిసెప్షన్‌లో ఫోన్ రింగయింది.

ఆ రింగ్ కోసమే కాచుక్కూచున్న మేనేజర్ ఫోన్‌ను వెంటనే లిఫ్ట్ చేశాడు.

"మేడమ్.. యస్.. మేడమ్" పలవరిస్తూనే ఫోన్ పెట్టాడు.

లక్కీ చెప్పినవన్నీ కొన్నాడు.

అంతేగాదు లక్కీకి నచ్చే పర్ఫ్యూమ్స్, బాత్‌రూం చెప్పల్స్‌తో సహా..

రూమ్ డోర్ నాక్ చేశాడు.

"కమిన్" అంది లక్కీ.

డోర్‌ను లాక్ చేయలేదు.

బెడ్ మీద కాళ్ళు బార్లా చాపుకుని కూచుంది, వెనక దిండు ఆనించుకుని.

మేనేజర్ తను తెచ్చిన కవర్స్‌ని లక్కీ బెడ్ పక్కనున్న టీపాయ్ మీదుంచాడు.

పార్సిల్ కవర్స్ తీసి చూసింది.

చెప్పిన వాటికంటే ఎక్కువే తెచ్చాడు.

"గుడ్..! అయ్.. లైక్.. అప్పయ్య" అంటూ పర్సులో చేయుంచి పిడికిళ్ళతో అయిదొందల నోట్లిచ్చింది.

దాదాపు పదిహేను వేలుండొచ్చు

"థాంక్యూ.. మేడమ్!" తీసుకుని రెండడుగులు వెనక్కువేసి చేతులు కట్టుకుని నిలుచున్నాడు.

"సో.. సరే.. టీ పంపించు.. ఓకే. మిగతా విషయం తరువాత చెబుతాను.. డ్యూటీలో వుంటావు కదా!" లక్కీ.

"మీరు వెళ్ళే వరకు రాత్రింబవళ్ళు నేనే వుంటాను మేడం" వినయంగా చెప్పాడు.

"గుడ్.. అయ్.. లైక్.. యు.. అయితే నీ డ్యూటీ ప్రకారమే వుండు. డ్యూటీ లేనప్పుడు.. నీవు అనవసరంగా వుండమాక.. ఇంకొకరెవరొస్తారు డ్యూటీలోకి?" అడిగింది లక్కీ.

"చంద్ర.. మేడమ్.." మేనేజర్.

"ఓ చంద్రానా.. ఫర్లేదు.." లక్కీ.

"మేడమ్.. మీరు ఫ్రెషయ్యాక.. ఫోన్ చేస్తే బ్రేక్‌ఫాస్ట్ పంపిస్తాను.." మేనేజర్.

"నో.. అరగంట తరువాత! మొదట టీ పంపించు. తరువాత ఒకేసారి లంచ్ చేస్తా" బాత్‌రూం వైపు నడిచింది.

మేనేజర్ గది బయటికెళ్ళాడు.

బాత్‌రూంలో షవర్ ఆన్ చేసింది.

చల్లని నీళ్ళు లక్కీ ఒంటికి తగిలి వేడినీళ్ళుగా మారాయి.

కానీ తను చల్లబడింది.

తన శరీరాన్ని చూసుకుంది.

"మై బ్యూటీ.. మై గాడ్" నవ్వుకుంది.

అరగంట బాత్‌రూంలోనే గడిపింది.

ఏ.సి. వున్నా కురులు ఆరడానికి ఫ్యాన్ వేసింది.

డోర్‌నాక్.. అయింది.

"కమిన్" లక్కీ.

టీ ఫ్లాస్క్‌తో నిలబడ్డాడు సర్వ్ చేయడానికి బాయ్.

"నువ్వెళ్ళు" అంది.

కాసేపు అలాగే కూచుని టీ తాగింది.

ఏ బ్యూటీ సరంజామాను తెచ్చుకోలేదు.

లక్కీకి అవి ఏనాడూ అవసరం రాలేదు.

స్నానిస్తే చాలు.. ముఖం కడిగితే చాలు. ఆమె స్నోలు.. పౌడర్‌లు.. లిప్‌స్టిక్‌లు వేస్తే తన అందాన్ని కప్పిపుచ్చడానికే గాని మెరుగులు దిద్దడానికి కాదని తనకే కాదు ఎరిగిన వారందరికీ తెలుసు.

అద్దం ముందు నిలుచుని కొత్త పంజాబీ డ్రెస్ వేసుకుంది.

లక్కీ చుక్కలా తయారయ్యింది.

రిసెప్షన్‌కి ఫోన్ చేసింది.

"బీర్లు.. ఓ అరడజన్ పంపించు.. మంచింగ్.. వెజిటబుల్ రింగ్‌రోల్స్ పంపించు. ఫుడ్ సంగతి తర్వాత

చూద్దాం.." అంటూ పరుపు మీదికెళ్ళింది.

పదినిమిషాల్లో బీర్లు వచ్చాయి. మేనేజరే వెజిటబుల్ రింగ్‌రోల్స్ ప్లేట్‌లో వడ్డించాడు.

ఓపెనర్‌తో బీరు ఓపెన్ చేయబోయి ఆగిపోయాడు. లక్కీ తన పళ్ళతోనే బీరు బాటిల్ ఓపెన్ చేయడం తెలుసతనికి.

"సో.. ఏంటి విశేషాలు?" లక్కీ బీరు సీసా మూత పళ్ళతో తీసింది.

"నథింగ్ మేడమ్.. మీరు రావడమే విశేషం.." మేనేజర్.

నవ్వింది.. రొటీన్ డైలాగ్‌కి.

"సరే" అంది.

మేనేజర్ వెళ్ళిపోయాడు.

బీరు తాగుతూ వెజిటబుల్ రింగ్‌రోల్స్ నములుతూ కూచుంది. టి.వి. ఛానల్స్‌ని చకచక మారుస్తూ.. న్యూస్ ఛానల్స్ అన్నీ వరుసగా పెట్టినట్టున్నారు కేబుల్ వాళ్ళు. అన్ని న్యూస్ ఛానల్స్‌లోనూ.. ఐ.ఎ.ఎస్., మంత్రి ఇళ్ళలో సోదాలు చూపిస్తున్నారు.. కచ్చితంగా లక్కీ బయలుదేరిన అయిదు నిమిషాలకే ఎ.సి.బి. వాళ్ళు వాళ్ళ ఇళ్ళపై పడ్డారని తెలుస్తోంది.

అక్రమ సంపాదన ఏదీ సోదాలో దొరకలేదనీ లంచంగా ముట్టినట్లు భావిస్తున్న కోట్లాది రూపాయలేవీ అగుపించలేదనీ బ్యాంక్ బాలెన్స్‌ల్లో ఎనిమిది వేలు, పది వేలు.. పర్స్‌ల్లో మూడు వేలకంటే ఎక్కువేమీ లేవని ఎవరో రాంగ్ ఇన్ఫర్‌మేషన్ ఇవ్వడం జరిగిందని.. పొరపాటుకు చింతిస్తున్నామని అధికారులు పదేపదే వివరణ ఇస్తున్నారు.

బాధితులు రెచ్చిపోతూ "పరువునష్టం దావా వేస్తామని.. ఐ.ఎ.ఎస్.లు, మంత్రులు అంటే అక్రమంగా సంపాదిస్తారనే అపవాదు రాకుండా గట్టి చర్య తీసుకునే విధంగా.. ఓ మీటింగ్ జాతీయ స్థాయిలో పెట్టబోతున్నామని.. సమాజంలో ఎంతో గౌరవస్థానంలో వున్న మమ్మల్ని ఇలా బజారుకీడ్చడం వెనుక రాజకీయ శక్తుల హస్తాలున్నాయో.. లేదా.. తమంటే గిట్టని కొందరు వ్యక్తులున్నారో.. అంతు తేలుస్తామని.. నిప్పుల్ని ముట్టుకున్నారు.. ఇక వారు కాలిపోక తప్పదు.." అని చాలా ఆవేశంగా ధైర్యంగా మాటాడుతున్నారు..

లక్కీ నవ్వుకుంటోంది.

ఇంత ప్రాక్టికల్ జోక్స్.. ఇండియాలోనే సాధ్యం అని 'లక్కీ' విరగబడి నవ్వుతోంది.

బీరు మీద బీరుతాగుతూ రింగ్‌రోల్స్ నములుతూనే వుంది. ఎప్పుడో ఇలా ఒంటరిగా తాగడం.. తనకు తాను మత్తులో పూర్తిగా మునిగిపోవడం.

దైనందిన కార్యక్రమాల్లో నిరంతరం మెలకువతోనే వుండాలి. అటువంటి అన్ని సమయాల్లోనూ మత్తు మెడ వంచి తాగాలి.. ఇలాంటి సమయంలో తన మెడ వంచే వరకు మత్తుకు గ్రీన్ సిగ్నలిస్తుంది.

ఫ్రెష్‌గా కరకరలాడే కరెన్సీ.. వాళ్ళిళ్ళలో ఎలా దొరుకుతుంది..?

అదీ హైదరాబాద్‌లో..!

కర్నూలు బస్టాండ్ వెహికిల్ స్టాండ్‌లో రోజుకు ఇరవై అయిదు రూపాయల బాడుగతో కారుడిక్కీలో క్షేమంగా నిక్షేపంగా నిద్రపోతోంది.

ఎక్కడో పట్టుబడాల్సిన డబ్బు క్షణాల్లో తీసుకున్న నిర్ణయంతో లక్షణంగా వుంది.

మధ్యాహ్నం మూడు గంటల సమయం..

నాలుగో బీరు ముగించి అలాగే పడుకుని నిద్రపోయింది.

అయిదయ్యింది.

లక్కీ ఫ్రెషప్ అయింది.

గోపాల్‌కి ఫోన్‌చేసి కారు తెమ్మంది.

పదిహేను నిముషాల్లో కొత్త దుస్తుల్లో ఓ బ్యాగ్ డ్రైవింగ్ సీటు పక్కన పెట్టుకుని వచ్చాడు. అందులో ఆపిల్ పళ్ళున్నాయ్. ఏ సమయాల్లో ఎక్కడికెళ్తామో.. ఎలా వుంటుందో.. మేడమ్‌కని తెచ్చాడు.

హోటల్ లాడ్జి మేనేజర్‌కి ఫోన్ చేసింది లక్కీ.

కారులో వున్న నిన్నటి బీరు బాటిల్స్‌ని తీసేయమని చెప్పింది. ప్రస్తుతం కూల్‌తో గడ్డకట్టిన బీర్లు పది పెట్టించమంది.

సమయం ఆరయింది.

లాడ్జ్ నుంచి దిగి కారులో కూచుంది.

మేనేజరు, మరో మేనేజర్ చంద్ర.. ఇద్దరూ కారు దగ్గర నిలుచున్నారు.

పర్స్‌లోంచి డబ్బు తీసి ఇద్దరికీ ఇచ్చింది. లెక్కపెట్టి ఏనాడూ ఇవ్వదు. ఆ ఆలోచనే రాదు.

లక్కీ చేతి నుంచి డబ్బు తీసుకున్నవారె వరైనా జీవితంలో చివరి క్షణం వరకు మరచిపోవడం జరగదు.

కారు కదిలింది.

కారులో బీరు సీసా ఓపెనయ్యింది.

"అబ్బయా! హైదరాబాద్ హైవేలో బండి నడుపుతాబో.. గాని నిన్న సేసినట్టే.. మళ్ళీ మనం ఉదయం అయిదారింటికి కర్నూల్‌కే రావాల.. నువు బాగ నిద్రపోయినవ్ గదా.." లక్కీ.

"మేడమ్".. కంటికి కునుకు లేకుండా ఇరవై గంటలు నడపమన్నా నడిపేంత రీఛార్జ్ అయ్యాడు గోపాల్.

లైట్‌గా తిని.. బాగా నిద్రపోయాడు.

కారు తిన్నగా హైవేలో వెళ్తోంది. గద్వాల బోర్డు అగుపించింది.

"అబ్బయ్యా..! గద్వాల రోడ్డెక్కించు" అంది లక్కీ.

"మేడమ్" గద్వాల రోడ్డెక్కింది కారు.

"గద్వాల్‌లోకెళ్ళమాక.. ఊరు మొదల య్యినాక వెనక్కి తిప్పు" లక్కీ.

"మేడమ్" గోపాల్.

పిచ్చి పట్టిందో మందెక్కువైందో అనుకుంటారు.. ఇలా ప్రవర్తిస్తే.. గాని తన అంచనా ప్రకారం రెండురోజులిలా గడిపితే చాలు.. పట్టుబడితే పోయేది డబ్బు.కారులోకి సంచులెలా వొచ్చాయో తెలీదని చెప్పచ్చు. కర్నూల్ బస్టాండ్ వెహికల్ స్టాండ్‌లో ఎవరైనా పెట్టుండచ్చు అని చెప్పవచ్చు లేదా సోదాలో పట్టుకున్న వాళ్ళు డబ్బు తీసుకుని ఇక వెళ్ళమని చెప్పవచ్చు.

డబ్బేవడికి చేదు..? అన్ని రుచుల్నీ తనలో ఇముడ్చుకుంది డబ్బు.

అన్నింటికీ రుచుల్ని కలిగిస్తుంది డబ్బు.

డబ్బు రుచి మరిగినోడు.. పశువు గడ్డిని తిన్నట్టు జీవితమంతా కరెన్సీనే తింటూ వుంటాడనేది మనం చాలామంది వ్యాపారస్తుల్ని, అధికారుల్ని గమనిస్తే తెలుస్తుంది.

## డిసెంబరు - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **వేమూరి భవాని**
   - శ్రీకృష్ణా కాలనీ, వరంగల్
2. **డి. భాగ్యలక్ష్మి**
   - వర్నిరోడ్, నిజామాబాద్
3. **బి. సరళ**
   - కొత్తగూడెం, ఖమ్మం జిల్లా
4. **టి. పురుషోత్తం**
   - కొత్తపేట, హైదరాబాద్
5. **కె. లక్ష్మీకాంతం**
   - బ్రాడీపేట, గుంటూరు

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. దేవి | 6. లక్షన్నర |
| 2. టైగర్‌జోన్‌కు | 7. నలుగురు |
| 3. అల్లుడు | 8. రమేష్ |
| 4. శ్రీను | 9. నందుల సుశీలాదేవి |
| 5. పరశురామయ్య | 10. వాల్ట్‌డిస్నీ |

ఆశ్చర్యమేస్తుంది!

డబ్బు.. కాగితాలు.. కరెన్సీ సంపాదించడం కోసం మనిషి తన జీవితకాలంలోని మెలకువనంతా ధారపోయడం.. నిద్రను మానివేయడం..!

నిరంతరం నేలపై పూచే పువ్వుల్ని నింగిలో విరిసే తారల్ని మరచిపోవడం..

కేవలం.. కాగితాల కోసం.. కేవలం కాగితాల కోసం..

ఈ విషయంలో పోలీసు డిపార్ట్‌మెంట్‌లోని పెద్దాయనకి ఫోన్ కొట్టొచ్చు. అయితే విషయం ఎ.సి.బి.కి. వెళ్ళే వరకు రాకూడదు. వెళ్ళాక అతను కల్పించుకోకూడదు అని తనకు ముందే తెలుసు.

ఏమయితే అది అవుతుంది. తనదేం పోతుంది..? బీరు తాగుతూ హాయిగా తిరిగినట్టుంటుంది. ఇష్టానుసారం వున్నట్టు వుంటుంది.

పగలు లాడ్జి, రేయి ప్రయాణంతో రెండు రోజులు ముగిశాయి.

హైదరాబాద్‌లో ఎలక్షన్స్ ముగిశాయి.

మూడోరోజు ఉదయం ఏడు గంటల సమయం.. కారులో కూచుని "హైదరాబాద్.." అంది గోపాల్‌తో.

"మేడమ్" గోపాల్.

కారు కదిలింది.

బీరుసీసా కోసం చూసింది.. కాళ్ళకింద, సీటు పక్కన ఎక్కడా అవుపించలేదు.. వెంటనే రోడ్డు పక్కగా చూసింది. రెండు లిక్కర్ షాపులు అగుపించాయి గాని మూసివేసి వున్నాయి.

"ఏందప్పయ్యా.. ఈ కర్నూలోల్లు.. పొద్దున్నే ఎండబడి ఏడు గంటలయినా మందు షాపులు తీయలా..?" అంది గోపాల్‌తో లక్కీ.

"మేడమ్" డ్రైవర్ గోపాల్.. తనకు నిన్ననే చెప్పివుంటే బావుండేదనుకున్నాడు.

"సరే.. యాడైనా సూడు. దొరుకుద్దేమో.." లక్కీ.

"మేడమ్" గోపాల్.

కర్నూలు ఊరి శివారుకు ఆనుకున్న ధాబాదగ్గర కారు ఆపాడు.

మెకానిక్ షాపులు వరుసగా వున్నాయి.

లక్కీ కారులోనే కూచుంది.

గోపాల్ టీ తాగి వస్తు వస్తు ఆరు చల్లని బీర్లు కార్టన్ బాక్స్‌లో తీసుకొచ్చి కారుడోరు తీసి లక్కీ పక్కన పెట్టాడు. తలవొంచుకొనే వున్నాడు.

అప్పుడు.. లక్కీ నవ్విన నవ్వు.. బాగా కదిలించి ఓపెన్ చేసిన బీరు నురగలా తెల్లగా పొంగిపొర్లింది.

కారు షాద్‌నగర్ దాటుతుండగా మొబైల్ తీసి కాల్ చేసింది.

అరగంటలో అమర్ గారేజ్ దగ్గరికి, ఫోర్డ్ కారు తెమ్మని దాసుకు చెప్పింది.

తనకున్న కార్లలో ఫోర్డ్ మరొకటి.. దాసు మరో డ్రైవర్.

అమర్ గారేజ్. గోపాల్ కారాపాడు.

సమయం తొమ్మిది నలభై అయిదు..

"చూడప్పయా.. నువు ఇంటికెళ్ళి రేపు వచ్చెయ్.. నేను ఫోర్డ్‌లో ఎల్తా.. ఆ డిక్కీలోవి ఈ డిక్కీలో పెట్టు" లక్కీ.

"మేడం" గోపాల్ అంటుండగానే.. ఫోర్డ్ కారు, కారు పక్కగా ఆగింది. దాసు డోర్ తెరిచి నిలబడ్డాడు.

గోపాల్ కారుదిగి డోర్ తెరిచాడు.

లక్కీ ఈ కారులోంచి ఆ కారులో కూచుంది. "పదప్పయా.." దాసుతో లక్కీ.

"అమ్మగారు" కారు కదిలింది.

మొబైల్ రింగయింది. కొత్త నెంబర్.. బహుశా.. మంత్రిదో, ఆఫీసర్‌దో అయి వుంటుందని గెస్ చేసింది.

కొత్తనెంబరుకి రిజిస్ట్రేషన్ పేరెవరిదో వుంటుంది.

కరెక్ట్.. మంత్రిది.

"ఎక్కడ?" అటు నుంచి.

"ఇక్కడే" లక్కీ.

"థ్యాంక్.. గాడ్.. గండం తప్పింది..

పరువు దక్కింది" మంత్రి.

"కష్టపడి సంపాదించిన డబ్బయితే పోతుంది గాని ఇలా కొట్టుకొచ్చిన డబ్బు శాశ్వతంగా నిలబడుతుంది" లక్కీ సామెత తను తిప్పి కొట్టింది నవ్వుతూ.

"సో.. లక్కీ.. సేఫ్.. లక్ష్మి.. సేఫ్.. అన్నమాట" నవ్వుతూ అన్నాడు.

"అంతే కదా!.." అంది.

"సరే.. నెక్ట్స్? !" అన్నాడు.

"ఏముంది.. ఎక్కడ చేర్చాలో చెబితే చేరుస్తా.." లక్కీ.

"అమ్మ బాబోయ్..! ఇప్పుడిప్పుడే తేరు కుంటున్నాం"

"భలేవారే సార్..! సరే.. ఏం చేయ మంటారు? " లక్కీ.

"నీ ఇష్టం.. నీవే తీసుకో.."

"ఎంత? " లక్కీ.

"అందులో ఎంతుందనుకుంటున్నావ్? "

"ఏమో తెలియదు.." లక్కీ.

"ఎనిమిది కోట్లు!"

"అన్ని కోట్లు నాకేల? అసలు నాకేమీ వద్దు. మూడు రోజులు బాగా తిరిగినా.. చాలు.." అంది.

"అలా కాదు.. ఫర్లేదు.. తీసుకో.."

"సరే. అంత కాదుగాని.. ఓ పనిచేద్దాం. ఎన్నాళ్ళ నుంచో.. ఈ ఆలోచన.. ఓ పబ్ మొదలెడదాం.. నా పేరు మీద రిజిష్టర్ అయ్యేలా నేనే చూసుకుంటాను.. మీరిద్ద రూ సైలెంట్ పార్ట్‌నర్స్. సరేనా? " లక్కీ.

"అతను.. నేనూ ఇరువురం కాదనం.. పోయాయనుకున్న సొమ్ముతో మళ్ళీ వ్యాపారం మొదలెడతానంటే వద్దంటా మా..? అదీ నీతో.. అయితే ప్రాఫిట్‌లో నీకు సగం.. మాకు సగంలో సగం సగం. అంటే పాతిక.. పాతిక.. సరేనా? "

"మరో మాట.. పబ్ వ్యాపారంలో మాత్రమే మీకు వాటా.. అందులో జరిగే దందాలో కాదు.." లక్కీ.

"అందులో దందానా..? "

"చర్మ వ్యాపారంలో.. సరేనా? " లక్కీ.

## కొత్తగాలి...

**ఇంద్రలోక సభలన్నీ**
**ఇక గానమయం**
**మురళీగానమయం**
**అమృతాయమానం!**

– మాధురి,
హైదరాబాద్

"ఓహో..! అదా మాకు అందులో భాగ మేమొద్దుగాని అప్పుడప్పుడు కొన్ని కొత్త ముద్దుల్ని పడేయ్" నవ్వుతూ ఫోన్ కట్ చేశాడు మంత్రి.

కొందరు మగవాళ్ళు ఎంత మంది స్త్రీలను అనుభవిస్తే అంత మగాడిగా లోకంలో గుర్తించబడడానికి స్త్రీల సాంగత్యం కోసం వెంపర్లాడుతూ ఉంటార నిపించింది. మరికొందరు తనను ఎందరు ఇష్టపడుతున్నారో లోకానికి చూపించడానికి తహతహలాడుతుంటారని అనిపిస్తుంది.

ఇంకొందరు.. 'స్త్రీలు' తమనే ఆరాధిస్తా రన్న భావన.. తననొక్కడినే ప్రేమిస్తున్నా రన్న వ్యక్తిగత అనుభూతికి లోనవుతూ ఉంటారనిపించింది.

లోకో భిన్న రుచి.

కాని అందరి మగవాళ్ళకు కావాలి 'స్త్రీలోని' శుచి.

ఆమె తననొక్కడినే ప్రేమించాలి.. పూ జించాలి, కామించాలి. తను మాత్రం ఎం దరితోనైనా అనుభవాలు పంచుకోవాలి.

వా..! వా..! వా..! మగాడా..! వా..!

లోకంలో చాలామంది మగాళ్ళు తాము కోరుకున్నది తమనుకున్నట్లే శృంగారంలో జరగాలని ఎదుటి వ్యక్తి ఇష్టాయిష్టాలతో పనిలేకుండా జరుపుకుని, దులుపు కొనిపోవడం జరుగుతూ ఉంటుంది.

శృంగారం ఎవరు మొదట కనిపెట్టారో గాని అద్భుతమైన క్రీడ. ఏ క్రీడలోనూ లేని విన్యాసాలన్నీ శృంగారంలో ఉన్నాయన్నది నిజం. చూపులతో.. స్పర్శతో.. కలయికతో సర్వాంగాలతో తమ్ము తాము మరిచిపోయే దశ. తనువు అలసిపోయినా ఆనందించే దిశగా పయనిస్తూనే తన్మయంతో జీవితమంతా అనుభూతుల్ని ఆస్వాదించడం జరుగుతుంది. ఒళ్ళంతా తీయదనంతో పరవశించే క్రీడ.. ప్రపంచంలోని అన్ని క్రీడల్లోకి శృంగారమంత అద్భుత క్రీడ ఏదీ లేదు.

ఒక స్త్రీ తనకోసం పడిపడి చస్తోందని చులకనగా పదిమందిలో చెప్పుకునే దౌర్భాగ్యులున్న సమాజంలో.. ప్రేమంటే కేవలం యాభై కిలోల నుంచి ఎనభై కిలోల మాంసం, ఎముకలు అనుకునే ఈ ప్రపంచంలో.. పదహారు వయసు నుంచి ఎనభై వరకని ఆలోచించే లోకంలో మనిషికి హృదయం అగుపించకపోవడం దారుణం.

ఎంతోమందిని అనుభవించానని ఎదచరిచి పదిమందిలో చెప్పుకునే వాడు న్యూనతాభావనలో గడుపుతున్నాడనిపిస్తుంది. అటువంటి వాడు తన మగతనం మీద నమ్మకం లేక అందరి దగ్గర పరీక్ష చేయించుకుంటున్న ఓ మానసిక రోగి అవుతాడు గాని, భోగి కాడు అనిపిస్తుంది.

'లక్కీ' ఎంతో మంది మగవాళ్ళ మనస్తత్వాల్ని ఔపోసన పట్టింది. జీవితాన తమకు ఏమి కావాలో తెలియనితనంతో పరుగులిడే మనుషులే పరస్త్రీల సాంగత్యం కోరుకుంటారనిపించింది.

అహర్నిశలూ అభద్రతాభావంతో గడుపుతున్న వాళ్లే పరాయి ఆడదానికి దగ్గర కావాలని, ఆమె ఆత్మీయతలోనే తమకు భద్రత ఉంటుందని తలుస్తూ ఉండడం సహజంగా గమనించింది.

స్త్రీ ముందు పురుషులందరూ చిన్నపిల్లలేననిపించింది.

ఎంతో ఉన్నత పదవుల్లో ఉన్నవారూ, సమాజంలో మేధావులుగా కీర్తి పొందుతున్నవారూ, యోగులని, సన్యాసులని, స్వాములని చెప్పుకునే ప్రతి పురుషుడూ స్త్రీ ముందు నిస్సహాయుడనిపించింది.

ఇప్పుడు తన దగ్గరికొచ్చే ఐ.ఎ.ఎస్.లు, ఐ.పి.యస్.లు, రాజకీయ నాయకులు ఒక్కరేమిటి? అందరూ తమ తమ విషయాల్ని అమాయకంగా చెప్పుకోవడం చూస్తే ఆశ్చర్యమేస్తుంది. తాము ఎంతో నమ్మిన వ్యక్తుల దగ్గర కూడా చెప్పని రహస్యాల్ని అలవోకగా తనకు వారు చెబుతూ పోవడం, తనకు అవసరం లేకపోయినా తనెంత శోధించాడో, సాధించాడో ఏకరవు పెట్టడం గమనించింది. ఓ మెచ్చుకోలుతో వచ్చిన వారందరూ సర్వం కోల్పోవడం చూసింది. తను విసిరిన చిన్న నవ్వుకు గర్వంగా ఆనందించడం జరిగింది.

లక్కీకి అందం, సహనం రెండూ కలిసొచ్చిన అదృష్టం. ఎప్పటికప్పుడు జీవితం నేర్పుతున్న పాఠం ఏమిటంటే.. సమయపాలన, మాట ఇవ్వడం, కచ్చితంగా నిలబెట్టుకోవడం. డబ్బు విషయంలో నిజాయితీగా ప్రవర్తించడం, చెప్పిన సమయానికి, చెప్పిన స్థలానికి చెప్పిన మొత్తం చెల్లించడం ఎలా చేస్తుందో.. వసూలు కూడా అలానే చేస్తుంది. లోకం నేడు మాట మీద కాదు నోటు మీద నిలబడిందని చెబుతూ ఉంటుంది.

ఇవన్నీ మగవారిపై పగ, ద్వేషంతో గమనించలేదు. తన అనుభవానికి సహచర స్త్రీల అనుభవాలని కలబోసుకోవడంతో బయట పడిన పచ్చి నిజాలు.

అలాగని స్త్రీలలో అలాంటి వారు లేరని కాదు. ఆడాళ్ళలోనూ అలాంటి మనస్తత్వాలు ఉన్నాయనడానికి తన చుట్టూ ఉన్నవాళ్ళే సాక్ష్యం. మగవారిని అనవసరంగా మాట్లాడించడం, వారు మాట్లాడిన తరువాత తనంటే పడిచస్తున్నాడని, అంత

అ
క్ష
రం

*కంటికి కనిపించే*
*మురికి గుంటల కన్నా*
*మనసులో మాలిన్యం ఉన్న వ్యక్తులతో*
*జాతికి ఎక్కువ ప్రమాదం*

**- సర్వేపల్లి**



వరకు 'వారు'గా ఉన్న అతన్ని, 'వాడు'గా చిత్రీకరించడం, పదిమందితో ప్రేమింపబడాలని, అందరూ తనంటే పడిచావాలనీ, తన మాటే వినాలని, తన గురించి చెప్పుకోవాలనే ఆడవారూ లేకపోలేదు.

వందమంది పురుషులు 'ఐ లవ్ యు' చెప్పారని కొందరనుకోవడం చూసింది.

మగవాళ్ళలో ఆడ మానసిక రోగులున్నట్టే, ఆడాళ్ళలో మగ మానసిక బలహీనులున్నారు.

అందర్నీ కలిసినట్టే ఒకసారి ఒక రచయిత్రిని కలవడం జరిగింది. ఓ చిన్న పత్రికలో ఇంటర్వ్యూ కోసం ఆమె తన దగ్గరికి వచ్చింది, కాస్త దగ్గరితనంగా మాటాడుతూ. మరికాస్త దగ్గర కావడంతో ఓ పార్టీకి తను ఆమెను ఆహ్వానించింది. కాక్‌టైల్ పార్టీ.. తను డ్రింక్స్ తీసుకోనని చెప్పింది. కాస్త మొహమాట పెడితే కూల్ డ్రింక్ తీసుకుంటానని తీసుకుంది. అందులో స్మాల్ పెగ్ విస్కీ కలిపింది ఆమెకు తెలియదు. ఎందుకంటే అది అందించిన పద్మ ఆ విషయాన్ని సీరియస్‌గా తీసుకోలేదు.

ఆ రచయిత్రి కాస్త మత్తులో తనంటే ఏమిటో తన రచనలంటే పాఠకులు ఎలా పడి 'ఛస్తారో' తెలియజెప్పి, సాటి రచయితలు ముఖ్యంగా మగ రచయితలు, తననీ తన రచనల్నీ ఎంతగా అభిమానిస్తారో నిరూపించడానికి ఎవరికీ తెలియకుండా ఓ రచయితకి మిస్‌డ్ కాల్ ఇచ్చింది.

ఆమె మొబైల్‌కు వెంటనే కాల్ వచ్చింది.

అందరివైపు చూసి నవ్వుతూ "చూశారా, పదినిముషాలు తీరిక ఉండదు.. చూడండి. ఇతను ఓ ప్రముఖ రచయిత. తనకు తనే ఏవేవో బిరుదులు తగిలించుకున్నాడు వినండి" అని తన మొబైల్ ఆన్ చేసింది.

"ఎలా ఉన్నారు మేడం..? మీ నుంచి మిస్డ్ కాల్ వస్తేనూ.." ఈ మాటలు తను మాత్రం వినేలా జాగ్రత్త పడింది.

"ఊ.. బావున్నారా..? ఆ.. నేను బావున్నానండి.. ప్రస్తుతం ఓ నాలుగు నవలలు రాస్తున్నాను.. కవితలు.. కథలు.. మామూలే. మధ్యలో సమీక్షలు.. చంపుకు తింటుంటారు.. అటు పత్రికలవాళ్ళు ఇటు రచయితలు.. పాఠకులు సరేసరి అందుకే అందరికీ టైమ్ టేబుల్ ఇచ్చాను" ఆ రచయిత ఏమీ అడగకపోయినా చెప్పింది.

"అలాగా మేడం..? మీకేం మేడం.."

ఇప్పుడు మొబైల్ స్పీకర్ ఆన్ చేసింది అందరూ వినాలని.

"..మీ రచనలు ఈమధ్య ఉధృతంగా వస్తున్నాయ్. ఏ పత్రికలో చూసినా మీరే! పురస్కారాల మీద పురస్కారాలు వచ్చి పడుతున్నాయ్" అవతలి నుంచి రచయిత.

"ఆ.. ఏదోనండి.. ఒరిస్సా.. తమిళనాడు.. గాక అమెరికా నుంచి ఆహ్వానాలు అందుతున్నాయి గాని.. రాయడానికే సమయం సరిపోవడం లేదు.. వెళ్లామనుకోండి ఎన్నో సీరియల్స్ నిలిచిపోతాయి. వర్క్ పెండింగ్ పడుతుందని వెళ్ళడం లేదు" రచయిత్రి.

"ఆ.. నాకు.." (వెంటనే మొబైల్ స్పీకర్ ఆఫ్ చేసింది అతను ఇక అతన్ని

గురించే చెబుతాడని అది అందరూ విన కూడదని) "..ఆఫర్లొచ్చి పడుతున్నాయి.. నేను వెళితే రచనలేగాక నే చేపట్టిన ఉద్యమం కూడా నీరు కారిపోతుందని వాయిదాలు వేస్తున్నాను.." అవతలి రచయిత.

"ఆహా.. అలాగా! సరేనండి నాకు పనులున్నాయ్. ఏదో మీరు ఫోన్ చేశారని.. లేకపోతే ఎవరి ఫోన్ రిసీవ్ చేసుకోను" అంటూ తనంతకు తనే వదరుతోంది.

విచిత్రమేమిటంటే ఈరోజు ఈ రచయిత్రి గారు ఎలాగైతే మిస్‌డ్‌కాల్ ఇచ్చిందో అతను అవతల ఓనాడు అక్కడున్న అందరి మధ్య మొబైల్‌తో అలాగే ఆడుకున్నాడని అర్థమయింది. ఆ విషయం అక్కడున్న తనకు పరిచయమైన మరో రచయిత చెప్పడం జరిగింది.

"అబ్బబ్బ..! ఈవిడతో వచ్చిపడిందండి.. రోజుకు పాతికసార్లు ఫోన్ చేస్తుంది" అంటూ మొబైల్‌ని ఆన్ చేయకుండానే 'నీకు నా ముద్దులు' అని ముద్దు పెట్టి మరీ మొబైల్ ఆన్ చేశాడట.. ఇన్ని తెలివితేటలు కేవలం అహాల్ని చూపించుకోవడానికే గాని అవి ఏవీ ఈ లోకానికి పనికిరావని సదరు రచయితలకే తెలియకపోవడం.. వీళ్ళు సమాజాన్ని జాగృతి పరచడంలో ప్రధానపాత్రని పోషిస్తున్నామని ఒళ్ళు విరుచుకుంటుంటారు.. తమని తాము మోసపుచ్చుకుని జీవిస్తున్నా.. అన్యాయాన్ని, అధర్మాన్ని హెచ్చరిస్తామనడం, మనిషిని మహోన్నతుని చేస్తామనడం ఎంత హాస్యాస్పదం..!

అంతా ట్రాష్.. ట్రాష్.

ఎవరికోసం? ఎందుకిన్ని నాటకాలతో జీవిస్తున్నారో ఈ మనుషులనుకుంది.

జీవిస్తున్న విధానం స్పష్టంగా వుంటే ఎంత బావుంటుంది? అనిపించింది. అబద్ధాలు.. హిపోక్రసి.. జెలసి.. ఇదీ నేడు 'చదువు' 'కొన్న' మానవజాతి జీవనం.

ఆ రోజు ఆ రచయిత్రి వెళుతూవెళుతూ కొన్ని పుస్తకాల్ని మరిచి వెళ్ళింది.. ఫోన్ చేస్తే.. "అంతదూరం వచ్చి ఆ పుస్తకాల్ని ఏం తీసుకుంటా.. మీ దగ్గరే వుంచండి.. చదువుకోండి" అంది.

అందులో బుచ్చిబాబు- చివరకు మిగిలేది, గోపీచంద్- అసమర్ధుని జీవయాత్ర, చలం- మ్యూజింగ్స్, లత- మోహనవంశీ, శ్రీశ్రీ- మహా ప్రస్థానం కనిపించాయి.

ఆరోజు నుంచి లక్కీ పుస్తకాల్ని చదవడం అలవాటు చేసుకుంది.

లక్కీ మొబైల్ రింగయింది.

"హలో.." నెంబరు కొత్తది బహుశా ఐ.ఎ.ఎస్.దై వుంటుంది.

లక్కీ ఆలోచన ఎప్పుడూ కరెక్టే!

"థాంక్యూ! మమ్మల్ని 'పబ్' పార్ట్‌నర్స్‌ని చేసినందుకు" అవతలి నుంచి ఐ.ఎ.ఎస్.

"నాదేముందండి..? అది మీదే.. డబ్బు.. మీదే.. మీరెలా చెబితే అలా నడుచుకునేదాన్నే" లక్కీ.

"అబ్బె..! నీ అడుగుజాడల్లో మేం నడుస్తాం.. అదే మాకు సేఫ్టీ అని తెలిపేలా చేశావ్.. చేస్తున్నావ్.. నీ రుణం.."

"అంత మాటలెందుకండి.. మనమధ్య"

"మూడు రోజుల్నుంచి.. మహా టెన్షన్‌తో గడిపా.. టుడే అయ్ వాంట్ రిలాక్స్.. విత్.. ఆల్" అన్నాడు.

"తప్పకుండా.. ఎన్నింటికొస్తారు? ఆ.. ఆమే కదా మీ ఫేవరెట్! ఆమెను పిలిపిస్తాను. సమయం చెబితే" లక్కీ.

"రాత్రంతా.." ఫోన్ కట్ చేశాడు.

నవ్వుకుంది.

ఇతను 'ఆమె' చేతి నుండి మందుగ్లాసు ఇస్తే చాలు.. ఔటయిపోతాడు.

ఒక స్త్రీతో తాగడం.. ఒక స్త్రీ తనతో కలిసి తాగడం వింతగా వుంటుందేమో.. పాపం పెళ్ళానికి మాత్రం ఇవేం వుండకూడదు. అసలు తెలియకూడదు. పొద్దున్నే లేచి తలంటి స్నానం చేసి పసుపు రాసుకుని, పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకొని,

తులసికోట చుట్టూ ఇతని కోసం ప్రదక్షిణం చేస్తూ అగుపించాలి.

'మానవా! ఎంతకీ నటన మానవా?' అనుకుంది.

'ఆమె'కు ఫోన్ చేసింది.

"మొన్ననే.. ఎ.సి.బి.. దాడి జరిగింది కదా! ఫర్లేదా! అతనితో వుండటం వలన మనకేం కాదా? " అవతలి నుంచి ఆమె.

"లక్కీని చెబుతున్నాను" అని పెట్టేసింది ఫోన్. అంటే అంత సెక్యూరిటీ అని అర్థం.

'ఆమె' మారుమాటాడక బ్యూటీ పార్లర్ కెళ్ళింది.. రాత్రికి తయారై రావడానికి!




**న**గరంలో నూతనంగా మరో 'పబ్' వెలిసేరోజు పబ్ ప్రేమికులందరూ అత్యుత్సాహంగా వుండటం మామూలే. అయితే ఇప్పుడు 'లక్కీ' పెడుతున్న పబ్‌తో అటు అధికారులు, రాజకీయ నాయకులు, పారిశ్రామిక వేత్తలు, బిగ్ షాట్స్.. అందరూ 'ఆ మజా' రుచి చూసే సమయం దొరికిందని సంతోషించారు.

ఎందుకంటే..

తమని గుర్తు పడతారని, తమ ఇమేజ్ దెబ్బ తింటుందని ప్రముఖులు అటువైపు మళ్ళరు. అయితే ఆ 'మజా' రుచి చూడాలని, డ్యాన్స్ చేయాలని, తాగుతూ డ్యాన్స్ చేస్తూ అదో లోకం లో గడపాలని అనుకోవడం మాత్రం సహజం.

లక్కీ మొదటి రోజు ఓ సినిమా యాక్టర్ 'పబ్' ప్రోగ్రాంలో పాల్గొనేలా తయారుచేసింది.

ఉదయం 11 గంటల నుండి మధ్యాహ్నం 3 గంటల వరకు యూత్‌కి మాత్రమే ఎంట్రెన్స్ వుండేలా చేసింది.

ఎంట్రెన్స్ టికెట్స్ హాట్ కేకుల్లా కాకుండా, ఎండాకాలం కూల్‌డ్రింక్స్‌లా అమ్ముడుపోయాయి.

ఇంతవరకు ఏనాడూ చూడని 'పబ్'ని ఒక సినిమా యాక్టర్‌తో కలిసి ఎంజాయ్ చేయడమన్నది అదృష్టంగా భావించారు కొందరు.. ఇన్నాళ్ళూ వాయిదా వేస్తూ.. ఎంట్రెన్స్ దొరకని పిల్లలు మొదటి ఛాన్స్ ఇలా వస్తోందని మురిసిపోయారు.

లక్కీ పబ్ పేరు.. 'నాన్ స్టాప్ (స్ట్రోక్స్)' పేరులోనే పెన్నిధిని, పరమార్థాన్ని సూచించడం 'లక్కీకే' చెల్లింది.

ఉదయం నుంచి నగరంలో ప్రతి ఒక్కరూ పబ్ పేరు గురించే నాలుగైదు గంటలు చర్చించుకున్నారు. ముఖ్యంగా కాలేజీల్లో.. సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో..

ఉదయం తొమ్మిదింటికే యూత్ 'నాన్ స్టాప్ (స్ట్రోక్స్)'కి వచ్చారు.

ఎంట్రెన్స్ ఫీజు తీసుకుంటూ.. చేతి మీద రబ్బర్ స్టాంప్ వేసి పదిన్నరకల్లా పబ్‌లోనికి వదిలారు.

రోడ్డు మీద క్యూ వుండటం చూసి దారిన పోయేవాళ్ళంతా కొత్త సినిమా రిలీజ్ అనుకున్నారు.

సినిమా యాక్టర్ కచ్చితంగా పదకొండింటికి వచ్చాడు. తనకు డి.జె.గా అనుభవం వుండటం వల్ల ఊఫర్స్‌ని అదరగొట్టే సాంగ్స్‌ని వేసి యూత్‌తో కొన్ని స్టెప్స్ వేశాడు. అమ్మాయిలు, అబ్బాయిలు అతనితో ఫొటో తీయించుకునే విషయంతోనే ఒంటిగంట వరకు సాగింది. డ్రింక్స్ ఫ్రీ కాబట్టి (ఎంట్రెన్స్ ఫీ ఒక్కొక్కరికి రెండు వేలు వసూలు చేయడమైనదని గమనించ గలరు) కొంతమంది మొదటిసారి తాగే

## కొత్తగాలి...

**ఫేస్‌బుక్ నిండా లైకులు**
**వాట్సాప్ నిండా గ్రూపులు**
**స్మార్ట్‌ఫోన్ ఉంటే సెల్ఫీలు**
**టీనేజర్ల ఆటవిడుపులు!**

– *బండ్ల సుబ్రహ్మణ్యం,*
*మంగళగిరి, గుంటూరు జిల్లా*

వారు యూత్ ఒక మగ్ బీరుతో సరిపుచ్చుకుని మత్తొస్తుందేమోనని ఎదురు చూస్తున్నారు. మరికొంత మంది ఒక బీరు బాటిల్ వరకు లాగించి డ్యాన్స్ ఫ్లోర్ మీదికి వచ్చేశారు.

అమ్మాయిలు మాత్రం హీరోనే చూస్తూ మధ్యలో అబ్బాయిల డ్యాన్సుల్ని ఎంజాయ్ చేస్తున్నారు.

సాఫ్ట్‌వేర్ కంపెనీల నుండి వచ్చినవారు మాత్రం తమతో వచ్చిన అమ్మాయిలతో డ్యాన్స్ చేయడం మొదలెట్టారు.

ఆ యాక్టర్, డి.జె.గా పనిచేస్తూనే మధ్య మధ్యలో డ్యాన్స్‌ఫ్లోర్ పలచబడ్డప్పుడు.. హీరోతో డ్యాన్స్ చేయాలనుకునే అయిదారు మంది అమ్మాయిల్ని డ్యాన్స్ ఫ్లోర్ పైకి ఆహ్వానిస్తూ తనతో డ్యాన్స్ చేయడానికి సౌకర్యం కల్గిస్తున్నాడు.

డ్యాన్స్ చేసి వచ్చిన అమ్మాయిలు కలలో రాకుమారునితో మేఘాలపై తేలియాడినట్టు విభ్రాంతిలోంచి బయటికి రాలేక ఆనందంతో నవ్వుతూనే వున్నారు. జీవితం సఫలమయిందని సంతోషిస్తున్నారు.

మధ్యాహ్నం మూడు గంటల ముప్పై నిముషాలకు తొలి సెషన్ ముగిసింది.

పబ్ ఖాళీ చేయించారు బౌన్సర్స్.

పబ్‌ని ఏనాడూ చూడని యూత్‌లో తప్పనిసరిగా వీకెండ్ పబ్‌లో గడపాలనే నీటి మీద రాతల్లాంటి నిర్ణయానికొచ్చారు. అందులో నెలకు పదిశాతం వచ్చినా సరే! కొత్త పబ్బులు నెలకు నాలుగు నగరంలో వెలువడతాయనడానికి 'నాన్ స్టాప్ స్ట్రోక్స్' పబ్ శ్రీకారం చుట్టిందనే చెప్పాలి.

బౌన్సర్స్, సీవార్డ్స్‌కి కాస్త రెస్ట్ దొరికింది. లంచ్ వేళ 'లక్కీ' అందర్నీ మెచ్చుకుంది.

రాత్రి ఎనిమిదింటికి వచ్చే లేడీస్ స్పెషల్‌కి అందరూ ఫ్రెష్‌గా తయారుగా వుండాలని చెప్పి ఫ్లాష్‌లా మాయమమైంది.

స్టాఫ్ మొత్తానికి ఒక్కసారిగా లక్కీ దర్శనమివ్వగానే అందరూ ఆ ఫ్లాష్‌లోంచి తేరుకోవడానికి సమయం పట్టింది.

★ ★ ★

రాత్రి ఎనిమిదింటికి నగరంలోని బిగ్ షాట్ లేడీస్ మెల్లగా నింపాదిగా రాసాగారు.. నో ఎంట్రీ ఫీజ్.. ఫ్రీ డ్రింక్స్‌తో ఎంట్రెన్స్‌లో బౌన్సర్స్, బాడీగార్డుల మధ్య ముఖానికి చిరునవ్వు అతికించుకున్న మేనేజర్.. వస్తున్న బిగ్‌షాట్స్ లేడీస్‌కి వెల్‌కమ్ చెబుతున్నాడు.

వచ్చినవారు లోనికి రాగానే పబ్ కంఫర్ట్ ఎలా వుందో చూడ్డానికి చుట్టూ చూపుల్ని పరుగెత్తించారు.

మహా నగరాల్లోని పబ్స్‌కి ఏమాత్రం తీసిపోని విధంగా డిజైన్ చేయడంతో అందరూ సంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు మనసులోనే మౌనంగా.

పెద్దహాల్ మధ్యలో కౌంటర్ చుట్టూ కూచోడానికి చైర్స్, టేబుల్స్. సెకెండ్ ఫ్లోర్‌లోకి అగుపించే విధంగా డ్యాన్స్ ఫ్లోర్ వుండడం. ఎక్కడ కూచున్నా ఒకే విధమైన సంతృప్తిని అనుభవించే విధంగా నిర్మాణం వుండడంతో నగరంలో ఓ మంచి పబ్ వెలసిందని కితాబిచ్చారు.

తొమ్మిదింటికి 'లక్కీ' పబ్‌లోకొచ్చింది.

జీన్స్‌పాంట్ మీద లూజ్ టీషర్ట్ భుజం నుంచి జారిపోయే షల్వార్‌తో నల్ల గులాబీల్ని తలనిండా అలంకరించుకున్నట్టు కురుల్ని ముళ్ళు వేసుకుని కనురెప్పలకు

చమ్కీలు అద్దుకుని అందరూ అబ్బురప డేలా వున్న అందానికి మరింత ఊపిర్లూదుకుని ప్రతిఒక్కర్నీ పలుకరిస్తూ వెళ్ళింది.

ఒక లేడీ పబ్ ఓనర్ అవడం చూసి ఇన్నాళ్ళూ తమకురాని ఆలోచనకు కాస్త తమను తామే చిన్నబుచ్చుకుని ప్రతి ఒక్కరూ 'లక్కీ'ని మెచ్చుకున్నారు.. బిగ్ షాట్స్ లేడీస్.

నగరంలో తొలి ఆదర్శ మహిళగా ఈ ఏడాది మీరేనని కితాబులిచ్చారు.

నవ్వుతూనే కాంప్లిమెంట్స్‌ని స్వీకరిస్తూ మహిళలందరికీ ప్రతిరోజు ఎయిట్ టు నైన్ ఫ్రీ జోన్‌గా డ్రింక్స్ ఫ్రీగా ఇచ్చేట్టు డి. జె. ఛాంబర్‌కెళ్ళి డిక్లేర్ చేసి, కరతాళ ధ్వనుల మధ్య చేయి ఊపుతూ తన ఛాంబర్‌లోకి వెళ్ళిపోయిందామె.

చెన్నై నుండి వచ్చిన డి.జె. లేడీస్‌కు తగ్గట్టుగానే పబ్‌ను సాంగ్స్‌తో నింపుతున్నాడు. మొదటిరోజు కాబట్టి నైన్ థర్టీ వరకూ లేడీస్‌కి ఫ్రీ జోన్ ఆఫర్!

తొమ్మిదిన్నరకి నగరంలోని అఫీషియల్స్ బిగ్‌షాట్స్ రాసాగారు. ప్రతిరోజు వివిధ పబ్స్‌కెళ్ళే వాళ్ళందరూ కొత్తగా వెలిసిన 'నాన్‌స్టాప్ స్ట్రోక్స్' పబ్‌కి రాసాగారు.

ఇంద్రభవనం, మయసభ కలిపి నగరంలో ఒకే చోట నిర్మించిన 'పబ్'గా అభివర్ణిస్తూ మెచ్చుకుంటున్నారు.

ఎంట్రెన్స్ ఫీజు రెండువేలు ఎవరికీ గుర్తుకు కూడా లేదు. తాగగలిగినంత డ్రింక్స్ తీసుకున్నారు. కాని మెలకువగానే అందరూ మాటాడుతున్నారు.. డ్యాన్స్ చేస్తున్నారు.

ఫ్లయ్యర్ సీసాలతో చేసే విన్యాసాన్ని తిలకిస్తున్నారు.

లేడీస్ అందాల్ని మధ్యలో వాళ్ళు చూడనప్పుడల్లా చూపుల్తో సిప్ చేస్తున్నారు.

రాత్రి పదకొండయ్యింది.

అంతవరకు ఇంగ్లీష్ సాంగ్స్‌ని ప్లే చేసిన డి.జె. హఠాత్తుగా "చిక్‌ని ఛమేలి" దేశీ సాంగ్ వదిలాడు.

అంతే!

పబ్.. పబ్.. మొత్తం ఊగిపోతూ డ్యాన్స్ చేశారు.. చేయని వారు లేరంటేనే అతిశయోక్తి. అందర్నీ ఆనందంతో అలసిపోయేలా చేసిన పాటగా చివరికి అటువంటి పాటను వదలడానికి పబ్ నిర్ణీత సమయం.. సంతృప్తి రెండింటినీ దృష్టిలో పెట్టుకుని డి.జె. వేసిన పాట నైపుణ్యానికి అందరూ ఆనందించారు.

తొలిరోజు అలా ముగిసిన పబ్ ప్రథమ దినోత్సవం పురస్కరించుకుని 'లక్కీ' స్టాఫ్ మొత్తానికి ఓ మెసేజ్ పాస్ చేసింది.

'ప్రతిరోజూ పబ్‌ను మొదటిరోజులాగానే మెయింటెయిన్ చేయండి. చివరి రోజు అంటూ పబ్‌కు వుండదని గమనించండి'

★ ★ ★

పబ్ రెండోరోజున ఏడింటికే వచ్చేయండని తనకు పరిచయమైన, తనతో పని చేస్తున్న మొదటి నుంచి అపార్ట్‌మెంట్స్‌లో కలుపుగోలుతో ముగ్గులోకి లాగిన, తమంతట తామే స్వచ్ఛందంగా వచ్చిన లేడీస్‌కందరికీ ఫోన్‌చేసి చెప్పింది.

"నా ఇంట్లో ఫంక్షనుందని, మర్నాడు ఉదయం వస్తామని చెప్పి రండి! 'పబ్' తరువాత, 'ఫాంహౌస్' కెళ్దాం.. కట్టలు తెంచుకునే ఆనందాన్ని రుచిచూద్దురు గాని.." అంటూ అందర్నీ ఊరించింది.

లక్కీ అంటే అందరికీ ఆరాధనే! ఆమె వెనకాల కూడా ఏ కామెంట్ చేయరు. ఎందుకంటే అందర్నీ తనవాళ్ళుగా చూస్తుంది. ఎటువంటి కష్టం వచ్చినా అర్ధరాత్రి అపరాత్రనకుండా ఎటువంటి చోటికైనా వెళ్ళి సమస్యను పరిష్కరిస్తుంది. నిజం చెప్పాలంటే బంధువులందరూ మాటసాయమో, మనిషి సాయమో చేస్తారుగాని వాటితో పాటు అన్‌లిమిటెడ్ 'మనీ' సాయం చేసేవాళ్ళు అరుదు. మనం సునిశితంగా గమనిస్తే లోకంలో ఎక్కడైనా

సరే! ఎవరైనా సరే! డబ్బు దగ్గరే మనిషి మనస్తత్వం బయట పడుతుంటుంది. విశాలంగా మాటాడే మనిషైనా డబ్బు ఇవ్వాలన్నా ఖర్చు పెట్టాలన్నా కుంచించుకుపోతాడు. మనిషిని లోకం అలా తయారు చేసిందో, లోకాన మనిషి అలా తయారయ్యాడో 'మనీ' విషయంలో తొంభై తొమ్మిది శాతం 'మనిషి' కంటే.. 'మనీనే ముఖ్యమన్నట్టు ప్రవర్తిస్తారు.

'లక్కీ' తనంతట తను ఫోన్‌లు ఎవ్వరికీ చేయదు. తనకు వచ్చే ఫోన్‌లలోనూ ఇంపార్టెంట్‌వి మాత్రమే అటెండ్ చేస్తుంది. ఉబుసుపోక ఫోన్‌లు చేసేవాళ్ళని, కాలక్షేపానికి మాటల్ని సాగదీసే వాళ్ళని మొదటిసారే మొదటి మాటతోనే కట్ చేసింది, వినని వాళ్ళకి సీరియస్‌గానే చురక అంటించింది. ఆ దెబ్బకు ఎవరూ మళ్ళీ సాహసించలేకపోయారు.

పబ్ మొదటిరోజు అర్ధరాత్రి వచ్చిన ఫోన్‌లలో రెండింటిని మాత్రమే అటెండ్ చేసింది. ఒకటి ఐ.ఎ.ఎస్.ది, మరొకటి మంత్రిది.. ఎంతైనా పార్ట్‌నర్స్ కదా!

వాళ్ళు 'కంగ్రాట్స్' ఒక్కమాటతోనే గుడ్ నైట్ కూడా చెప్పారు. కారణం వాళ్ళకీ తెలుసు 'లక్కీ' ఎంత వర్క్‌లోడ్‌లో ఉదయం నుంచి వుండి వుంటుందో..

పబ్ రెండోరోజు సాయంత్రం ఏడింటికే లక్కీ ఫోన్ చేసిన స్త్రీలంతా జీన్‌పాంట్స్, టీషర్ట్స్‌తో వచ్చేశారు వానిటీ బ్యాగ్స్‌లో నైటీలు పెట్టుకుని మరీను. పబ్ బయటే అందరూ 'లక్కీ' కోసం ఎదురుచూస్తూ నిలుచున్నారు.

లక్కీ ఏడుఇరవై నిముషాలకు వచ్చింది. కారు దిగి అందర్నీ హగ్ చేసింది. నవ్వుతూ అందర్నీ పబ్‌లోనికి తీసుకెళ్ళింది "ఓయ్..! అమ్మి.. ఏయ్..!" అంటూ నెల్లూరి యాసలో పరాచికాలు ఆడుతూ.

"ఈరోజు దున్నిపారేయండి.. మీ ఇష్టమొచ్చినట్టు.. ఏమాత్రం అడ్డు అదుపు లేకుండా.. తాగండి.. ఆడండి.. మన లోకం మన రాజ్యం.. ఇదంతా మనదే గుర్తుంచుకోండి.." అంటూ అపర పబ్ శక్తిగా అభయమిచ్చింది.

పబ్‌లోనికి వచ్చిన వాళ్ళంతా 'లక్కీ'కి అభినందనలు చెప్పారు. పెద్దగా చదువుకోని పల్లెటూరి ఒక పడతి ఈ స్థితికి ఎది గిందంటే హాట్సాఫ్ చెప్పకుండా శత్రువులైనా ఉండలేరని అనిపించింది అందరికీ. అంతేకాదు.. డబ్బు సంపాదనకి, చదువుకి ఏమాత్రం పొంతన లేదని లక్కీ మరోసారి నిరూపించింది.

సరైన సమయంలో సరైన ఆలోచనతో నిర్మాణాత్మకమైన ఆచరణ జరిపించడం.

కమ్యూనికేషన్ ఎక్కడా తెగిపోకుండా కాపాడుకోవడం. ఎవరి విషయంలోనూ, ఏ సమయంలోనూ తను తగ్గకుండా, శత్రుత్వం లేకుండా చేసుకోవడం.

ఈర్ష్యల్ని, ద్వేషాల్ని గమనించి, వారికి తగ్గట్టు ప్రవర్తించడం, చివరకు అందర్నీ కలుపుకుని పోవడంతో ప్రతి విషయం సుఖాంతమవుతూనే వుంది.

మేనేజర్ పబ్ డోర్ దగ్గరే విష్ చేశాడు. స్టీవార్డ్స్, బౌన్సర్స్ ఇక చెప్పాల్సిన పనే లేదు. వర్క్‌మైండ్‌నెస్ వాళ్ళ హావభావాల్లో అణువణువునా చిమ్ముతోంది.

రెండోరోజు ఇంతమంది స్త్రీలను వెంటేసుకుని వస్తున్న 'లక్కీ' మేడమ్‌ని చూసి, ఎంత ప్రపంచం పరిచయముందో అని ఆశ్చర్యపోతున్నారు వాళ్ళందరూ..

డి.జె. వచ్చి విష్ చేశాడు.

"ఓకే.. డి.జె.. అప్ టు నైన్.. యుకెన్ 'ప్లే' దేశీ సాంగ్స్ ఓన్లీ.." అంది.

"విత్ ప్లెషర్ మేమ్.." అని తన ఛాంబర్‌లోకి వెళ్ళిపోయాడు డి.జె..

"నౌ కమాన్ డియర్స్ హేవ్ డ్రింక్స్ యాజ్ యు లైక్. దేరీజ్ నో షై" అంది.

ఇంగ్లీష్ అంత బాగా మాట్లాడ్డం, ఆ భాషలోని స్లాంగ్‌ని పట్టుకోవడం అద్భుత

మనిపించింది అందరికీ..

లిక్కర్ ఛాంబర్ చుట్టూ ఎగబడ్డారంతా.

మొదటి పెగ్ త్వరగా ముగించారు.

మత్తు త్వరగానే ఎక్కింది చాలా మందికి, కారణం.. అలవాటు లేకపోవడం.

డి..జె..

'రింగ.. రింగ' పాటను వదిలాడు.

లక్కీ పదిమందికి సైగ చేసింది.

ఇంకేముంది..?

డ్యాన్స్ ఫ్లోర్ మీదికి బిలబిల వెళ్ళి చిందులేయసాగారు.

ఏనాడూ డ్యాన్స్ చేయనివాళ్ళు కూడా.. ఊగి ఊగిపోతున్నారు.

నడతలోనే నడకలోనే నడుముతోనే స్త్రీ నాట్యాన్ని సొంతం చేసుకుందనిపించింది.. అటువంటిది.. అందరూ తనవాళ్ళయినప్పుడు.. హద్దులు లేని అవకాశమొచ్చినప్పుడు.. ఆనందంతో మనసు నిండినప్పుడు విశ్వరూపం చూపించకెలా వుంటారనిపించింది.

డ్యాన్స్ ఫ్లోర్ మొత్తం.. అలలు తుఫానులు, సుడిగుండాలతో సముద్రమయింది స్త్రీ తత్త్వంతో.. మొదటి పాట ముగిసింది.

అందరూ.. డ్యాన్స్ ఫ్లోర్ ఖాళీ చేసి.. ఖాళీ చేసిన గ్లాసుల్ని మళ్ళీ నింపారు.. రెండు సిప్పులు చేశారో లేదో డి.జె. 'అర్ధ రూపాయిచ్చాడు.. అత్తరు కొనుక్కోమన్నాడు.. పిల్లా నీ బావనిస్తవా!' పాట వదిలాడు. ఇంకేముంది ఇంతకుముందు డ్యాన్స్ చేయనివాళ్ళు కూడా డ్యాన్స్ ఫ్లోర్ మీదికి ఎగబడ్డారు. పాట అయిపోయే వరకు చిందులేస్తూనే వున్నారు.

ఆశ్చర్యం..! ఉదయం తలంటి స్నానం చేసి పూజలు చేసేవాళ్ళు.. సంసారాల్ని, పిల్లల్ని ఈదేవాళ్ళు వీళ్ళేనా? అన్పించింది.

మగవాళ్లు 'అలా' లేనిది వీళ్లుంటే తప్పేముందనిపించింది, ఆ క్షణంలో అందరికీ. పనిచేసే.. బౌన్సర్స్‌కి.. స్టీవార్డ్స్‌కి.. క్లీన

## చతుర ప్రవేశిక

### జనవరి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ధనలక్ష్మికి రమేష్ ఏమవుతాడు?
జ.
2. లక్కీ భర్త ఆమెని ఎవరికప్పగించాడు?
జ.
3. శ్రీకాంత్ పర్సనల్ అసిస్టెంట్?
జ.
4. లక్కీని ఆరాధించే డ్రైవరు?
జ.
5. కాంప్లెక్స్ విషయంలో లక్కీని కలిసింది?
జ.
6. కాంప్లెక్స్ భూమిపూజ చేసిందెవరు?
జ.
7. లక్కీ చివరికి వెళ్ళిన ఊరు
జ.
8. 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' రచయిత?
జ.
9. లక్ష్మీదేవి వాహనం?
జ.
10. 'డాంగ్లింగ్ మాన్' రచయిత?
జ.

పంపినవారి పేరు: ------------------------------------------ వయసు ( )

చిరునామా: ------------------------------------------------------------

------------------------- పిన్‌కోడ్ : ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

ర్స్‌కి.. మగాళ్లందరికీ.

బౌన్సర్స్.. స్టీవార్డ్స్.. స్టాఫ్ మొత్తం.. వీళ్లని చూస్తూ ఆనందిస్తున్నారు. కొత్తగా వుంది.. ఇంతకుముందు ఇలాంటి సీనె ప్పుడూ చూడలేదు. అందుకే వింత సంతోషంగా వుంది.

రెండో పాట ముగియగానే.. డ్యాన్స్‌ఫ్లోర్‌లో కొందరు.. అలాగే వుండిపోయారు. మరికొందరు కిందికొచ్చి మరో స్మాల్ పెగ్ బిగించి డ్యాన్స్ ఫ్లోర్‌పైకెళ్లారు.

డి.జె. నవ్వుతూ 'కెవ్వుకేక.. కెవ్వుకేక' వదిలాడు. ఇంకేముంది? పాటకంటే వీళ్ల గొంతులోంచి వచ్చే కెవ్వుకేకలతో పబ్ అదిరిపోయింది.. ఎవరికి వారే అందరూ కలిసి చిందులేస్తూ, కేకలేస్తూ, ఈలలేస్తూ ఊగిపోయారు.. తన్మయత్వంతో శరీరాల్ని ఊపి పారేస్తున్నారు.

పాటయిపోయింది.

కాని.. ముక్తకంఠంతో అందరూ "వన్స్ మోర్!" అని అరిచారు.

'కెవ్వుకేక' రిపీట్ అయింది.

గాలిలో ఎగిరే పక్షుల్ని మరిపించే విధంగా, ఆకాశంలో నక్షత్రాల్ని తాకి మురిపించే చందనంగా చిందులేస్తూ డ్యాన్స్‌తో పసందు చేశారు.

పాట అయిపోయేంత వరకు ఒకటే గలభాతో పబ్ పగిలిపోతుందేమో? అనిపించింది.. ఐటమ్ సాంగ్స్ ఆడాళ్లకీ మగాళ్ల కంటే ఎక్కువ నచ్చుతాయనిపించింది..

కారణం..

మీనింగ్‌కంటే బీట్‌కే ప్రాధాన్యత, నాట్యానికే ప్రాముఖ్యత ఇవ్వడమేమో..

అలసిన శరీరాలతో అందరూ వచ్చి కుర్చీల్లో కూచున్నారు.

గ్లాసులో మిగిలిన డ్రింక్‌ని సిప్ చేస్తూ, మంచింగ్ చేస్తూ మాటలతో గడిపారు.

లక్కీ తన ఛాంబర్‌లో మేనేజర్‌కి పబ్ ఎలా వుండాలనే విషయం.. రేపటి నుంచి

వచ్చే వాళ్ల పేర్లుగాకుండా.. హోదాలు మాత్రమే చెప్పింది.

"ట్రీట్ అద్భుతంగా వుండాలని.. ఒక్క కస్టమర్ ఇష్టపడకపోయినా అది మనకు నష్టమేనని" వివరించింది.

తొమ్మిది కావస్తోంది.

లక్కీ పబ్‌లోకి వచ్చింది.

అందరూ వచ్చి చుట్టూ మూగారు.

"ఓకే.. షల్ వుయ్.. గో" అంది.

"యా.." అన్నారు మత్తులో అందరూ.

"సరే.. బయట వెహికల్స్ వున్నాయి.. మనమంతా ఇప్పుడు మన ఫాంహౌస్ వెళ్తున్నాం. ఓకె.. లెట్స్ మూవ్.." అని చకచక అడుగేసింది పబ్ బయటికి.

అందరూ బిలబిల బయటికివచ్చి వెహికిల్స్‌లో ఎక్కి కూచున్నారు.

ఏ ఒక్కరూ తమ వస్తువుల్ని మరిచిపోకుండా బౌన్సర్స్, స్టీవార్డ్స్ అందించారు.

పాతిక ఫోర్ వీలర్స్ ఫాంహౌస్ వైపు కదిలాయి.. శివార్లు దాటి ఫాంహౌస్ చేరుకునేసరికి ఆలస్యమవుతుందనుకున్నారు గాని ట్రాఫిక్‌జాం లేకపోవడంతో పది కొండు దాటలేదు.

అప్పటికే ఓ యాభై కార్లు రోడ్డుకు అటు ఇటు బారులు తీరివుండడం లక్కీకి ఆశ్చర్యం కలిగించలేదు. మత్తులో కారులో వున్న వాళ్లందరికీ అవి అక్కడెందుకున్నాయో అనే ఆలోచనే రాలేదు.

ఫాంహౌస్‌లోనికెళ్లే దారిలో నైట్‌క్వీన్ పరిమళం అందరికీ స్వాగతం పలికింది. ఒక మొక్క పరిమళం వెదజల్లడం, గాలి, తెమ్మెరలపై స్వారీ చేయడం పరిసరాల్ని సువాసన భరితం చేయడం ఎంత అద్భుతం! ఫాంహౌస్ అద్భుతంగా తీర్చిదిద్దబడింది. గులాబి మొక్కలతో, కనకాంబరాలతో, చేమంతుల గుబుర్లతో, మల్లె పొదలతో, క్రోటన్స్ తాజాదనంతో వాటిపై పడిన వెన్నెల కాంతితో రేయిని కొత్త సౌందర్యంతో నింపుతున్నాయి.

ఫాంహౌస్‌లో లక్కీ నడుస్తుంటే అందరికీ మబ్బుల్లో జాబిలి కదిలిన అనుభూతి కలిగింది..

ఆ నడకలో వయ్యారం, పెదాలపై తరగని దరహాసం, వదనంలో చెరగని ధీమా రియల్లీ షి యీజ్ ఎ క్వీన్.. ఎన్ని కిరీటాలు ఆమె శిరస్సునధిరోహించినా తక్కువేననిపించింది.

ఎంతకాలం బతికామని కాదు.. ఎంత కాలం జీవించామన్నది ముఖ్యం. క్షణ క్షణం అనుక్షణం ఆనందంతో జీవితాన్ని అనుభవించామన్నది ప్రధానం.

ఫాంహౌస్‌లో పచ్చికపై అప్పటికే మాటాడుతూ కూచున్న నగరంలోని అత్యున్నత అధికారులు, రాజకీయ నాయకులు లక్కీ రాకతో మాటల్ని పక్కన పెట్టి నిశ్శబ్దాన్ని అందుకున్నారు.

"రైట్ టైమ్.. ఓకే?" అంది, గులాబి పెదాలపై వెన్నెల నవ్వుని కాక్‌టెయిల్ చేసి అందరి కళ్లకి అందిస్తూ..

పిడికిలి బిగించి బొటనవేలితో పైకెత్తి.. "యా.." అన్నారు కొందరు.

లక్కీ చుట్టూ వున్న వనితల్ని చూస్తే ఎవరితో కంపెనీ పెట్టుకోవాలో చూస్తున్నారు మరికొందరు.

అక్కడ ఎక్కడా హృదయం, మనసనేవి లేని జీవాల సమూహం లాగుంది..

ఆకలి గొన్న మృగాల సమ్మేళనంలాగుంది.. గొర్రెల గుంపు అనిపిస్తోంది.

మాంసంతలో వేలాడదీసిన పొట్టేలులో ఏ తొడ బాగుంటుందో.. పక్కన వుంచిన లివర్‌లో ఏ లివర్ బాగుంటుందో.. ఏ కండ దొరికితే పంటికి పండగో.. ఇక్కడ లేడీస్‌ని వాళ్లు చూస్తున్న చూపు అలాగుంది. స్త్రీ కండ దొరికితే వొంటికి పండగ చేసుకునే మనుషులే అగుపిస్తున్నారు.

మగువలూ ఏమాత్రం తీసిపోలేదు. ఇంతకుమునుపే అందులో కొందరికి పరిచయం ఉంది.



ఆనందించిన అనుభవమూ ఉంది.

తమను శారీరకంగా సుఖపెట్టని మగాళ్లని చూసీ చూడనట్టు పరిచయం లేనట్టు ఒక్కసారి చూసి కొత్తవారి వైపు చూపుల్ని విసురుతున్నారు.

ఇదివరకు బాగా తాగి శరీరం మీద వాలి నిద్రపోయిన వాళ్లందరినీ ఇప్పుడున్న మూడ్‌లో పలుకరించడానికి కూడా మన సొప్పడం లేదు ఆడాళ్లందరికి.

ఫాంహౌస్ మధ్యలో ఒకచోట కేవలం పైకప్పు మాత్రమే వేసి కిటికీ తలుపులు లేని ఓపెన్ స్టేజ్‌ని కట్టించింది. వర్షం వస్తే పార్టీకి ఆటంకం కలగకూడదని.. డ్యాన్స్ చేయడానికీ బాగుంటుందని.

దాదాపు వందమంది ఒక చోట కలిస్తే ఇంకేముంది? ఓ పెళ్లి వాతావరణం.. అందులో ఇక్కడందరూ శారీరక బంధువులే.

తాత్కాలిక పెళ్లికొడుకులు, తాత్కాలిక పెళ్లికూతుళ్లు..

సంగీతం చిన్నగా గాలిలోంచి అందరి చెవుల్ని సుతారంగా మీటుతోంది..

నౌకర్లు అందరికీ డ్రింక్, మంచింగ్‌లు అందిస్తున్నారు..

పది నిముషాల్లో అందరూ జంటలుగా మారిపోయారు.

ముగ్గురు తప్ప..

లక్కీ.. ఐ.ఎ.ఎస్., మంత్రి.. ఒక రాతి బెంచ్‌పై కూర్చున్నారు.

"కంగ్రాట్స్ లక్కీ..! ఎ గ్రేట్ సక్సెస్‌ఫుల్ వెంచర్.." అన్నాడు ఐ.ఎ.ఎస్.



"పబ్.. అంటే మాటలా.. అందర్నీ ఆనందపరచడమన్నది ఈ కాలం ఇంపాజిబుల్.. కానీ.. ఎలా అందర్నీ సంతోషపరుస్తున్నావో ఆశ్చర్యం కలుగుతోంది.. పబ్ సక్సెస్‌కి కంగ్రాట్స్.. మొత్తం సిటీలో పబ్ గురించి.. డైనమైట్ లేడీ 'లక్కీ' గురించే.. టాక్.." నవ్వుతూ మంత్రి.

"అందుకు మీరే ప్రధాన వ్యక్తులు.. ఆ డబ్బే లేకుంటే పబ్బనే మాటే వుండేది కాదుగదా!." లక్కీ.

"అటు చూడు.. మిలమిల మెరుస్తున్న సిటీని.. ఎంతమంది దగ్గర డబ్బు లేదని? సక్సెస్ ఇస్తామంటే.. సక్సెస్ చేస్తామంటే.. వేల కోట్లు గుమ్మరించే వ్యక్తులున్నారు. ఇప్పుడు.. వాళ్లందరూ.. నీ ముందు క్యూ కడతారు. డబ్బుంటే చాలదు.. దాన్ని సరైన ప్లాన్‌తో ఖర్చు చేస్తేనే పేరుకు పేరు.. డబ్బుకు డబ్బు.. రెండూ క్రెడిట్ ఖాతాల్లోకొచ్చి చేరుతాయి. ఎనీవే.. వన్స్ మోర్ కంగ్రాచ్యులేషన్స్..! ఇంకో విషయం.. నీవు మాకు చేసిన సహాయం అంతా ఇంతా కాదు.. ఆ డబ్బు మాది కాదనుకున్నాం.. మేం బయటపడితే చాలనుకున్నాం. అందుకోసం ఇంకా వెచ్చించడానికి తయారయిపోయాం.. కానీ.. ఆ డబ్బును, మమ్మల్ని సేఫ్ సైడ్ చేసి, డబ్బును తిరిగి మాకే అప్పజెప్పే నీ నిజాయితీ అబ్బురపరిచింది. డబ్బుకోసం గడ్డి తింటున్న.. మాతో.. సహా.. డబ్బు కాదు ముఖ్యం.. లోకంలో నమ్మకమన్నది ము

ఖ్యం అన్నది నీ దగ్గరే చూశాం.. వియార్ ప్రౌడాఫ్ యు" కదిలిపోయాడు ఐ.ఎ.ఎస్.

"ఓకె థాంక్యూ పార్ట్‌నర్స్! డీడ్ ఎవరి పేరు మీద రాయాలో రేపు చెబితే అరేంజ్ చేస్తాను. మీ బంధువుల, స్నేహితుల పేర్లు చెప్పండి. అయితే నేను వారితో మాటాడిన తరువాతే అంది" లక్కీ..

"నో.. లక్కీ.. ఇద్దరం ఇందాకే అది నీకు గిఫ్ట్‌గా ఇవ్వాలనుకున్నాం. నా మాట విను. అందరూ తలనొప్పిగాళ్లే. తమకు ఆ పాపం చుట్టుకుంటుందని తెలిస్తే మమ్మల్ని ఇరికించేవాళ్లే. నా మాట విను. నువ్వే తీసుకో. ఇది.. మా నిర్ణయం" మంత్రి.

ఐ.ఎ.ఎస్. తలూపుతున్నాడు.

"నో నో.. మీ డబ్బు.. అందులో నేను చేసిందేమీ లేదు.. మూడు రోజులు.. నా దగ్గరుంది అంతే. అంతకు మించి కాపాడడాలూ, గట్టెక్కించడాలూ.. అంటూ ఏమీ లేవు.. ప్లీజ్" లక్కీ.

"సరే.. మా పేర్లపై ఎలాగూ ఉంచుకోలేం. బంధువులను, స్నేహితుల్ని నమ్మలేం. అందుకే.. నీ పేరు మీదనే ఉండనీ.. వచ్చే ప్రాఫిట్‌తో మరో వెంచర్‌కి ప్లాన్ చేయ్.. అలా కొన్నాళ్లు సాగుతూ పోనీ" అన్నాడు ఐ.ఎ.ఎస్.

"ఓకె.. ఓకె... ఐ కెన్ అండర్‌స్టాండ్.. సరే.. లెటజ్ స్టార్ట్ డ్రింక్స్.. ఛీర్స్!" అంది చేతనున్న గ్లాసుని పెదాలకి ఆనిస్తూ..

ప్రతిగా "ఛీర్స్!" అన్నారు ఇద్దరూ.

ఆ రాత్రి ఫాంహౌస్ మొత్తం.. డ్యాన్స్‌లతో.. ఎవరికిష్టమైన వాళ్ళు వాళ్ళ కేళితో ఖజురహోను తలపింపచేసింది.

లక్కీ గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర' చదువుతూ గడిపింది.

తెల్లారేసరికి మగవాళ్ళంతా చెక్కేశారు. ఒక్కరు లేరు. ఆడాళ్ళంతా అలసిపోయి ఎక్కడబడితే అక్కడ మత్తుగా నిద్రిస్తున్నారు. మెలకువ వచ్చిన కొందరు బ్రష్, ఫ్రెష్ అవుతున్నారు.

నౌకర్లు టీ, కాఫీలు అందిస్తున్నారు.

లక్కీ అందరికంటే ముందే లేచి ఫ్రెషప్ అయి మల్లెమొగ్గల్ని, కనకాంబరాల్ని తుంచుకుని ఓ చిన్న బుట్టలో వేస్తోంది.

పూలు, సూర్య చంద్ర కిరణాల కలయికతో బుట్ట నిండిపోతోంది. అటుగా కాఫీ కప్పుతో వచ్చిన కొందరు స్త్రీలు లక్కీకి గుడ్ మార్నింగ్ చెప్పి.. తామూ మల్లెల్ని, కనకాంబరాల్ని కోస్తూ ప్రశాంత వాతావరణంలో లక్కీని అభినందిస్తూనే వున్నారు.

"టిఫిన్ రెడీ అవుతోంది. ఆ తరువాత బయలుదేరుదాం" అంది లక్కీ.

అందరూ.. సరే.. అన్నారు.

కొందరయితే ఇక్కడే వుండిపోవాలనిపిస్తోందన్నారు.

"కొత్త వాతావరణమేదైనా అలాగే అనిపిస్తుంది.. మనం టూర్ వెళ్ళినప్పుడు.. కొన్ని ప్రదేశాల్ని చూసి.. అక్కడే జీవించేద్దాం అన్పిస్తుంది గాని.. అది జరగని విషయం. మనం ఒక జీవనక్రమానికి అలవాటు పడ్డాం.. పదండి.. మిగిలిన వాళ్ళు ఏం చేస్తున్నారో చూద్దాం" అంది నడుస్తూ లక్కీ.

దాదాపు అందరూ లేచారు. రెడీ అవుతున్నారు.. టూత్ బ్రష్‌లు, టూత్ పేస్ట్‌లు, సోప్‌లు.. టవల్స్ అన్నీ మొదటే అరేంజ్ చేసింది లక్కీ. రాత్రి పడుకోవడానికి వందమందికి సరిపడా బెడ్స్, బెడ్ షీట్స్, బ్లాంకెట్స్‌తో సహా ఫాంహౌస్‌లో సమకూర్చింది.

లేడీస్‌కోసం మేకప్‌కిట్స్ తెప్పించింది.

ఎనిమిది గంటల సమయంలో బ్రేక్ ఫాస్ట్ అయింది. ఎవరికి ఏది కావాలో అన్నీ సమకూర్చింది.

బ్రేక్‌ఫాస్ట్ ముగించగానే మేకప్ కిట్స్ ఒక్కొక్కరికి ఒక్కోటి ప్రెజెంట్ చేస్తూ ఓ కవర్‌నూ తన చేతుల మీదుగా ఇచ్చింది.

"ఇన్నాళ్ళు మీరు నాతో.. నేను మీతో.. వుండడంతో నేను ఒక కొత్త వెంచర్‌ని

సక్సెస్‌ఫుల్‌గా సిటీకి అందివ్వడానికి అవకాశం కలిగింది. ఈ పరస్పర అనుబంధం, సహకారం మనమధ్య ఇలాగే వుండాలని, వుంటుందని మీ అందరికి ఈ చిన్న కానుకను ఇస్తున్నాను. మనం ఇలా కలుసుకుంటూనే వుండడానికి, వ్యాపారాన్ని మీ ద్వారా నడిపించడానికి పబ్ సరికొత్త వేదికగా, అనుకోని ఆనందాలకి అనుసంధానంగా ఊహించని విధంగా రూపుదిద్దుకుంటుంది. మీరు ఇక పబ్‌కి మీ ఇష్టం వచ్చినప్పుడు వచ్చేయచ్చు. బిగ్‌షాట్స్‌తో న్యూకమ్మర్స్‌తో జీవితాన్ని పచ్చ(నోట్లు)గా ఎక్స్‌చేంజ్ చేసుకుంటారని ఆశిస్తున్నా" చిన్న పాటి ఉపన్యాసం ఇచ్చింది లక్కీ.

అందరి ముఖాల్లోనూ ఆనందం వెలిగిపోతోంది. వీలు దొరికినప్పుడల్లా.. లేదా వీలు దొరికిచ్చుకుని రావడానికి అప్పుడే మెదళ్ళకు పదును పెట్టారు.

కవర్‌ని ఓపెన్ చేసి చూశారు.

ఉదయకాంతుల్ని చిమ్ముతూ వేయి రూపాయల నోట్లు..! పాతికవేలు అగుపించాయి. ఒక్కొక్కరి చేతుల్లో గులాబీరేకుల్లా వికసించాయి. అందరిలోనూ ఆశ్చర్యం..!

"రాత్రి మీరు పొందిన ఆనందం.. ఉదయంతోనూ పంచుకోవాలని.. ఇంటిదాకా సంతోషంగా సాగిపోవాలని ఆశిస్తూ" లక్కీ చెబుతుంటే చప్పట్లు మోగాయి.

"ఓకే.. లెట్స్ గో.. కార్లు రెడీగున్నాయి. బయలుదేరుదాం బై.." లక్కీ కదిలింది.

ఒక సైన్యం అనుసరించింది.

★ ★ ★

వీకెండ్స్‌లో పబ్‌ని సినిమా యువ హీరోలతో ప్రెజెంట్ చేస్తూ ప్లాన్ చేసింది.

రెండు నెలల్లో దాదాపు సినిమా యువ హీరోలందరూ పబ్‌లో తాము తరించి కస్టమర్స్‌ని తరింప చేశారు.

అతి తక్కువ సమయంలో సిటీలో 'నాన్‌స్టాప్ (స్టోక్స్' పబ్ నెంబర్‌వన్‌గానే గాక సౌత్‌లోనే నెంబర్‌వన్‌గా గుర్తించబడింది.

సిటీలో సక్సెస్‌ని గమనించే వ్యక్తుల చూపు పబ్‌పై పడింది.

ఓ రోజు 'లక్కీ'కి కాల్ వచ్చింది.

ఫ్యాన్సీ నెంబర్..

తప్పక బిగ్‌షాట్స్‌దే అయి వుంటుంది.

తెలిసినవారు చేసినప్పుడు ఒక్కక్షణం ఆలోచించి అవతల వ్యక్తి ఏమి చెబుతాడో ముందే పసిగట్టేది, కారణం కమ్యూనికేషన్‌ని నిరంతరం తను ఫాలో కావడమే. కాని కొత్తగా వచ్చిన నెంబర్‌తో క్షణం కూడా ఆలోచించక మొబైల్ ఆన్ చేస్తుంది. అవతలి వారి ప్రశ్నలోంచే సమాధానాన్ని తయారుచేసి వెంటనే జవాబు చెప్పే ఖవ్వాలీని తలపిస్తుంటుంది.

"యస్.." అంది.

"గుడ్ మార్నింగ్ మామ్.. అర్జున్.." అవతలి వ్యక్తి.

"ఐ మీన్.." వాయిస్ పసిగట్టింది.

సినిమా హీరోనే గాక రియల్ ఎస్టేట్ రంగంలోనూ నెంబర్‌వన్‌గా వెలుగొందే అర్జున్ వాయిస్‌ని గుర్తుపట్టింది.

"యస్.. యు ఆర్ కరెక్ట్ మామ్"

"చెప్పండి.." అంది లక్కీ.

"మీ గురించి.. అయ్ మీన్.. మీ పబ్ గురించి విన్నాను. 'వెరీగుడ్ పబ్' అని అందరూ చెబుతున్నారు. కంగ్రాట్స్ చెబుదామని" అర్జున్.

"థ్యాంక్యూ" లక్కీ.. తరువాత వచ్చే ప్రశ్న తనకు తెలిసిపోయింది.

"ఎంతకు అమ్ముతారు? " సూటిగా అడిగాడు అర్జున్.

"నేను అమ్ముతానని చెప్పలేదే" అంది అంతే సూటిగా లక్కీ.

కాస్త ఖంగు తిన్నాడు.. జవాబు అలా వస్తుందని ఊహించలేదు.

"నేను కొనాలనుకుంటున్నాను" ఇంకా సూటిగా అర్జున్.

"నేను అమ్మాలనుకోవడం లేదు.." అంతే ఘాటు జవాబుతో లక్కీ.

## కొత్తగాలి...

**అగ్రరాజ్యాన్నే ఎదిరించి**
**అడ్డంకులెన్నో అతిక్రమించి**
**అభివృద్ధి బాటపట్టిన క్యూబా**
**ఆదర్శ దార్శనికుడు క్యాస్ట్రో**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

"రేటు చెప్పండి.." అవతలి నుదుటిపై భ్రుకుటి.

"అమ్మాలని అనుకుంటే కదా! రేటు చెప్పడానికి" లక్కీ.

"నీ కథ నాకు తెలుసులేవే..! ఎంతైనా ఫర్లేదు" కచ్చితంగా నాకు కావాలనే దృఢమైన మాటతో అర్జున్.

"మిస్టర్ అర్జున్..! మాటలు తిన్నగా వస్తే మంచిది.. ఈ సంభాషణ ఇంతటితో ఆపితే బాగుంటుంది. నేను అమ్ముతానని చెప్పడంగాని, ఇతరుల చేత చెప్పించడం గాని ఇంతవరకు చేయలేదు. కాబట్టి మొట్టమొదట ఎంతకు అమ్ముతారని అడగడమే.. మానర్స్ లేనితనం.. అయినా ఫర్లేదు. మీకు సిటీనే కొనగలిగే స్తోమత వుండవచ్చు కానీ మీకు నచ్చినవన్నీ కొంటానంటే.. ఇక్కడ అమ్మడానికి నేను తయారుగా లేను.. సో.." లక్కీ ఇక ఫోన్ పెట్టేయమనే అర్థంతో.

మానర్స్‌లేనితనం అన్నమాటతో అర్జున్‌కి అహం దెబ్బతింది. ఊహించని ఆ మాటతో ఒక్కసారిగా కుదిపేయబడ్డాడు. తనే మొదట విజ్ఞత పాటించలేదని తెలుస్తున్నా.. తనను కాదని.. నగరంలో ఎలా వుంటుందో చూద్దాం అనుకున్నాడు.

"నో.. మీరు అమ్ముతున్నారు.. నేను కొంటున్నాను.. అంతే" అన్నాడు.

"చూడు మిస్టర్ అర్జున్! రియలెస్టేట్ రంగంలో మీరు కింగ్ కావచ్చు. హీరోగా మీకంటూ ప్రత్యేకంగా ప్రేక్షకులు వుండవచ్చు, కాదనను. కానీ మీరు ఆర్డర్ వేస్తే ఇక్కడెవరూ జీ హుజూరులు లేరు. బీ ఇన్ యువర్ లిమిట్స్, హోల్డ్ యువర్ టంగ్" అంటూ మొబైల్ కట్ చేసింది.

సినిమాలో ఎంతో మంది ముఖం మీద అర్జున్ పంచ్ ఇచ్చాడు గాని ప్రస్తుతం తన ముఖం మీద ఇంత పెద్ద పంచ్ పడుతుందని ఊహించలేదు. వ్యాపార విజయపరంపరలో అపజయమన్నదే లేదు. తన మాటకు అడ్డు చెప్పేవాళ్ళే లేరు. ఒకవేళ ఎప్పుడైనా వ్యాపారంలో లేటయితే నోటు పెంచేవాడు. మనిషి దగ్గర డబ్బుంది. ఇష్టపడ్డాడని తెలుసుకున్న వ్యక్తులు కోటి రూపాయల వస్తువుని కోటీ ఇరవై లక్షలకన్నా.. తక్కువకివ్వలేమని తెలియచేసేవారు. తను కోటి యాభైకైనా రెడీగా ఉంటాడని వాళ్ళు ఊహించడానికి ఆస్కారమే లేదు.

కాని ఈ రోజు వర్కవుట్ కాలేదు.

జీవితంలో మొట్టమొదటిసారి ఇలా జరగడం, తిరస్కారాన్ని సహించడం అపజయానికి నాంది కాగలదు.. ఒకచోట అపజయం మొదలయిందని తెలిస్తే.. వెను వెంట అపజయాలు వెన్నంటే వస్తాయని తెలుసుకున్న వ్యక్తి కావడంతో ఎలాగైనా అంతు చూడాలనుకున్నాడు.

అందుకోసం పావులు కదిపాడు.

ఆలోచనల పాములు వదిలాడు.

ఆ రాత్రి లక్కీ శ్రీశ్రీ 'మహాప్రస్థానం' చదువుతూ కూచుంది.

★ ★ ★

'లక్కీ' పేరు సిటీలో ఒక్కసారిగా గుప్పుమంది. ఒక్కొక్కరు ఒక్కో కోణంలో ఆలోచించసాగారు. లక్కీ పట్టిందల్లా ప్లాటినం అవుతుందని వ్యాపార వర్గాలు. లక్కీ చేతిలో పడ్డ పైసా లక్షగా మారిపోతుందని, సాక్షాత్ లక్ష్మీదేవి స్వరూపమని,

లక్కీతో వ్యాపారం చేస్తే నిర్భయంగా వుండొచ్చని, లైసెన్స్‌లు, పర్మిట్లు కన్ను మూసి కన్ను తెరిచేలోపల తనే చూసుకుంటుందని, ఒక్కసారి లక్కీ చూపు మనపై పడితే ఇట్టే ఎదిగిపోవచ్చని మాటాడుకోవడమే కాదు.. లక్కీ అపాయింట్‌మెంట్ కోసం వేచి చూడడం సిటీలో జరుగుతున్న సరికొత్త వార్త.

ఒకరోజు.. బిల్డర్‌గా, రియల్ ఎస్టేట్ ఓనర్‌గా ఎదగాలనే తలంపుతో ఓ ఇండస్ట్రీని నడుపుతున్న నరేంద్రగౌడ్, లక్కీతో కలవాలని, ఒక గంటసేపు నేను చెప్పేది వింటే చాలు, ఏ సహాయం అక్కర్లేదు.. పాతిక లక్షలిస్తానని.. డీల్ కుదిరితే లక్కీ ఎంత అడిగితే అంత ఇస్తానని కబురు పంపాడు.

మనిషి ఇండస్ట్రియలిస్ట్, మరో కొత్త వెంచర్‌కోసమని చెబుతున్నాడు. అతని ప్రపోజల్ కూడా నచ్చింది. తనంటే ఎంత నమ్మకం లేకపోతే ఒక గంట తను చెప్పేది వింటే చాలు.. పాతిక ఇస్తానంటాడు? పాతిక కాదు అతని వ్యాపారంలో భాగం ఇవ్వడానికీ లేక పెద్ద ఎత్తున డబ్బు ఇచ్చి తనకు ఏ ఆటంకం రాకుండా చూడడానికీ తనను ఆశ్రయిస్తున్నాడనిపించింది.

సక్సెస్ అన్నది తను చేస్తుందని అతనికి తెలుసు. అతను చెప్పింది తను చేస్తానని తనకూ తెలుసు. మాట తీరులోనే మనిషి తీరు పసిగట్టే వ్యక్తులిలాగే వుంటారు.

అపాయింట్‌మెంట్‌కు ఓకే చెప్పింది.

ఆదివారం ఉదయం పదిగంటలకి సరాసరి లక్కీ ఇంటికే వచ్చాడు నరేంద్రగౌడ్.

లక్కీ తన గదిలోంచి వచ్చింది.

నమస్కారాలు ప్రతినమస్కారాలతో ముఖాముఖి పరిచయం జరిగింది.

"రండి.. టిఫిన్ చేస్తూ.. మాటాడుకుందాం" లక్కీ నవ్వు ముఖంతో.

"ఓకే.." అంటూ కదిలాడు.

డైనింగ్ టేబుల్‌మీద ప్లేట్లు అప్పటికే అమర్చారు.

ఇడ్లీ, వడ సర్వ్ చేసింది లక్కీ.

తను ఒక వడ మాత్రమే తీసుకుని సాంబార్ బౌల్‌లోంచి సాంబార్‌ని పెద్ద కప్పులో వంచుకుని వడని అందులో వేసి స్పూన్‌తో చిన్నచిన్న ముక్కలుగా చేస్తూ నరేంద్ర గౌడ్‌ని చూసి "చెప్పండి" అంది.

"ఓకే.. నేను ఓ పారిశ్రామిక వేత్తని.. నా వ్యాపారం.. ఇంత.. నే చేయబోయే వ్యాపారం.. ఇన్ని కోట్లు అనే మాటల్ని పక్కన బెట్టి డైరెక్ట్ విషయానికొస్తాను.. టైం ఈజ్ మనీ అన్నారు కదా", ఒక గంటకి పాతిక లక్షలనే విషయాన్ని నర్మగర్భంగా నవ్వులో కలుపుతూ చెప్పాడు.

లక్కీ నవ్వుతూనే "మర్మమేమిటో.. చెప్పలేదు" అంది.

"సరే మేడమ్.. రియల్ ఎస్టేట్ కం బిల్డర్‌గా బిజినెస్ మొదలు పెట్టాలనుంది. ఎందుకో ఈ వ్యాపారంపై చాలా చాలా ఇష్టం. కాని, ఎంతో కష్టమైన పని అని తెలుసుకున్నాను. అయినా నా కోరికను కచ్చితంగా తీర్చుకోవాలని సిటీలోని బిల్డర్స్, రియల్ ఎస్టేట్ ఓనర్స్‌లోనే నేను నెంబర్‌వన్‌గా గుర్తింపు రావాలని, ప్రజలలో చెప్పిన సమయానికి అత్యంత సుందరంగా సౌఖ్యంగా నేను బిల్డింగ్స్, అపార్ట్‌మెంట్స్, విల్లాస్ అందివ్వడంతో నాపేరు మోగిపోవాలని.. ఎక్కడ చూసి నా.. నరేంద్ర ఎన్‌క్లేవ్స్, నరేంద్ర అపార్ట్‌మెంట్స్, నరేంద్ర విల్లాస్.. నరేంద్ర.." చెప్పుకుపోతున్నాడు నరేంద్రగౌడ్.

లక్కీ చేత్తో ఆపమన్నట్టు సైగ చేసింది.

"సరే.. నేను.. చేయాల్సింది చెప్పండి" అంది లక్కీ

"ఓకే.. ఒక అపార్ట్‌మెంట్‌ని నగరం నడిబొడ్డులో అన్ని సౌకర్యాలతో కట్టాలనుకుంటున్నాను" అన్నాడు.

"రాంగ్ డెసిషన్ నరేంద్రగారు..! నగరం నడిబొడ్డులో ఆలోచించాల్సింది అ

పార్ట్‌మెంట్ కాదు.. షాపింగ్ కాంప్లెక్స్" సూటిగా జవాబిచ్చింది లక్కీ.

ఒకే ధ్యాసతో వున్న వ్యక్తికి, తనకు తన ఆలోచనకంటే లక్కీ చెప్పే విషయమే గొప్పగా తోచడం, వెంటనే అవునని గౌడ్ తలూపడం జరిగిపోయింది.

"సరే.. స్థలం తీశారా..? " లక్కీ.

"రేపు రిజిస్ట్రేషన్" గౌడ్.

"స్థలం ఎక్కడ? " లక్కీ.

చెప్పాడు నరేంద్ర.

"గుడ్..! నేను చేయాల్సింది చెప్పండి" అంది లక్కీ.

"మేడమ్.. నేను కార్పొరేషన్ వాళ్ళకు, గూండాల బెదిరింపులకు, పోలీసుల ప్రమేయాలకు, ఎలక్ట్రిసిటీ వాటర్ వీళ్ళందరి చుట్టూ తిరగలేను. ఇవన్నీ మీరు చూసుకోవాలి.. అందుకు మీరు కాంప్లెక్స్‌లో భాగం కావాలంటే భాగం, లేదూ ఇంత మొత్తం అని మీరు ఫిక్స్ చేయండి. నేను ఫిక్స్ అయిపోతా" స్పష్టంగా బంతి మీ కాలి దగ్గరుంచాను. పాస్ చేస్తారో గోల్ చేస్తారో మీ ఇష్టం అన్నట్టు చెప్పాడు నరేంద్ర.

లక్కీకి ఎక్కువసేపు ఆలోచించడానికి అవసరం లేకపోయింది. ఆ విషయం అతనికి తెలిసే వచ్చాడనీ అర్థమయింది.

ఎందుకంటే.. అన్ని రంగాల్లోనూ లక్కీ మనుషులున్నారు.

"సరే.. కాంప్లెక్స్‌లో భాగం అక్కర్లేదు. అమౌంట్ మీరు ఫిక్స్ చేయండి ఫర్లేదు.. ఎంత.. ఇంత అని చెప్పాల్సిన అవసరం లేదని మిమ్మల్ని, మీ మాటల్ని బట్టి తెలుస్తోంది. సో.. భూమిపూజ ఎప్పుడు చేయాలనుకుంటున్నారు? " లక్కీ.

"మీరు క్లియర్ చేసిన రోజు" నరేంద్ర.

"భూమి పూజతోనే అన్నీ క్లియరవుతాయి.. డేట్ మీరు చెప్పండి" అంది లక్కీ నవ్వుతూ.

అర్థంకానట్టు చూసి "ఈరోజు రెండో తారీఖు.. అన్నీ కుదిరితే తొమ్మిదో తేదీ భూమిపూజ అనుకుంటున్నాను" నరేంద్ర.

"అనుకుంటున్నాను.. చూస్తున్నాను.. వ్యాపారంలో పనికిరావు కాని.. మాట లొద్దు.. ఫిక్స్ చేయండి" అంది లక్కీ.

"ఓకే.. తొమ్మిదో తారీఖు ఉదయం తొమ్మిది గంటలకు" అన్నాడు.

"సరే, రేపు అమౌంట్ పంపండి" లక్కీ.

"ఓకే. డబ్బు పంపిస్తాను. అయితే నా తృప్తికోసం ఓ మాటివ్వాలి" నరేంద్రగౌడ్.

"అదేదో చెప్పండి.. వేరే అనను.. అలాగే అంటాను" అంది లక్కీ.

నరేంద్ర గౌడ్ ఏమనుకుంటున్నాడో లక్కీకి అర్థమయింది. ఎంత ప్రాక్టికల్ మనిషైనా సెంటిమెంట్‌కి లోనవుతూనే వుంటాడు.. బలంగా.. తనకు ఆ కాంప్లెక్స్‌లో కొన్ని షాపులు ఇవ్వాలనుకుంటున్నాడు. అవి రెండా.. నాలుగా.. అని కాదు. తన పాదం మోపితే చాలని అది అదృష్టానికి చిహ్నమని.

"థాంక్స్..! రేపు మొత్తం పది.. పంపిస్తున్నాను. నాలుగు షాపులు మీ పేరు మీద రాస్తున్నాను" అన్నాడు.

పదికోట్లు.. నాలుగు షాపులు.. అర్థమయింది లక్కీకి.

"ఓకే.. డన్" అంది లక్కీ.

నరేంద్రగౌడ్ టీ తాగి వెళ్ళిపోయాడు. గంటకాదు అరగంటలో డీల్ పూర్తయింది.

నరేంద్రగౌడ్‌తో మాటాడుతుండగానే ఆలోచించసాగింది. అన్ని డిపార్ట్‌మెంట్స్ వాళ్ళని కన్విన్స్ చేయాలంటే.. వాళ్ళతో మాటాడి రేట్లు ఫిక్స్ చేయాలంటే సమయం ఎక్కువ పడుతుంది. డబ్బు వృథా అవుతుందని అందుకు బదులుగా ఒకే దెబ్బతో అన్నీ పరిష్కారం అయిపోవాలనే నిర్ణయానికొచ్చింది.

వెంటనే.. మొబైల్ తీసి నెంబరు నొక్కింది.. వీలయినన్ని ఇంపార్టెంట్‌వి, సొసైటీలో పేరు ప్రఖ్యాతులున్న వారి నెంబర్లని మెదడులోనే ఫీడ్ చేసుకొని

వుంచుకుంది.

"హలో ఏంటి.. ఇంత ఉదయమే..? మాకేదో అదృష్టం కలుగబోతున్నది!" నవ్వుతూ అవతలి వ్యక్తి.

"మినిష్టర్ మీరు కదా! మీ అదృష్టం ముందు మాదేముందిలెండి? విషయంలోకి వస్తాను.. ముఖ్యమంత్రికి, మీకు అన్ని విషయాల్లోనూ పొందికే కదా? " లక్కీ.

"విషయం చెప్పు.. లక్కీ" మంత్రి.

"ఒక రాయి వేయాలి" లక్కీ.

"ఎవరిమీద.." నవ్వు.

"భూమి పూజరోజు.. ఓ కాంప్లెక్స్‌కి"

"ఎప్పుడు? " మంత్రి.

"తొమ్మిదో తేదీ తొమ్మిదింటికి" లక్కీ.

"రెండు నిముషాలు లైన్‌లోనే వుండు"

"అలాగే" లక్కీ..

రెండు నిముషాలు గడిచింది.

"ఒకే లక్కీ.. డన్" మంత్రి.

"ఎంత పంపించాలి? " లక్కీ

"ఓ పార్టీ ఫండా..? 'ఫిఫ్టీ.. ఫిఫ్టీ.. నీవో సగం, నేనో సగం' అన్నపాట విన్నావు కదా? " మంత్రి.

"రేపు పదిగంటలకి అందుతుంది సరేనా? " లక్కీ.

"క్వీన్ బ్యాంక్‌లో వున్నా ఫర్లేదు" నవ్వాడు.

లక్కీ నవ్వింది.

లక్కీ ఇంత తక్కువ వ్యవధిలో ఎంతో ఆలోచించింది.

అన్ని డిపార్ట్‌మెంట్స్‌ని కన్విన్స్ చేయడానికంటే ముఖ్యమంత్రితో పునాది రాయి వేయించడమే మేలు అనుకుంది.. కారణం.. ఏ డిపార్ట్‌మెంటూ ఆ దరిదాపులకు రాదు.. ఎందుకంటే ముఖ్యమంత్రి పునాదిరాయి వేశాడు అంటే గవర్నమెంట్ మొత్తం అందుకు ఏమి కావాలో అది క్షణాల్లో చేసిపెడుతుంది. అడ్డు చెప్పేవాడు గానీ అడ్డు వచ్చేవారు గానీ ఎవరూ వుండరు. డిపార్ట్‌మెంట్స్ లాగుడు, పీకుడుతో టైం వేస్ట్.. ఈ దెబ్బతో లక్కీపేరు లోలోన కాదు పైపైన మారు మోగిపోతుంది.

వన్ బ్లాస్ట్.. సెవరల్ లాస్ట్.

నరేంద్రగౌడ్ మొబైల్‌కి ఫోన్ చేసింది.

"మీ భూమి పూజ జరిగిపోయింది.."

"థాంక్యూ..! ఇంత తొందరలో సక్సెస్ చేస్తారని కలలో.." గౌడ్.

"మరో విషయం.. భూమిపూజలో పాల్గొంటున్న వ్యక్తి ఎవరో తెలుసా? కాంప్లెక్స్.. పునాది రాయి వేస్తున్నదెవరో చెప్పనా? " లక్కీ.

"యస్.. చెప్పండి మేడం..! చాలా ఎక్సైటింగ్‌గా ఉంది" గౌడ్.

"వింటే ఇంకా ఎగ్జైటింగ్‌గా వుంటుంది పునాది రాయి వేస్తున్నది ముఖ్యమంత్రి!"

నరేంద్రగౌడ్ షాక్ తిన్నాడు.. కాసేపు మాట్లాడలేకపోయాడు.

"హలో.. హలో" లక్కీ.

"యస్.. మేడం.. యస్.. అన్‌బిలీవబుల్.. ఐ..కాంట్.." ఆశ్చర్యంతో ఆనందంతో విభ్రాంతిలో గౌడ్.

"సరే.. మీ పనులు మీరు చేసుకోండి.. నేను చెప్పే మినిష్టర్.. పి.ఎ. మిమ్మల్ని కాంటాక్ట్ అవుతాడు" లక్కీ.

"ఒకే.. మేడం.. మీరు ఏమీ అనుకోకండి.. నా సంతోషం కొద్ది చెబుతున్నాను.. పది కాదు పదిహేను పంపిస్తున్నాను. నాలుగు కాదు.. తొమ్మిది షాపులు తీసుకుంటున్నారు. కాదనకండి.. మొదటి వెంచర్.. ఇంత గ్రాండ్ సక్సెస్ అవుతుందని కలలో కూడా అనుకోలేదు. నరేంద్రగౌడ్ నెంబర్‌వన్ ఇప్పుడే అయిపోయాడు. థాంక్స్ ఎలాట్!" గౌడ్.

ఎగ్జైటింగ్‌గా వున్నాడని అర్థమయింది.

"ఒకే" లక్కీ.

"మరొక్కమాట.. ఈ వెంచర్ నా జీవితానికి అడ్వెంచర్.. మనస్ఫూర్తిగా చెబుతున్నాను, మొత్తం కాంప్లెక్స్ మీ పేరు మీదే రాసేయాలని వుంది. ఈ ఒక్క సంఘట

నతో సిటీలో, రాష్ట్రంలోని పలు పట్టణాల్లో నేను వ్యాపారం చేసుకుంటాను..." ఆనందంతో పుక్కిరిబిక్కిరవుతూ..

"మీరు అడిగారు.. నేను సహకరించాను, అంతే.. ఎవరం ఏమీ ఆశించకుండా చేయడం లేదు.. అంత ఎక్సైట్ అవకండి.. వ్యాపార వ్యవహారాల్లో నిశ్చలత్వం, సహజత్వం ముఖ్యం.. సక్సెస్‌కి అత్యుత్సాహం, ఫెయిల్యూర్‌కి నిరుత్సాహం పనికిరాదు.. అన్నింటినీ స్వీకరిస్తూ సాగిపోవాలి.." లక్కీ.

జ్ఞాన బోధ ఏ రంగానికైనా ఒకటే!

"థాంక్యూ మేడమ్..! థాంక్యూ.." అని మొబైల్ ఆఫ్ కావడం గమనించి కారులోని మొబైల్ స్టాండ్‌లో పెట్టబోయి వెంటనే ఫోన్‌చేసి తన పి.ఎ.కి అన్నీ అరేంజ్ చేసేలా చెప్పాడు.

నరేంద్రగౌడ్ ఆనందానికి అవధులు లేవు. నిన్నటివరకు ఎవరో ఏమిటో లోకానికి తెలియని వ్యక్తి కొత్తగా ప్రారంభించబోయే వ్యాపారానికి ఏకాఏకిన ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి, కేంద్రంలో తనంటే ఏమిటో? ఎలక్షన్స్‌లో నిరూపించిన వ్యక్తి పునాది రాయి వేయడమంటే ఇక తనను వ్యాపార రీత్యా కాంటాక్ట్ కావడానికి ఎందరో..? ఎన్ని ఆఫర్లో..? పెట్టుబడి పెట్టడానికి ఎంతమంది నుంచి ఫోన్లో..? దీనికంతటికీ ముఖ్య కారణం 'లక్కీ'.

నిముషంలో అరవైసార్లు తక్కువ కాకుండా లక్కీ.. లక్కీ.. లక్కీ.. లక్కీ.. పేరును జపిస్తూనే వున్నాడు.

ఆ రాత్రి లక్కీ, లత 'మోహనవంశీ' చదువుతూ గడిపింది.

★ ★ ★

లక్కీ నగరంలో తన సామ్రాజ్యాన్ని విస్తరిస్తూపోవడం కొందరికి మింగుడుపడడం లేదు. ఒక స్త్రీ- అందులోనూ, భర్త లేక.. పదిమందితో పలు రకాలుగా ప్రవర్తించే స్త్రీ.. ఏకంగా పబ్‌ను నెలకొల్పడం, సలహాలను ఇచ్చేంతవరకు ఎదగడం.. పెద్దమనుషులనబడే వారందరూ లక్కీ మాటకు కట్టుబడి వుండటం అసూయను రాజేస్తోంది.

ముఖ్యంగా అర్జున్‌కి.

ఆంధ్ర దేశంలో తనకంటూ ఓ ఇమేజ్ వుంది. ఫాలోయర్స్ వున్నారు.

తనతో మాటాడటం కోసం, ఫొటో తీయించుకోవడం కోసం, తన్ను చూడటం కోసం ప్రతిరోజు తన ఇంటి ముందు వేలాది మంది ఎదురుచూస్తూ వుంటారు. అటువంటి తనను పూచికపుల్లలా తీసివేయడం.. ఎవరికీ తెలియకపోయినా తనను అవమాన జ్వాల వెంటాడుతూనే వుంది. ప్రతీకారం వెంటనే చేయకపోతే అటు శాంతిని, ఇటు మాటని, తన కోరికని చంపుకున్న వాడవుతాడు.

జీవితంలో మొదటి నుంచి వడ్డించిన విస్తరి ముందు కూర్చుని భోంచేయడం అలవాటు. అభిమాన సంఘాలని ఆసరా చేసుకుని అంచలంచలుగా ఎదిగాడు.. ఆర్టిస్ట్ వాల్యూస్ కంటె బిజినెస్ థింకింగ్ ఎక్కువ. చదివిన చదువుకు చేసే పనికి ఎక్కడా పొంతన లేదు. పెళ్ళి కూడా వ్యాపారంతో ముడిపడి చేసుకున్నదే.

ఇంత ఘనచరిత్ర కలిగిన తనకు ఒక స్త్రీ అదీ.. పదిమందితో వున్న ఆడది ఎదురు చెప్పడమా? పబ్ వున్నా లేకున్నా నష్టంలేదు గానీ అదో కోరిక.. అంత చిన్న కోరిక ఫెయిల్యూర్ కావడం.. తన తలను ఎవరో వంచేలా, దించేలా చేయడంతో మానసిక ఘర్షణ మొదలయ్యింది. ఎన్నో చిత్రాలు ఫెయిల్యూర్ అయినా తనకు చీమ కుట్టినంత బాధ లేదు. కారణం.. తన డబ్బు తనకు ముందే రావడం.. నష్టపోవడమంటూ జరగకపోవడం.. ఖాతాలో చిత్రాల సంఖ్య పెరిగిపోవడం వరకే చూసుకోవడం జరిగింది. కానీ.. ఇప్పుడు ఈ చిన్న విషయం ముందు చేతులు

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# 'డిసెంబరు' పూల వికాసం!




'చతుర' డిసెంబరు సంచిక ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. సౌందర్యోపాసకులను అలరించింది. రెండు నవలికల మేళవింపు 'చతుర'కు అద్భుత పోహళింపు! సమాజంలో దోపిడీదార్లు, దోపిడీకి గురయ్యేవారు అనే రెండు వర్గాల సంఘర్షణే 'టైగర్‌జోన్', 'తరాలు.. అంతరాలు' నవలికల ఇతివృత్తాలు.

వన్యప్రాణుల సంరక్షణతో అడవినే ఆవాసంగా అల్లుకుని తరతరాలుగా జీవనయానం చేస్తున్న ఆదివాసీ గోండులను అడవికి దూరం చేసి పారిశ్రామికవేత్తలకు వనసంపదను కట్టబెట్టే సర్కారు కుట్రను 'టైగర్‌జోన్' ఆవిష్కరించింది. అమూల్యమైన సహజ వనరులు అడవి బిడ్డలకు అందకుండా పోవడాన్ని రచయిత బలంగా చెప్పారు. ఇదంతా ప్రపంచీకరణలో భాగంగా అభివర్ణించారు. ఆదిలాబాద్ జిల్లా జన్నారం, కరీంనగర్ జిల్లా జగిత్యాల ప్రాంతాలలో భూస్వాములకు, నక్సలైట్లకు జరిగిన వర్గసంఘర్షణను కళ్లకు కట్టించారు. భూస్వామ్య అవశేషాలైన జగన్, విద్యాసాగర్ పాత్రలను - దేవి, భీంరావు పాత్రలను అద్భుతంగా మలచడంలో రచయిత సవ్యసాచి అనిపించుకున్నారు. నవలిక సహజత్వం, స్థానికతలతో జీవించింది. దోపిడీ ఉన్నచోట ప్రతిఘటన తప్పదని కొమురం భీం పోరాటాన్ని, ఇంద్రవెల్లి ఉదంతాలను నెమరువేస్తారు. జల్, జంగల్, జమీన్‌ల కోసం నిరంతర సంఘర్షణే అని నిర్దేశిస్తారు.

'తరాలు.. అంతరాలు' నవలికలో మధ్యతరగతి కుటుంబాలలోని సంఘర్షణను రచయిత్రి సువర్ణ అత్యంత ప్రతిభావంతంగా చిత్రించారు. ఉద్యోగాలు చేసే దంపతులకు పెద్దవారి సేవలు కావాలి గానీ పెత్తనాలు కాదు. తమ సంతానం చేసే కుటిల స్వార్థపూరిత కుట్రలను కళ్యాణి పరశురామయ్యలు ఎలా తిప్పికొట్టారో సినిమాటిక్‌గా చిత్రించారు. కళ్యాణి పాత్ర ద్వారా మధ్యతరగతి కుటుంబాలకు మంచి సందేశాన్ని అందించారు. మొత్తంగా ఈ నవలిక పాఠకులను బాగా ఆకట్టుకుంది.

'కొత్తగాలి' కొంగొత్తగా ఉంది. 'చతురంగం' పాఠకులతో చదరంగం ఆడిస్తోంది. క్రిస్టమస్ కేకు తయారీ పసందుగా, సందర్భోచితంగా ఉంది. 'క్రానికల్ ఆఫ్ ఎ డెత్ ఫోర్ టోల్డ్' యాభై ఏళ్ల భూతకాలానికి తీసుకెళ్లింది. నందుల సుశీలాదేవి 'సరళీస్వరాలు'లో అరవై దశకంలో ఆడపిల్లల అభీష్టాలను చక్కగా సరళంగా వ్యక్తీకరించారు. 'చతుర ప్ర.జ.' ప్రజాభీష్టాన్ని నెరవేరుస్తోంది. డిసెంబరు 'చతుర' చతురంగా, డిసెంబరు పూలలా వికసించింది. సంపాదకవర్గానికి అభినందనలు.

**- ప్రాణహిత**, ఖానాపూర్, నిర్మల్ జిల్లా

ముడుచుకుని కూచోవడం అవమానంగా తోచింది. ఏదో ఒకటి చేసి తన్ను కాదన్న దాని సామ్రాజ్యాన్ని ఛిద్రం చేయడం లేదా 'లక్కీ'ని ఒక్కసారిగా అవమాన పరచడం. ప్రస్తుతానికయితే లక్కీ సామ్రాజ్యాన్ని కూల్చాలంటే ఎక్కువ డబ్బు.. ఎన్నో వెంచర్లు అధిగమించాలి.. లక్కీని అవమానించడం తక్కువడబ్బుతో కూడుకున్న పని.. అవమానం పబ్లిక్‌లో జరిగితే సామ్రాజ్యం బీటలుపడటం ఖాయం. ఆ విధంగా ప్రతీకారం తీర్చుకోవడం సులభం.

అర్జున్ వెంటనే కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు. టేబుల్ పైవున్న మొబైల్స్ నాలుగింటిలో బ్లాక్ కలర్‌లో వున్నదాన్ని తీసి నెంబర్ నొక్కాడు.. అవతల రింగయింది.

"హలో" అవతలి నుంచి.

"హలో.. నాగరాజు.. ఓ ముఖ్యమైన పని చేయాలి.. వెంటనే స్టుడియోకి వచ్చేయ్.." ఫోన్ కట్ చేశాడు.




**తొ**మ్మిదో తారీఖు ఉదయం సిటీ మధ్యలో వున్న స్థలంలో షామియానాలు పూలసరాలతో అలంకరించబడివున్నాయ్. పూజ చేసే స్థలం, రంగురంగుల చేమంతి పూలతో సొగసులీనుతోంది. మహరాజా ఛైర్స్‌తో ప్రాంగణమంతా నింపారు. మేళతాళాలు మంగళవాయిద్యాలతో అందరూ ముఖ్యమంత్రి కోసం ఎదురుచూస్తున్నారు.

సమయం 8 గంటల నలభై అయిదు నిమిషాలు. పైలెట్ హారన్‌లతో సి.యం. కాన్వాయ్ వచ్చేసింది. ముఖ్యమంత్రి కారు దిగగానే నరేంద్ర పూలమాలతో ఆహ్వానించాడు. వాయిద్యాలు సుస్వాగత రాగాల్ని అందుకున్నాయ్. ముఖ్యమంత్రి, తోటి మంత్రి చిరునవ్వులు చిందిస్తూనే వున్నారు. ఫొటోలు క్లిక్‌మంటున్నాయ్.

నరేంద్రగౌడ్ పది వీడియో కెమెరాలను, పదిహేను స్టిల్ కెమెరా ఫొటోగ్రాఫర్లను అరేంజ్ చేసుకున్నాడు. ఒక్క రెప్పపాటు కూడా తప్పకుండా ఫొటోలుండాలని ముందే చెప్పాడు.

ముఖ్యమంత్రి నరేంద్రగౌడ్‌కి షేక్ హాండ్ ఇచ్చి, భుజంమీద చెయ్యి వేశాడు. నరేంద్రగౌడ్ ఆనందానికి అంతులేదు. పక్కనున్న మంత్రి నరేంద్రగౌడ్ గురించి చెబుతున్నాడు. ముఖ్యమంత్రి నవ్వుతూనే అలాగా.. ఆహా.. గుడ్.. అంటున్నాడు.

ముహూర్తానికి సమయమాసన్నమైందని పండితులు మైక్‌లో చెప్పారు.

పట్టు వస్త్రాలతో నరేంద్రగౌడ్ దంపతులు, ముఖ్యమంత్రి, మంత్రి పూర్ణకుంభాలతో వేదిక దగ్గరికి చేరుకున్నారు. హోమం.. ఓ పక్క భూమిపూజ చేసే స్థలాన్ని రంగవల్లితో అలంకరించారు..

దంపతులు టెంకాయలు కొట్టారు.

ముఖ్యమంత్రి గునపంతో మూడుసార్లు భూమిని తవ్వాడు, పక్కనున్న మంత్రి పారతో మట్టి తీశాడు.

మంగళవాయిద్యాలు మిన్నంటాయి.

వేదమంత్రాలు ఘోషించాయి.

చిరునవ్వులతో వచ్చినదారినే ముఖ్యమంత్రి తదితరులంతా తీర్థ ప్రసాదాలు స్వీకరించి వెళ్ళిపోయారు.

ఎవరి వాటాలు వాళ్ళకు ఎప్పుడో చేరిపోయాయి.

కానీ ఒక్కరే ఈ కార్యక్రమంలో పాల్గొనలేదు. ఆ ఒక్కరు 'లక్కీ'.

ముఖ్యమంత్రి భూమి పూజ చేసి

వెళ్ళేంతవరకు బిగబట్టి వున్న అసహనాన్ని అందరూ వెళ్ళగానే మొబైల్ తీసి 'లక్కీ'కి ఫోన్ చేశాడు గౌడ్.

"ఏంటి మేడం.. మీరు రాకపోవడం? " గోముగా..

"విత్తనం, వేళ్ళు భూమిపైకి రాకూడదు. అప్పుడే ఫలం, ఫలితం దక్కుతుంది"

"అయినా.." చెప్పబోయాడు.

"అంతా శుభమే జరిగింది కద! ఎవరు ఎక్కడున్నా పనులు జరగడమే మనకు కావల్సింది. ఇక మీరు కన్‌స్ట్రక్షన్ మీదే వుండండి. అంతవరకు బై" మొబైల్ కట్ చేసింది లక్కీ.

నిజమే కదా! సెంటిమెంట్లతో పనేముంది? తదుపరి వెంచర్ వరకు లక్కీని కలవడం ఇరువురికీ టైం వేస్టు అని తెలపకనే తెలిపింది అనుకున్నాడు, పనిలో నిమగ్నమయ్యాడు నరేంద్రగౌడ్.

★ ★ ★

'మీ కోసం పలుకుతోంది ఎస్ న్యూస్ ఛానల్ స్వాగతం సుస్వాగతం. ఈరోజు తొమ్మిదింటికి సెన్సేషనల్ న్యూస్ ప్రసారం చేయబడుతుంది. మీరు ఊహించని సంచలన వార్తను కేవలం మా ఛానల్ మాత్రమే ఎక్స్‌క్లూజివ్‌గా అందిస్తోంది. కచ్చితంగా తొమ్మిదింటికి.. మీ.. మా.. ఎస్ ఛానల్లోనే చూడండి..'

అంటూ ఎస్ ఛానల్' ఉదయం ఆరు గంటల నుండి ఊదర గొడుతోంది.

జీవితమంతా వార్తలు వినడానికే మనిషి పుట్టినట్టు, ఉదయం నలుగురు వ్యక్తులు టి.వి.లో మాటాడుతుంటే మన మిక్కడ ఇళ్ళలో కూచుని చూస్తూ ఆ కాలాన్ని వారి అధిక ప్రసంగాలతో ఖర్చు చేయడానికే మనం జీవిస్తున్నట్టు తయారయిన, తయారుచేసిన వార్తా ఛానళ్ల వ్యవహారం ఉబుసుపోని ఆకృతి దాల్చింది.

తెలుగు వార్తాఛానళ్లలో వార్తలు చదివే వాళ్లందరూ ఆంగ్లపదాల్ని ఉచ్చరిస్తుండటం వినిపిస్తుంది, కనిపిస్తుంది.

తెలుగు వార్తా ఛానళ్లలో తెలుగుదనం మచ్చుకైనా కనిపించని, ఎటో ఎగిరిపోయిన పిచ్చుకయింది.

ప్రజలకి ఎప్పటికప్పుడు వార్తలు చేరవేయడానికో, దేశంలోని కుళ్లుని కడిగేయడానికో, అవినీతి, అన్యాయం, అధర్మం, అలసత్వం అన్ని సామాజిక రోగాలను ప్రక్షాళనం చేయడానికో ఇన్ని వార్తాఛానళ్లు పుట్టుకొస్తున్నాయంటే మనం నిప్పులో కాలేసినవాళ్లమే అవుతాం. రాజకీయ ఎదుగుదల కోసం, రాజకీయ ప్రచారంకోసం, బ్లాక్ మెయిల్‌తో ధనార్జన కోసం, సమాజంలో గుర్తింపు కోసం, కొందరు ఛానళ్లని నడుపుతున్నారని తెలుస్తోంది.

తొమ్మిది గంటలు కావస్తోంది.

సెన్సేషనల్ న్యూస్ కోసం అందరూ టి.వి.ల ముందు కూర్చున్నారు. అడ్వర్‌టైజ్‌మెంట్స్‌తో ఊపిరాడనివ్వడం లేదు.

తొమ్మిది అయిదు నిముషాలయింది.

లక్షల అడ్వర్‌టైజ్‌మెంట్స్ వచ్చి పడుతున్నాయి. ఉదయం ఆరుగంటల నుండి ఛానల్ అడ్వర్‌టైజ్‌మెంట్ వాళ్లు కంపెనీలకు చేస్తున్న ఫోన్లతో, కంపెనీలు ఛానల్ అడ్వర్‌టైజ్‌మెంట్ వాళ్లకు చేస్తున్న ఫోన్లతో ఛానల్ డెస్క్ వైబ్రేషన్స్‌తో ఊగిపోతోంది.

బుల్లి తెరపై సెన్సేషనల్ న్యూస్ ఒక్కో అక్షరమే పడసాగింది..

ల..

న..

క్ష్మి..

ధ..

క్కీ..

ల..

అంటూ తికమకగా అక్షరాల్ని తిప్పుతున్నారు. కడకు ఆ అక్షరాల్ని ధ..న..ల..క్ష్మిగా చేశారు.

చివరకు పది అడ్వర్‌టైజ్‌మెంట్స్.. ఇరవై స్క్రోలింగ్స్ మధ్య.. ధనలక్ష్మి..

అలియాస్ 'లక్కీ'.. 'పబ్‌లో ఫుల్ కిక్' అంటూ పడింది.

వార్తా చదువరి నిలబడి చెబుతున్నాడు.

"ధన్.. లక్ష్మి.. ఎంతోమందికి ఈ పేరు ఆంధ్రదేశంలో వుండవచ్చు గానీ 'లక్కీ'గా పిలువబడే పెద్దగా చదువుకోని ఈ అమ్మాయి.. పల్లెటూరి నుంచి నగరానికి వచ్చిన ఈమె.. నేడు తన అందంతో మాయాజాలంతో, నగరంలో సెన్సేషనల్ న్యూస్ క్రియేట్ చేస్తోంది. ఒక మధ్యతరగతికి చెందిన భర్త నుంచి తను విడిపోయి.. ఎంతో మందితో వివాహేతర సంబంధాన్ని పెట్టుకుని లక్షలకు లక్షలు.. కోట్లకు కోట్లు.. ఫ్లాట్లకు ఫ్లాట్లు సంపాదించి.. ఈ మధ్యనే ఓ పబ్‌ను కూడా తెరిచి.. నగరంలోని మహిళల్ని నయాన, భయాన డబ్బు ఆశ చూపించి, పబ్బులోనే వ్యభిచారానికి ముహూర్తాలు పెట్టించి నగరంలోని వ్యాపారవేత్తల్ని, పెద్ద మనుషుల్ని బ్లాక్ మెయిల్ చేస్తూ కోట్లకు కోట్లు అక్రమార్జన ద్వారా సంపాదిస్తోంది. ఒక స్త్రీ ఇలా చేస్తోందంటే ఆశ్చర్యం వేస్తుంది. సభ్యసమాజం ఈమెను చూసి ఛీ కొడుతోంది.. అయితే ఈమె వెనుక ఎందరో బడా బడా నేతలు, పారిశ్రామికవేత్తలు, బిగ్ షాట్స్, అత్యున్నత స్థాయిల్లో వుండే అధికారులు వున్నారని తను ఆడింది ఆటగా పాడింది పాటగా డబ్బును సంపాదిస్తోంది.. అటువంటి కొన్ని దృశ్యాల్ని మీరు ఇప్పుడు చూడబోతున్నారు. అయితే ఓ చిన్న 'బ్రేక్' తరువాత.."

ఓ చిన్న 'బ్రేక్' (విరామం) అన్నారేగాని ప్రకటనల జో(బో)రుతో పది నిముషాలు గడిచింది.

రాబోయే.. చూపబోయే.. దృశ్యాలకోసం టీవీ ముందు జనం కళ్ళు తెరుచుకుని, కాళ్ళు బిగదీసుకుని కూర్చోవడం జరిగింది.

"పబ్‌లో జరిగే అసాంఘిక దృశ్యాల్ని మేం మీకు ఎక్స్‌క్లూజివ్‌గా అందిస్తున్నాం" అంటూ పబ్‌లో మసక వెలుతుర్ని, ఫ్లైయర్ సీసాల విన్యాసాల్ని, కుర్చీలో కూర్చుని డ్రింక్స్ తీసుకుంటున్న వాళ్లని.. డ్యాన్స్ ఫ్లోర్‌లో డ్యాన్స్ చేస్తున్న వాళ్లని రెండు నిముషాలు చూపించింది.

అంతే.. మళ్లీ బ్రేక్ చెప్పకనే అడ్వర్‌టైజ్‌మెంట్స్ ప్రవాహం కొనసాగింది.

ఛానల్ రేటింగ్‌ను బట్టి అడ్వర్‌టైజ్‌మెంట్స్‌గా కాక.. న్యూస్‌ని బట్టి సెన్సేషనల్ న్యూస్ మధ్యలో అడ్వర్‌టైజ్‌మెంట్స్ విపరీతంగా రావడంతో బ్రేక్ చెప్పడానికి సమయమివ్వక యాడ్స్‌డిస్‌ప్లే కాసాగాయి.

ఇప్పుడు వార్తా చదువరి అగుపించింది.

"ఇప్పుడే అందిన వార్త.. ధనలక్ష్మి అలియాస్ 'లక్కీ' మీద నగరంలోని జరూర్‌నగర్ పోలీస్ స్టేషన్‌లో కేసు నమోదయింది. 'లక్కీ' బ్లాక్‌మెయిల్ చేస్తోందని నాగరాజు అనే ఓ వ్యాపారి ఫిర్యాదు చేసినట్లు, విచారణ నిమిత్తం పోలీసులు హుటాహుటిన 'లక్కీ' ఇంటికి వెళ్లినట్లు తెలిసింది. ఈ విషయమై మా ప్రతినిధిన డిగి తెలుసుకుందాం..

"హలో.. గోపేష్"

"హలో.. రాధ"

"లక్కీపై ఫిర్యాదు ఏమిటి? ఎందుకు పోలీసులు హుటాహుటిన బయలుదేరారు? " రాధ.

"గుడ్ మార్నింగ్ రాధ! లక్కీపై ఇస్తున్న మన ఛానల్ సెన్సేషనల్ న్యూస్‌తో లక్కీ బాధితులందరూ ఒక్కొక్కరే బయటికి వస్తున్నట్టు సమాచారం అందింది. అందులో భాగంగా 'నాగరాజు' అనే వ్యక్తి జరూర్‌నగర్ పోలీస్ స్టేషన్‌లో తనను లక్కీ బ్లాక్‌మెయిల్ చేస్తోందని ఫిర్యాదు చేశాడు. మన ఛానల్ ఇస్తున్న సెన్సేషనల్ న్యూస్‌ని చూస్తూ వెంటనే పోలీసులు 'లక్కీ' ఇంటికి విచారణ నిమిత్తమై హుటాహుటిన వెళ్లారు రాధ.. కెమెరామెన్ పవన్‌తో ఓవర్ టు జరూర్ నగర్, గోపేష్"

న్యూస్ రీడర్ మాటాడుతూ..

"ఇది లేటెస్ట్ సమాచారం. ఇకపోతే.. లక్కీ చేసిన ఎన్నో అసాంఘిక కార్యక్రమాలలో ఎందరో ఐ.ఎ.ఎస్., ఐ.పి.యస్., రాజకీయ నాయకులు, వ్యాపారవేత్తలు బలయ్యారు. ఈ మధ్యనే ఓ బడావ్యాపారి కూడా తన ఆస్తిని అమ్మి ఆమె చెర నుండి బయటపడడం జరిగింది. ఆమె పబ్‌కు వచ్చిన వాళ్లలో డబ్బు, అధికారం వున్న వ్యక్తుల్ని గమనించి ఫాంహౌస్‌కు ఆహ్వానించేదని, అలా వెళ్ళినవారిని ఆమె తయారుచేసుకున్న స్త్రీలతో రాసలీలలకు ప్రేరేపించేదని, ఆ సమయంలో వారికి తెలియకుండా ఫొటోలు, వీడియోలు తీయించి.. మరుసటి రోజు నుంచి బ్లాక్‌మెయిల్ చేసేదని.. చదువులేని ఈమె.. రెండు మూడేళ్లలో కోట్లకు పడగలెత్తిందని, నగరంలో పలు అపార్ట్‌మెంట్లు ఈమెవేనని ప్రస్తుతం నగరం నడిబొడ్డులో వెలిసే షాపింగ్ కాంప్లెక్స్‌లో దాదాపు తొమ్మిది షాపులు ఈమెవేనని.. ఇవన్నీ బ్లాక్ మెయిల్ ద్వారా సంపాదించినవేనని.. ఈమె వలలో మంత్రులు.. చివరికి ముఖ్యమంత్రి కూడా బందీయేనని చెప్పడానికి ఈ కాంప్లెక్స్ పునాది రాయిని సాక్షాత్తు ముఖ్యమంత్రే వేయడంతో నిప్పులాంటి నిజం బయటికి వచ్చిందని విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది.." వార్తా చదువరి చదువుతోంది, మధ్యలో 'లక్కీ' కళ్లు, కాళ్లు.. ఫొటోలు చూపిస్తున్నారు.

'లక్కీ'కి ఫోన్ వచ్చింది.

పోలీసులు వచ్చే విషయం తెలిసింది.

ప్రశాంతంగా రోజూకంటే ఎక్కువసేపు స్నానించింది.

చీర కట్టుబొట్టుతో హాల్లోకి వచ్చి సోఫాలో కూచుంది.

ఇంటిముందు పోలీసు జీపు ఆగింది.

పోలీసుల్ని నవ్వుతూనే ఆహ్వానించింది. నవ్వుతూనే పోలీసులతో బయలుదేరింది. స్టేషన్‌వద్ద అన్ని ఛానల్స్, పత్రికా విలేఖరులు కెమెరాలతో ఎదురు చూస్తున్నారు.

లక్కీ స్టేషన్‌లోకి నడిచింది.

పోలీస్ స్టేషన్ ఎదురుగా వున్న లక్కీని చెట్టు ఎక్కి కొందరు కెమెరాలలో బంధించడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ క్లిప్పింగ్స్ 'లైవ్'గా ఆయా ఛానళ్ళలో చూపించడం మొదలుపెట్టారు.

లక్కీ పోలీసులతో మాటాడుతోంది.

వారి ప్రశ్నలకు జవాబిస్తోంది.

పోలీస్ స్టేషన్‌లోకి ఓ మారుతి కారు వచ్చి ఆగింది. అందులోంచి 'లక్కీ' లాయర్ దిగి స్టేషన్ ఇన్‌ఛార్జి యస్సైకి యాంటిసిపేటరీ బెయిల్‌పత్రాలు అందించాడు.

"యస్.. యుకెన్ గో. మీరెళ్ళొచ్చు" లక్కీతో అన్నాడు ఎస్సై.

స్టేషన్ బయట ఆగి వున్న తన కారులో లక్కీ ఎక్కబోతుండగా మీడియా మొత్తం కెమెరాలతో వచ్చి చుట్టు ముట్టింది.

"మీరు.." ప్రశ్నించబోయాడు ఓ ఛానల్ రిపోర్టర్.

"నేను.. మీకు.. ఇలా రోడ్డుపై నిలబెట్టి మాటాడించలేను, మాటాడలేను.. ఇంటికెళుతున్నాను. ఆరు గంటలకి మా ఇంట్లోనే ప్రెస్‌మీట్ పెడతాను. ప్రశాంతంగా కూచుందాం.. మీరడిగే ప్రశ్నలకు నేను సమాధానమిస్తాను" అని చెప్పి కారులో కూచుంది.

రిపోర్టర్లు చుట్టుముట్టగానే రెచ్చిపోయి మాటాడుతుందనుకొన్న వాళ్ళంతా ఆమె స్పష్టతను, నిశ్చలతత్వాన్ని చూసి అచ్చెరువొందారు. లక్కీ కారు వెళ్ళిన దారిలోనే వారి చూపులు పయనించాయి.

లక్కీ యాంటిసిపేటరీ బెయిల్‌ని పొందుతుందని అర్జున్ ముందే ఊహించాడు. కారణం లక్కీ నెట్‌వర్క్ చాలా పెద్దది. అందులో అఫిషియల్స్, నాన్ అఫిషియల్స్, పొలిటీషియన్స్, పోలీస్, డిఫెన్స్.. జుడిషియల్స్.. ఒక్కరేమిటి?

ఆమె ఒక వ్యవస్థను పాలిస్తున్న మనిషి. ఆమె నోరు విప్పితే అందరూ బయటికొస్తారు. అందువలన లక్కీకి లాభం ఏమో గాని వారికే నష్టం కలగకపోయినా.. అనవసరంగా సొసైటిలో రచ్చ ఏర్పడుతుంది.

అర్జున్ తనని అంతకంటే ఏమీ చేయలేడని లక్కీకి తెలుసు.

లక్కీని ఇంతకంటే ఏమీ చేయడానికి అవకాశంలేదని అర్జున్‌కి తెలుసు..

అవమానించింది.

ప్రతీకారం తీర్చుకున్నాడు.

తనకు కావాల్సింది అంతే.

★ ★ ★

సాయంత్రం ఆరుగంటల సమయం..

లక్కీ బిల్డింగ్ లాన్‌లో ఛైర్స్ అర్ధచంద్రాకారంలో వేయబడ్డాయి.

ఒక్కో ఛైర్ హ్యాండ్ స్టాండ్‌లకు రైటింగ్ పాడ్స్ అరేంజ్ చేయబడ్డాయి.

మీడియా మొత్తం సిద్ధంగా వుంది.

లక్కీ ఓ లేత పింక్ కలర్ చీరలో నడుచుకుంటూ లాన్‌లోకి వచ్చింది.

అర్ధచంద్రాకారంగా వున్న కుర్చీల మధ్య అందరికీ అవుపించేటట్టు రిపోర్టర్స్‌కి సౌకర్యంగా వుండేట్టు, కెమెరాలకు స్పష్టంగా అవుపించేట్టు కూచుంది.

పచ్చని పచ్చికలో ఓ రోజా పువ్వు విరిసినట్టుంది.

రిపోర్టర్స్ అందరూ తోటమాలులుగా కెమెరాలతో, పెన్నులతో అవుపిస్తున్నారు.

మీడియాపై ఓ నవ్వు విసిరింది.

లక్కీ అందాన్ని చూసి అలాగే కాసేపు మౌనంగా వుండిపోయారంతా. అందం ఎవరి కళ్ళతో చూసినా అందంగానే వుంటుంది కదా!

"ఓకె.. మొదలెడదామా..? " అని లక్కీ అనగానే అందరూ ఈలోకంలోకొచ్చారు.

కెమెరాలు స్టార్ట్ అయ్యాయి.

"ఏ డిగ్రీలు లేవట, మీరేం పెద్దగా చదువుకోలేదట కదా! ఇంత డబ్బు ఎలా సంపాదించారు? నగరంలో ఇంత పేరు ఎలా పొందగలిగారు? పబ్ మీకెలా సాధ్యమయింది..? ఆ ఆలోచన ఎలా వచ్చింది? " అడిగాడు ఓ ఎల్. కె. జి. ఛానల్ రిపోర్టర్.

"సంపాదించడానికి డిగ్రీలు పనికొస్తాయనుకోలేదు. విజ్ఞానం కోసం చదువుకుంటున్నామనుకుంటున్నాను. కేవలం సంపాదించడానికి మాత్రమే పనికి వచ్చేది చదువంటే.. అటువంటి చదువు చదవకపోయినందుకు ఆనందంగా వుంది. నగరంలో పేరు పొందాలనుకొని నేను ఏ పనీ చేయలేదు.. ఒక్కమాట.. పూర్వం బొటనవేలి గురుతు వేసే రాజకీయ నాయకులు, రాజులు ఏం చదువుకున్నారని? రాజ్యాల్నే ఏలారు. సంపదలతో తులతూగారు. చంఘిజ్ ఖాన్ లాంటివాళ్లు ఏం చదువుకున్నారు? ప్రపంచాన్ని జయిస్తూ.. వారెవరూ ఆర్థికశాస్త్రంలో నిష్ణాతులేమీ కారు. తాము తమ రంగంలో విజయాన్ని పొందుతూ వెళ్ళా రు. విజయంతో పాటే పేరు, ధనం సంపాదించగలిగారు.. ఇక 'పబ్' అంటా రా..? ఎక్కడ పోగొట్టుకున్న జీవితాన్ని అక్కడే వెదికి దక్కించుకుందామని" లక్కీ.

"మీరు భర్తను వదిలేశారట కదా? " ఓ యు. కె. జి. ఛానల్ రిపోర్టర్.

"మీరు నా గురించి సరిగా శోధించలేదని అర్ధమవుతోంది. నా భర్తే నన్ను ఓ రోజు రాత్రి 'పబ్'లో వేరొకరితో పంపించి వేరొకరికి నన్ను వదిలేశాడు" లక్కీ.

"మరుసటి రోజు మీరు వెళ్ళి భర్తతో జీవించొచ్చు కదా!" ఒకటో తరగతి ఛానల్ రిపోర్టర్.

"మరుసటి రోజు రాత్రి కూడా వేరొకరితో పంపించి నన్ను వదిలేస్తాడేమోనని వెళ్ళలేదు" లక్కీ.

నవ్వులు..

"మరి మీరెలా సంపాదించారు.. ఇంత

ఆస్తిని? " రెండోతరగతి ఛానల్ రిపోర్టర్.

"ప్రపంచంలో ఒక్కొక్కరు ఒక్కో విధంగా సంపాదిస్తుంటారు.. కొందరు రాళ్ళు కొట్టి, మరికొందరు నీళ్ళు అమ్మి.. నా కర్మ కొద్దీ నేను చర్మ సౌందర్యాన్ని పెట్టి వ్యాపారం చేశాను" లక్కీ.

"అదే ఎలా.. సంపాదించారూ? అని" ఎగిరే పిట్టకు వెంట్రుకలు లెక్కించే ఛానల్ రిపోర్టర్.

"మీ వయసెంత.. మిస్టర్? " లక్కీ.

"థర్టీ ప్లస్.." రిపోర్టర్.

"ఇంత వయసొచ్చినా.. మీరు మెచ్యూర్ కాలేదన్నమాట.." నవ్వీ నవ్వని పెదాలతో మాటను విసిరింది.

రిపోర్టర్లు అంతా ఘొల్లున నవ్వారు.

ఆ ప్రశ్నను అడిగిన రిపోర్టర్ చిన్నబుచ్చుకున్నాడు.

"నీతీ నిజాయితీతో సంపాదించాలి గాని, అవినీతి, వ్యభిచారంతో సంపాదించడం అన్యాయం. సమాజానికి సిగ్గుచేటు తెచ్చే వ్యవహారం కదా? " ఇంకో రిపోర్టర్.

"మీ ఇంట్లో ఎన్ని బస్తాల బియ్యమున్నాయ్? " లక్కీ అడిగింది.

"నేను ప్రశ్నిస్తున్నదానికి.. మీరు చెప్పే జవాబు సరికాదు" రిపోర్టర్.

"ప్రశ్నించడానికి మీరు పోలీసులు కాదు, నేను ముద్దాయి కాను.. మీరు చెబితే ఊ కొట్టడానికి మీరు అధ్యాపకులు కాదు, నేను విద్యార్థిని కాదు గానీ.. నన్ను తెలుసుకోవాలని మీరు ప్రశ్నలు అడగడానికి! అర్హులా? కాదా! అని మిమ్మల్ని గురించి తెలుసుకోవడానికి నేనూ అడగడం తప్పే మీకాదనుకుంటా" లక్కీ నిశ్చలంగా అంది.

"పది బస్తాలు"

"ఓహో..! పది బస్తాలు, మీరు మీ ఇంటిలో పదిబస్తాలు నిలవ చేసుకోవడం తప్పు కదా! బయట ఎందరో బియ్యం కోసం క్యూలో నిలుచుంటున్నారు.. కొందరు దొరక్క బ్లాక్‌లో కొంటున్నారు.. కారణం పండిన పంటనంతా మీలాంటి వారందరూ బ్లాక్ చేయడం వల్లేకదా! ఇది అవినీతి కాదా.. మీకు తెలుసా! ఒక్క భిక్షగాడు దేశంలో "అమ్మా ఆకలి!" అనే కేకతో దేశంలో మొత్తం మనుషులనబడే వారందరూ అవినీతిపరులుగా, దొంగలుగా లెక్కించబడుతారని.. ఆలోచించండి.. ఇక వ్యభిచారం అన్నారు. ఏ స్త్రీ ఉబుసుపోక వ్యభిచరించదు, అలా లేరని కాదు, అలా వ్యభిచరించినా అది కొన్నాళ్ళే. జీవితాంతం కాదు.. కాబోదు.. ఎందుకంటే ఆమె స్త్రీ.. తల్లి.. ప్రతి స్త్రీ వ్యభిచారి కావడానికి పదుగురి నోళ్ళలో పతితగా పడి నలగడానికి ఆ స్త్రీ వెనక లేదా ముందు పురుషుడన్న వాడు వున్నాడు, వుంటాడు. వుండి తీరుతాడు. వాడు ప్రియుడో, మొగుడో, తమ్ముడో, తండ్రో.. వాడు మాత్రం కచ్చితంగా మగాడై వుంటాడు" లక్కీ.

ఆ మాటలకి రిపోర్టర్లు అన్నీ మరిచి చప్పట్లు చరిచారు.

"అయితే మీరు చేస్తున్నది తప్పు కాదన్న మాట.. మిమ్మల్ని మీరు సమర్థించుకుంటున్నారన్నమాట" 'ఉన్నమాట' ఛానల్ రిపోర్టర్..

"నేనేం తప్పు చేస్తున్నానని మిమ్మల్ని అడుగుతున్నాను..? నా దగ్గరికి ఎవరూ రాకపోతే నేను మీరనుకునే తప్పు చేయాల్సిన పనే లేదు.. ఒక్క విషయం మీరు గుర్తించడం లేదు.. నా దగ్గరికొస్తున్నది.. లోకాన ఎవరూ తప్పు చేయకుండా కాపాడాలనుకునే పోలీసాఫీసర్లు.. తప్పుకు శిక్ష పడేలా చేసే లాయర్లు, తప్పు జరగకుండా ప్రజల్ని ప్రభుత్వాన్ని నడిపే రాజకీయ నాయకులు.. వారందరూ నా దగ్గరకొస్తున్నారంటే.. నేను చేసేదాన్ని తప్పుగా పరిగణించడం లేదనే చెప్పాలికదా! ఒకవేళ తప్పులోనే ఆనందం అగుపిస్తున్నప్పుడు ఆనందం తప్పెలా అవుతుంది? ఈ ప్రశ్నను వేయాల్సింది వారికి.. మగవారికి"

రిపోర్టర్లందర్నీ చూస్తూ చెప్పింది లక్కీ.

"పేర్లు చెప్పండి.. వాళ్ళనూ అడుగుతాం.. కమాన్ ఒక్కపేరు చెప్పండి" నిలదీసేవిధంగా మాటాడాడు మరో రిపోర్టర్.

"ఎవర్నినైనా.. వ్యభిచారం చేసిన ఎవరినైనా నిలదీస్తారా? " లక్కీ సూటిగా చూస్తూ అడిగింది.

"ఎవర్నినైనా.."

"అయితే మీ పాత్రికేయుల్నే అడగండి. మీకు అన్నీ.. అందరి విషయాలు తెలుసుగా!" లక్కీ మామూలుగానే అంది కాని..

పట్టపగలు ఉరుములు, జల్లులు అసలు మేఘాలే లేని సమయంలో పిడుగు పడ్డట్టు అదిరిపోయారు రిపోర్టర్లు.

"మాకూ తెలుసు.. ఎవరెవరు ఏం చేస్తున్నారో.. చేశారో.. ఎందుకు హిపోక్రసి.. మీరు నిజాయితీగా వున్నారా? మీరు అంటే మిమ్మల్నే అని కాదు.. వివిధ ప్రాంతాలలో వుండే రిపోర్టర్లు కొందరు కోట్లు సంపాదించిన వారు లేరా..? అవి మాకు తెలియవా..? ఆ ప్రాంతానికి మమ్మల్ని బదిలీ చేస్తే బావుంటుందని పెద్దలతో ఫోన్లు చేయించడం లేదా..? అలా జరగనప్పుడు.. ఛానల్స్‌ని మీరు అలవోకగా మారడం లేదా? చెప్పండి. లోకంలో నిజాయితీ.. పవిత్రత.. స్వచ్ఛత.. మొదలైన సుగుణాలన్నీ స్త్రీలకే ఉండాలి.. పోనీ అలా వుంటున్న వారిని మీరు అంటే మగవారు ఉండనిస్తున్నారా? ఏదో ఒక గాలమేసి లాగి లాగి చివరకు బుట్టలో వేసుకుని కాల్చుకు తింటున్నారే.. మీకు కనిపించడం లేదా? చెప్పండి.. చెప్పండి.. మీరు కాదు నేనడుగుతున్నాను.. నా ప్రశ్నలకు జవాబులు చెప్పండి. ఇకనుంచి మీరు సమాధానాలు నేర్చుకుని ప్రజల దగ్గరికెళ్ళే కాలం వస్తోందని గ్రహించండి. సో ఎనీమోర్? " లక్కీ.

ఒక్కోమాటకి వారందరూ ఏమీ మాటాడలేక నిశ్శబ్దంలో మునిగి వినసాగారు.

కెమెరాలు మాత్రం వాటంతటవే పని చేస్తూ ప్రజలలోకి లక్కీ మాటల్ని చేరవేశాయి. టి.వి.ల ముందున్న ప్రేక్షకులు లక్కీ మాటలకు ఆలోచనల్లో పడ్డారు.

'ఓకే మామ్! మీ నెక్స్ట్ కార్యక్రమం? " ఓ విలేఖరి తేరుకుని అడిగాడు.

"యాజ్.. యూజ్‌వల్.." అంది లక్కీ.

"బై" చెప్పి అందరూ నిష్క్రమించారు.

సమయం ఏడుగంటల పదినిముషాలు.

లక్కీ మొబైల్ రింగయింది.

"తప్పించుకున్నావని సంబరపడొద్దు.. నిన్నొదలను.. నాకెదురు చెప్పి ఎలా ఈ సిటీలో మనగలవో చూస్తా" అర్జున్.

"ఇప్పుడు, ఏదైనా సినిమాలో ఈ డైలాగ్ పెట్టుకున్నావంటే, ఆ సినిమా కూడా అట్టర్ ఫ్లాప్ అవుతుంది. నీకు చాతనయింది చేసుకో.. పాత సామెత నీకు కొత్తగా గుర్తు చేస్తున్నాను. విను -మొరిగే కుక్క కరవదు- " లక్కీ.

ఆ రాత్రి లక్కీ చూపులు చలం 'మ్యూజింగ్స్' వాక్యాల దారుల్లో మేల్కొని నడిచాయి.




'పబ్' అంటే ఏమిటో.. తెలిసినా.. అందులో ఏముంటుందో అని 'నాన్ స్టాప్ స్ట్రోక్స్' పబ్ గురించి తెలుసుకోవాలని 'లక్కీ' ముఖాముఖిని టి.వి.లో చూసినవాళ్ళందరూ పబ్‌కి పరుగులు తీయసాగారు.

అంతే వేగంతో వెనక్కి రాసాగారు..

కారణం..

ఎంట్రీలన్నీ ఆన్‌లైన్‌లోనే బుక్ అయిపోసాగాయి.

విచిత్రమేంటంటే.. దేశంలోని పలు రాష్ట్రాల నుండి పలువురు ఆన్‌లైన్‌లోనే బుక్ చేసుకోసాగారు.

దేశంలోని పబ్ రేటింగ్‌లో 'నాన్ స్టాప్ స్ట్రోక్స్' నెంబర్‌వన్‌గా నిలిచింది.

చెడు చేయబోతే మంచి ఎదురవడం.

చెడగొట్టబోతే బాగుపడడం.

పట్టిందల్లా బంగారం కావడం.

అందరి విషయంలో వర్తించకపోయినా 'లక్కీ' విషయంలో అదృష్ట దేవత నర్తించడం సహజమవుతూ వచ్చింది.

ఒకరి కెరియర్‌ను నాశనం చేయడానికి పథకం వేస్తే అది వారి ఎదుగుదలకి సోపానం కావడం. తను ఒకటి తలిస్తే కాలం మరొకటి ఫలితం ఇవ్వడం.

లక్కీని పబ్లిగ్గా అవమానించాలనుకుంటే అది లక్కీకి ఫ్రీ పబ్లిసిటీగా పని చేయడం అర్జున్‌కు మింగుడుపడని విధంగా తయారయింది. అర్జున్ కెరియర్‌గాని, ఆస్తులు పెరగడానికి గాని పలువురి ఆలోచనలు దోహదపడ్డాయి గాని తన సామర్థ్యం ఏమీ లేదు. అర్జున్‌కు పరిచయమయిన వ్యాపారస్తులు, తెలివిమంతులు చెప్పినవి చేయడం మాత్రమే చేశాడు. ఎందుకంటే తనకు సెల్ఫ్ కాన్ఫిడెన్స్ లేదు.

లక్కీ విషయంలో మొట్ట మొదట ఎవరినీ సంప్రదించక ముందడుగు వేశాడు. స్వంత తెలివితేటలు ఉపయోగించాడు. చివరికది బెడిసికొట్టింది. ఒక 'పబ్' తను దక్కించుకోలేకపోయాడన్న అసంతృప్తితో మిగిలిపోవడం అవమానం అనిపించింది. 'పబ్' కొనాలనుకోవడం గాక తనే నగరంలోని ఏ కాంప్లెక్స్‌నో నిర్మించి వుంటే బావుండేదనిపించింది.

'లక్కీ' టి.వి.లో చెప్పింది తను చూడలేదు గాని జరిగింది పి.ఎ. ద్వారా తెలుసుకున్నాడు. తరువాత యూట్యూబ్‌లో చూశాడు. తన పేరును ఎక్కడా ప్రస్తావించకపోవడంతో 'థాంక్ గాడ్' అని తనలో తను రిపీట్ చేసుకున్నాడు.

మొబైల్ తీసి లక్కీకి నొక్కాడు.

"యస్.. లక్కీ స్పీకింగ్.."

"థాంక్స్.. నా పేరు ప్రస్తావించనందుకు" అర్జున్.

"మనిషి తన్ను తాను తెలుసుకుంటే చాలు. ఫర్లేదు. ఆల్ ద బెస్ట్" అంది లక్కీ.

ఫోన్ కట్ చేసింది.

★ ★ ★

టి.వి.ల్లో ఎవరినైతే 'లక్కీ' నర్మగర్భంగా ప్రస్తావన చేసిందో వారందరూ ఎవరి ఆలోచనల్లో వారు మునిగిపోయి ఏం చేయాలా? అని అనుకోసాగారు.

'లక్కీ' విషయాన్ని నలుగురు పనిలేని వ్యక్తుల్ని కూర్చోబెట్టి ఉదయం చర్చకు పెట్టారు. రాత్రి చర్చకు పెట్టారు. ఎస్.ఎమ్.ఎస్.లో యస్.. నో.. లతోనూ వ్యాపారం చేశారు.

"మేడమ్.. మీ గురించి రెండు రోజులుగా.. వార్తలు.. వస్తున్నాయ్" గోపాల్.

"అవును.. చూస్తున్నాను. చర్చల్లో నా వివరణ. టెలిఫోన్‌లో ప్రజలతో సంభాషణ అంతా మామూలే. ప్రస్తుతం సెన్సేషన్ న్యూస్ ఏమీ లేనందువల్ల నా విషయం కొనసాగుతోంది. బహుశా ప్రజలకు విసుగుపుట్టి.. టి.వి.ఛానల్ రేటింగ్ ఆ సమయంలో పడిపోవాలి, అంతవరకు. అయినా ఎలాంటి విషయమైనా.. రెండు లేదా మూడు రోజులు మనదేశంలో మీడియాలో చూపిస్తారు.. వినిపిస్తారు.. చర్చిస్తారు. కాని సమస్యను పరిష్కరించేంత వరకూ కొనసాగించరు.. అందుకే సమస్యలు సమస్యలుగానే దేశంలో ఉన్నాయి. మురికి కాలువను ఒక రోజు చూపిస్తారు గాని ఆ మురికి కాలువలోని మురికిని తొలిగించేంత వరకు దానిపై దృష్టి కేంద్రీ

కరించరు.. అందుకే దేశం మురికి కాలువలా ఇలా తగలడింది" లక్కీ.

"మేడం" గోపాల్..

ఆరోజు నుంచి 'లక్కీ'ని సినీకార్యక్రమాలకు, ఛారిటబుల్ ట్రస్ట్ మీటింగ్‌లకు పిలిచేవారు. సొసైటీలోని ఈవిల్ ఎలిమెంట్స్ మీద చర్చకు రమ్మనేవారు.. ఒక్కరేమిటి? అన్ని రంగాలవారూ ఫోన్లు చేస్తూనే ఉన్నారు.

లక్కీ అందరికీ చెప్పిన సమాధానం ఒక్కటే "నేను నేనుగా జీవించడం నాకు తెలిసిన జీవితం"

వడ్డెర చండిదాస్ 'హిమజ్వాల' పుస్తకం తిరగేస్తూ..

★ ★ ★

మొబైల్ రింగయింది..

నరేంద్ర గౌడ్!

మొబైల్ లిఫ్ట్ చేసింది లక్కీ.

"నమస్తే మేడం"

"బావున్నారా..? కాంప్లెక్స్ పని ఎలా సాగుతోంది..? " లక్కీ.

"మీ దయవల్ల ఎక్కడా ఎవరూ.. ఆటంకం కలిగించడం లేదు. సునాయాసంగా సాగిపోతోంది. టి.వి.లో మీ చర్చ వల్ల ఏం జరుగుతుందో అనుకున్నాను. అప్పుడు మీకు ఫోన్ చేసినా కష్టమేనని ఊరుకున్నాను" గౌడ్.

"నా దయవల్ల కాదండి.. డబ్బు.. పదవి, దయవల్ల.. ఆటంకం జరగడం లేదు. టి.వి.లో నా చర్చ రావడం వల్ల నాకు కష్టమేమీ లేదు గాని.. మీ నెంబర్ ట్రేస్ అవుట్ చేయడం వల్ల మీకు నష్టమని గ్రహించే మీరు ఫోన్ చేయలేదు. అయినా ఫర్లేదు.. మీకు ఆటంకం కలిగే విధంగా ఉంటే వెంటనే ఫోన్ చేయండి. మరేం ఫర్లేదు, కాంప్లెక్స్ పూర్తయ్యేంత వరకు పూర్తి బాధ్యత వహిస్తాను" లక్కీ.

"థాంక్యూ.. మేడమ్..! థాంక్యూ.. మీరో సారి వచ్చి చూడండి" గౌడ్.

"పునాది.. భూమి పూజ రోజే రాలేదు.

## కొత్తగాలి... 

**నువ్వు తండ్రివైతే**
**నీకన్నా ఆనందపడేది నీ తండ్రి!**
**ఎందుకంటే?**
**నువ్వు ఇవ్వలేని ఆనందం**
**కనీసం నీ బిడ్డలైనా ఇస్తారని!**

– మోదు రాజేశ్వరరావు,
విశాఖపట్నం

ఇప్పుడెందుకండి..? లేనిపోని రచ్చ మీకు. అనవసరంగా నేను ఇబ్బంది పెట్టిందాన్నవుతాను.. మనకు కావల్సింది పని జరగడం.. అది నిరాటంకంగా జరుగుతున్నప్పుడు.. నేను రావడమెందుకు..? ఆల్ ద బెస్ట్" లక్కీ.

"నమస్తే మేడం" గౌడ్.

ఆ రాత్రి తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' చదువుతూ కూర్చుంది.

★ ★ ★

ఉదయం నుంచి మబ్బులతో ముసురుకున్న ఆకాశం.. వాతావరణం చల్లబడి చినుకులు రాలడం మొదలయ్యింది.

లక్కీకి వర్షమంటే చాలా చాలా ఇష్టం.

చిన్ననాటి తలపుల్ని మోసుకొచ్చే పూల రథం లాంటి శబ్దంతో వాన వినడం..

బాల్యంలో ఇంటిముందు వాననీటి కాలువలు పారుతుంటే కాగితపు పడవల్ని వదలడం.. అన్నిటికన్నా వానలో తడవడం మహా ఇష్టం. నుదిటిపై పడిన కురుల్ని పట్టుకుని వాన చినుకులు అగుపించగానే కళ్ళు పెద్దవి చేసి చూస్తూ గడపడం.. అవి నేలపైకి రాలుతాయేమోనని గబుక్కున నాలుక చాచి వుంచడం.. నోటిలోకి చటుక్కున లాగేసుకోవడం.

బాల్యం ఎంత అద్భుత ఆనందాన్ని అందిస్తుంది.. అమాయకత్వంలో వున్న

సంతోషం ఎందులో వస్తుంది..? పెద్ద వాళ్ళవగానే.. వాన పడితే.. పిడుగులు పడినట్టు అందరూ పరుగులెత్తడం.. తడు స్తామేమోనని వానకు భయపడి, ఏ ఇంటి ముంగిలిలోనో దాక్కోవడం.. విచిత్రం!

కాని

వాన మన కోసమే వస్తోంది. మన అవసరాల కోసమే కురుస్తోందని మన జీవితాల్ని రంగులమయం చేయడానికి వర్షిస్తోందని మరచి పోతున్నామేమోననిపిస్తుంది.

వాన ఎప్పుడొచ్చినా లక్కీ కచ్చితంగా వానలో నడుస్తుంది. తడుస్తుంది. చినుకుల్ని మువ్వలుగా చేసుకుని నర్తిస్తుంది.

వాన వెలవగానే వరండాలో కూచొని ఎదురుగా పచ్చికపైని మిలమిల మెరిసే వాననీటి బిందువుల్ని చూస్తూ, పూల మొక్కలపై ముత్యాలై నిలిచిన నీటి చుక్కలని గమనిస్తూ.. పూలపై రాలిన చినుకుల్లోని రంగుల్ని కళ్ళ దోసిళ్ళలో నింపుకొనడం తప్పక జరిగే కార్యక్రమం..

ఇది గమనించిన వంట మనిషి వేడివేడి మిర్చి వడలు.. టీ.. తయారు చేసి టైంకి అందించడం సహజం..

మనిషి జీవించేది వాన పడేటప్పుడు.. రాత్రి ఆకాశాన్ని చూస్తూ పడుకున్నప్పుడు.. పూలని గమనించినప్పుడు.. తొలి సంధ్య మలిసంధ్యల్ని కనులారా కాంచినప్పుడు.. వెన్నెల్ని తన వొంటిపై వొంపుకున్నప్పుడే నని లక్కీ ప్రగాఢ నమ్మకం, విశ్వాసం కాదు.. కచ్చితంగా అదే జీవితమంటుంది.

దేవులపల్లి కృష్ణశాస్త్రి 'కృష్ణపక్షం' చదువుతూ.. వరండాలో మిర్చి తింటూ.. టీ తాగుతూ.. గతంలోకి జారిపోయింది. చిన్న పల్లెటూరు ఇప్పుడు పెద్ద నగరం.. జీవితం ఎన్ని పాఠాల్ని నేర్పిస్తుంది. కాలాన్ని సద్వినియోగం చేసుకుంటే జీవితం ఎంత బావుంటుంది? మనుషులు తమ తమ కోరికల్ని తీర్చుకోవడం కోసం ఎదుటి మనుషుల్ని, బాధించడం ఎందుకు? ఆకలిని తొలగించడానికి పళ్ళు, ధాన్యాలు, నీళ్ళు ప్రకృతిలో ఎన్నో వున్నాయి. కాని మానవుడు పశుపక్ష్యాదుల్ని వధించి వాటి కడుపు చించి తన కడుపు నింపుకోవడం ఎంత దౌర్భాగ్యం! ఆలోచిస్తూ ఆలోచిస్తూ వరండాలోని సోఫాలో నిద్రపోయింది.

లక్కీకి మెలకువ వచ్చింది..

తెల్లవారుఝాము.. నిశ్శబ్దంగా చీకటి తెరలోంచి వెలుగుపొర బయట పడుతోంది.

బంగ్లాలోనికెళ్ళింది.

మొబైల్ రింగయింది.

"హలో.." అంది.

అవతల వ్యక్తి మాటాడడం జరిగింది.

"అలాగే.. రాత్రి పదింటికి ఫాంహౌస్‌లో.. తప్పక అందరూ రండి" ఫోన్ ఆఫ్ చేసి తన గదిలోకెళ్ళింది.

ఆలోచించసాగింది.

రాత్రికి కావలసినవన్నీ చూడమని గోపాల్‌కి చెప్పింది.

అత్యున్నతస్థాయి ప్రభుత్వ అధికారులు దాదాపు పాతికమంది ఫాంహౌస్‌లో ఇంపార్టెంట్ మీటింగ్ అని చెప్పారు.. సో.. ఎవ్వరికీ ఫోన్‌లు చేయాల్సిన పని లేదు. అందరూ మాటాడుకునే తనకు ఫోన్ చేశారు. తనతో మాత్రమే మాటాడాలని చెప్పారు.. సరే!

రాత్రి ఫాంహౌస్‌కి తొమ్మిది ముప్పై నిముషాలకే లక్కీ చేరుకుంది. ఆరుబయట టేబుల్స్‌కి ఛైర్స్‌కి తెల్లని కవర్స్‌ని తొడిగారు.

చీకట్లో అవి వెన్నెల దుస్తులు తొడిగిన కుందేళ్ళుగా అగుపిస్తున్నాయ్.

టేబుల్స్ పైని గాజుకూజాల్లోని రోజాలు చిన్నిదీపాల్లా కాంతిని వెదజల్లుతున్నాయ్.

ఫామ్‌హౌజ్‌కి వస్తున్నవాళ్ళది ఒక్కొక్కరిది ఒక్కో టేస్ట్.. ఒకరికి విస్కీ, ఒకరికి బ్రాంది, మరొకరికి రమ్, ఇంకొకరికి జిన్, వేరొకరికి బీరు అనుకుంటే పొరపాటే..

'బాక్స్', 'కాల్ డ్రింక్', 'కాబ్లర్', 'ఛేజర్', 'ఫ్రాఫ్పే', 'గ్రోగ్', 'హింగ్ బాల్', 'కొల్లిన్స్', 'కూలర్', 'కప్', 'డైసి', 'ఎగ్‌నోగ్', 'ఫిక్స్', 'ఫిజ్', 'ఫ్లిఫ్', 'జులిప్', 'లోబాల్', 'మిస్ట్', 'ముల్స్', 'నీట్', 'నెగుస్', 'నైట్‌కాప్', 'ఆన్ దిరాక్స్', 'పిక్-మి అప్', 'పౌస్సెట్', 'పఫ్', 'పన్చ్', 'కిక్కి', 'సాంగ్రె', 'షూటర్', 'సుర్బ్', 'స్లింగ్', 'స్రాష్', 'ఫోర్', 'సూపర్‌కాల్', 'స్వెజ్లి', 'సెల్లాబబ్', 'టోడ్డి', 'టాల్','వర్జిన్', 'వెల్‌డ్రింక్' - ఇలా ఎన్నో రకాల మధువు లున్నాయి. గమ్మత్తు ఏమిటంటే మత్తు లోనూ ఎన్నో రకాలు.. మెత్త పరిచేవి కొన్నయితే చిత్తు చేసేవి మరికొన్ని, అంద రికీ కావల్సింది మత్తే అయినా.. లోకోభిన్న రుచిగ ఒక్కో మనిషికి ఒక్కోరకపు మత్తు ని ఇష్టపడతాడు. ఆ బ్రాండ్ దొరకనప్పుడు ఉన్న బ్రాండ్‌తోనే సరిపెట్టుకుంటాడు.. ఇక్కడ మత్తు రావడమనేది ముఖ్యమని సరిపుచ్చుకుంటాడు. సాధారణంగా.. పబ్‌లో దొరికే రకాల్ని ప్రైవేట్ పార్టీ ల్లోనూ కోరుకోవడమంటే ఆ పార్టీ ఎలా వుంటుందో ఊహించుకోవచ్చు ఎందు కంటే అది అరేంజ్ చేసేది లక్కీ.

ఇలా వైవిధ్యమైన రకాలు కలిపిన పార్టీని ఇవ్వగల సత్తా నగరంలో ఒక్క లక్కీకే వుందని, ఎవరికి ఎలాంటి డ్రింక్స్, ఎలాంటి తిండి, ఎలాంటి పువ్వు, ఎటు వంటి నవ్వు నచ్చుతుందో తెలుసుకుని అందివ్వడం, సంతృప్తి పరచడం కేవలం లక్కీకే చేతనవుతుందని వేరే చెప్పాల్సిన పనిలేదు. అందుకే లక్కీ అన్నిట్నీ అందర్నీ అలవోకగా అలరించుతోంది. వారిని వారి తోనే వారితోటే అలంకరించుతోంది.

పది గంటలవుతోంది.

ఒక్కొక్కరే వస్తున్నారు.

అందరూ కలిసి ఇంపార్టెంట్ మీటింగ్ అంటే ఏదో భారీ ఎత్తున ప్లాన్ వేశారనే అర్థమవుతోంది.

రాత్రి ఆకాశంలో నక్షత్రాల నడుమ అయిదోరోజు నెలవంక అద్భుతంగా సిటీ

## కొత్తగాలి...

**సంస్కృతి**
**ప్రవాహమైతే**
**భాష**
**వంతెన!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవల్లి

వెలుపల ఫాంహౌస్‌లో దర్శనమిస్తోంది.

పది గంటల పది నిముషాలు.. అందరూ వచ్చేశారు.

కుర్చీలో కంఫర్ట్‌గా కూచున్నారందరూ.

డ్రింక్స్‌లో మొదటి రౌండ్ సర్వ్ చేసి సర్వర్స్ వెళ్ళిపోయారు బిల్డింగ్‌లోకి.

లక్కీ 'కాల్ చేసేంత వరకు రావద్ద'ని ముందే చెప్పింది.

"సో.. డియర్ ఫ్రెండ్స్. పార్ట్‌నర్స్. మనమంతా ఈరోజు ఇక్కడ కలుసుకో వడం ఆనందంగా వుంది. ఇంతకు మునుపు కలుసుకున్నా అవి వేరే వేరే ఆనందాలకోసం అనుకోండి.. అది వేరే విషయం.. కాని నేడు మనం ఫోన్‌లలో అనుకున్నట్టు ఈరోజు ఇక్కడ ఓ బలమైన నిర్ణయం తీసుకోవాలి. తప్పదు.. లేదంటే మన ఆస్తుల పునాదులు కదిలిపోవడం ఖాయం.. కారణం రాజకీయ నాయకులు పార్టీలు.. ప్లేట్లు ఫిరాయించినట్లు మనం అధికారాల నుంచి, డిపార్ట్‌మెంట్స్ నుంచి ఎక్కడికీ వెళ్ళలేం. ఇప్పుడే కాదు. రిటైర్ మెంట్ తరువాత కూడా మనల్ని మన ఆస్తుల్ని కాపాడే విషయం మనం తప్పక ఆలోచించాలి. దానికి శాశ్వత పరిష్కారం జరగాలి" ఒక ఉన్నతాధికారి మాటాడాడు.

"నిజం.. అది ఎలా? " మరో అధికారి.

మనం రాజకీయ నాయకులంత అవి

నీతి సొమ్ము తినడం లేదు. కానీ ప్రజలు వాళ్ళని ఎన్నుకుంటూనే వున్నారు. వారికి జేజేలు కొడుతున్నారు. మనల్ని మాత్రం లంచగొండులుగా, అవినీతిపరులుగా శాశ్వతముద్ర వేసి చూస్తూనే ఉన్నారు. వీటికి పరిష్కారం మన సొమ్మునంతా లక్కీ దగ్గర పెట్టడం మినహా వేరే మార్గం లేదు" ఇంకొక అధికారి అత్యుత్సాహంగా..

"లక్కీ అయినా ఎంతని నిభాయిస్తుంది? ఏదో ఒక రోజు రాజకీయం తన మీదా పంజా విసరకపోదు.. అప్పుడు తను శాశ్వతంగా మన డబ్బుతో సహా బలికావల్సిందే కదా" మరో అధికారి.

అందుకే కదా.. పబ్ లాంటివి.. హోటళ్ళలాంటివి సిటీలో మన డబ్బుతో ఆవిర్భవింపచేద్దాం" ఇంకో అధికారి.

"ఎన్నని.. చేస్తాం.. అన్ని చేస్తుంటే లక్కీ మీద ఇంకా వ్యతిరేకత పెరుగుతుంది. ఇప్పుడే చూశాం కదా! ఓ పబ్ కోసం తనని ఎంతలాగారో.. అన్నీ సరే.. ఏం చేసినా.. మనల్ని కాపాడుకునే మార్గం కావాలి. అది ఏమిటో చెప్పండి" డ్రింక్ సిప్ చేస్తూ అధికారి ఒకరు.

"రాజకీయం" ఒక అధికారి చిన్నగా ఆ మాటను వదిలాడు.

"రాజకీయం.. సరే.. ఏ పార్టీ.. వస్తే ఆ పార్టీకి మనమంతా చదివింపులు చదివించుకుంటూపోతే చివరికి మన జీతాల్లోంచే పర్సంటేజ్ అడిగే రాజకీయ నాయకులు తయారవుతారు.. కాబట్టి.."

"కాబట్టి"

"మనలోనే ఒకరు రాజకీయ నాయకుడు కావాలి"

అంతా నిశ్శబ్దం..

"కరెక్ట్.. అయితే.. ఎవరు? "

"అది తేల్చడానికే మనం ఇక్కడ సమావేశమయ్యాం"

మొదటి రౌండ్ ముగిసింది. కొందరి గ్లాసుల్లో డ్రింక్ పూర్తిగా, మరికొందరి గ్లాసుల్లో సగం అయిపోవడంతో లక్కీ మొబైల్ నుంచి కాల్ చేసి డ్రింక్ అందరికీ ఆర్డర్ చేసింది.

రెండు నిముషాల్లో డ్రింక్స్ వచ్చాయి.

ఆ లోపలే సగంతో ఉన్న గ్లాసులు ఖాళీ అయిపోయాయి.

సర్వర్స్ ఫాస్ట్‌గా డ్రింక్స్ అరేంజ్ చేసి మంచింగ్ వేడివేడిగా పెట్టి వెళ్లారు.

"సో.. ఎవరు? " మళ్ళీ మొదటికొచ్చింది.

పదిహేను నిముషాలు మీరంటే మీరని తర్జన భర్జన జరిగింది.

ఎవరూ ఒప్పుకోవడం లేదు.. తమకు చేతకాదని.. వద్దంటే వద్దని మనస్ఫూర్తిగా చెబుతున్నారు.

"అయితే ఒక పని చేద్దాం.. లక్కీని రంగంలోకి దింపుదాం. రాజకీయ రంగంలోకి దింపుదాం" ఒక అధికారి.

అంతే..

నిశ్శబ్దం.. ఆ పరిసరాల్లో నిండిపోయింది.

అందరూ మౌనంగా..

"మాకెవరికీ ఈ ఆలోచన రానందుకు సిగ్గుగా వుంద"ని బాహాటంగానే ఆ అధికారితో అన్నారు.

లక్కీ ఆనందంతో ఉక్కిరిబిక్కిరి కాలేదు.

అందర్నీ పరికిస్తూ అంతరంగంలోని నవ్వునూ ఆపలేదు.

"మనలో చాలామందికి పార్టీల ప్రెసిడెంట్స్ తెలుసు, మాజీ.. తాజా, రేపటి ముఖ్యమంత్రులూ తెలుసు. మనందరం ఓ సీటిమ్మని అడిగితే కాదనే దమ్ము వాళ్ళకి వుండదు" ఓ అధికారి నిశ్చయంగా.

"అందులో మొన్న టి.వి.లో లక్కీ సూటిగా స్పష్టంగా అన్న మాటలు ప్రజల్లో లక్కీ మీద అభిమానాన్ని పెంచాయి. రాజకీయాల్లో సూటిగా మాట్లాడేవారిని ప్రజలు నమ్ముతారు. అలాంటి వారికి పార్టీ టికెట్ ఇవ్వడం వల్ల గెలిచే సీటు ఒకటి ముందే వాళ్ళు తమ ఖాతాలో వేసుకోవచ్చు. అలాగే ఎంత ఖర్చయినా మనం

గెలిపించుకుంటామని చెబుదాం.. మంత్రి పదవిని కూడా ఇచ్చేట్టు ముఖ్యమంత్రితో మాటాడుదాం. ఎంత ఖర్చవుతుందో అంత పారేద్దాం.. ఒన్ టైమ్.. ఇన్వెస్ట్‌మెంట్.. ఫైవ్ ఇయర్స్ ప్రాఫిట్" సులభంగా అనేశాడు మరో అధికారి.

లక్కీ మౌనంగా ఉండటం చూసి..

"అన్నీ సరే.. లక్కీ మౌనంగా ఉంది.. ఏమంటావ్ లక్కీ? " ఓ అధికారి.

'ఒకసారి సానిగా.. మరోసారి రంగసానిగా చేయబడ్డ నన్ను రాజకీయ రంగంలో దింపి రాజకీయ రం(గ)గు నాయకిగా చేస్తారన్నమాట! మీ అందరి ఆస్తుల్ని.. కాపాడడానికి నేను ప్రస్తుతం ఎత్తిన అవతారం చాలక మరో కొత్త అవతారం ఎత్తాలన్న మాట. దేశంలో లోకంలో స్త్రీ మాత్రం ఎప్పటికి.. ఎన్నటికి అందరికి పనికి వచ్చే విలాస, వినోద, బాధ్యతావస్తువే.. అటు సంసారంలో కాని ఇటు సమాజంలోగాని' అనుకుంది లక్కీ.

"లక్కీ.. ఏమంటావ్? " మౌనంగా వున్న లక్కీని చూస్తూ మరో అధికారి.

"ఏమాలోచిస్తున్నావ్? " మరో అధికారి.

"అబ్బె.. ఏమీ ఆలోచించడం లేదండి.. వింటున్నా. జవాబు చెప్పడానికేముంది.. ఈరోజు మీరందరూ ఒక నిర్ణయానికొచ్చారు. బాగుంది.. కొన్నాళ్ళాగి చూస్తే.. మీలో మీకు నాపై ఏ అభిప్రాయం వస్తుందో వేచి చూడాలి కదా! ఆవేశంలో నిర్ణయాలు సరికావు.. సరైన ఆలోచనతో చేయడమే రాజకీయాల్లో సమంజసంగా వుంటుంది" లక్కీ.

"సరే.. లక్కీ.. ఇది ఇప్పటి మా ఆలోచన.. మరోసారి సిట్టింగ్ వేద్దాం. అప్పుడు ఫైనల్ చేద్దాం" అందరూ లేచారు.

"అలాగే.." లక్కీ.

అందరూ వెళ్ళిపోయారు.

లక్కీ అందర్ని సాగనంపి వచ్చి కుర్చీలో కూచుంది. నౌకర్లు ఖాళీ గ్లాసుల్ని టేబుల్స్‌ని ఛైర్స్‌ని తీసేశారు. లక్కీ ముందు ఓ చిన్న టీపాయ్ వుంచారు.

లక్కీ కళ్ళతోనే గోపాల్‌కి సైగ చేసింది.

రెండు నిముషాల్లో గడ్డకట్టిన నాలుగు బీర్లు టీపాయ్ మీద చెమటలు కక్కుతూ నిలుచున్నాయ్.

గోపాల్ హౌస్‌లోకి వెళ్ళిపోయాడు.

ఓ బీరు బాటిల్ తీసి ఓపెన్ చేసింది.

ఒక్కసారిగా గుటక నిలపక తాగేసింది. చుక్కల ఆకాశం నెలవంక సోయగం! చిక్కటిచీకటిలో తను ఒక్కతే.. బావుంది. అలా కూచుని మత్తులో జోగాలనిపించింది లక్కీకి. ఎక్కడికక్కడే ఎప్పటికప్పుడే బతకడం తన్ను తానుగా జీవించడం ఎంత బావుంటుంది..

'స్పాన్‌టేనియస్ లైఫ్ ఈజ్ రియల్ లైఫ్' ఆకాశంలోకి చూస్తూ.. బీరు సేవిస్తూ..

రాత్రి రెండుగంటలయింది.

బీరు ఖాళీ అయింది.

లక్కీ మొబైల్ తీసి గోపాల్‌కి నొక్కింది.

గోపాల్ మరో రెండు బీరు సీసాల్ని వుంచి వెళ్ళాడు.

మత్తు అద్భుతం. ఇంక చాలు అనిపించదు. తీసుకుంటున్న కొద్దీ తీసుకొమ్మని ఆహ్వానిస్తూనే వుంటుంది. ఆరు బీర్లు.. నీళ్ళు కూడా అన్ని తాగలేం.

ఆల్కహాల్ చేసే హల్‌చల్ అలాంటింది.

లక్కీ ఆ రెండిటిని ఖాళీ చేసి మూడున్నరకి.. కింద పచ్చికపై పడుకుంది.

ఆకాశం వంక చూస్తూ నక్షత్రాల్ని నయనాల్నిండా నింపుకుంటూ నిదురబోయింది.

నెలవంక మాత్రం లక్కీ అందాన్ని చూస్తు మేలుకొనే వుంది.

ఉదయం ఎనిమిదింటికి ఎండ కందరాలపై వాలి చురుక్కుమనిపిస్తే లక్కీ కనురెప్పలు తెరిచింది.

రెండు సూర్య గోళాల్లాంటి కళ్ళు.




మండుతున్నాయ్. కాసేపు కళ్ళు మూసుకుని లేచి బిల్డింగ్‌లోకి వెళ్ళింది.

బాత్‌టబ్‌లో పడుకుంది చల్లనీళ్ళలో..!

పదింటికి 'టీ' తాగి సిటీకి బయలుదేరింది. సిటీలోని ఇంటికి వెళ్ళగానే ఆకలితో వున్న కడుపు ఓ ఇడ్లి ఓ వడ సాంబారుతో శాంతించింది.

బ్లాక్ టీ తాగుతూ వార్తలు చూసింది.

'గెలుపు గుర్రాలకే టిక్కెట్స్ ఇస్తామని' ఒక రాజకీయ పార్టీ చెబుతోంది.

నయం.. గాడిదలకు అనలేదు!

'అధికారంలోకి రావడమే మా ధ్యేయం'

ఇలాంటి ధ్యేయం వుండడం వల్ల ప్రజలకేం వొరుగుతుందో అర్థం కాదు!

'మా నాయకుని ప్రధానమంత్రి చేయడమే మా లక్ష్యం'.. బాగుంది వరస. ప్రధానమంత్రిని చేయడానికే పార్టీ.. ఎన్నికలు.. వున్నాయి గాని ప్రజల బాగోగులకు కాదు.. బాగా గమనిస్తే పార్టీల మధ్య ఆధిపత్యం కోసం, వ్యక్తిగతంగా ముఖ్యమంత్రో, ప్రధానమంత్రో కావడం కోసం పోరాడడం జరుగుతోంది గాని.. ప్రజల కోసం, ప్రజా సంక్షేమం కోసం ఏ పార్టీలోనూ చిత్తశుద్ధి అగుపించడం లేదన్నది స్పష్టమవుతోంది. మరీ ఆశ్చర్యకరమైన విషయమేంటంటే.. ప్రతి ఎమ్మెల్యే, ఎం.పి. తదితర నాయకులు ప్రతిపక్షనాయకులు కేవలం కార్లలో తిరుగుతూ ఖజానాలు నింపుకుంటున్నారు. ఏ ఒక్కరూ ఇటున్న పుల్ల అటు వేసిన పాపానికి పోలేదు. రోజుకు మూడు పూటలు గంజి పెట్టి ఇస్త్రీ చేసిన దుస్తుల్ని మార్చుకుంటూ ఫ్రెష్‌గా దర్శనమిస్తుంటారు. నీటుగా అగుపిస్తుంటారు. కాని ఉదయం నుంచి రాత్రి వరకు పగలనక రేయనక కష్టపడే మనుషులు పస్తులుంటూ మూడు రోజులకు ఓసారి దుస్తులు మార్చడం, వారానికోసారి స్నానం.. చేస్తుంటారని ఎందరికి తెలుసు? కూటికోసం నిరంతరం శ్రమను చిందించే వాడికంటే దేశంలో నోటితో నాలుగు మాటలు చెప్పేవాడే నాయకుడై పోయి కోటానుకోట్లకు పడగలెత్తుతున్నాడ



న్నది సత్యం.. లక్కీ ఆలోచనలు సాగిపో తూనే వున్నాయి.

సంపాదించిన డబ్బును దాచుకోడానికి మరింత ఎక్కువ సంపాదించడానికి అధికా రులకు, వ్యాపారులకు పనికొచ్చే అంశా లుగా రాజకీయాలు తయారయ్యాయి.

మొబైల్ రింగయింది.

కొత్త నెంబరు.

"యస్ చెప్పండి" లక్కీ.

"మా ఛానల్ అమ్మాలనుకుంటున్నాం" సూటిగా చెప్పాడు.

"నేను కొనాలనుకోవడం లేదండి" లక్కీ స్పష్టంగా చెప్పింది.

"నష్టాల్లో వుంది, పోనీ.. పార్ట్‌నర్ గానన్నా మీరు" ప్రాధేయత.

"గుడ్.. నష్టాల్లో వుందని చెపితే.. ఎవరూ పార్ట్‌నర్‌గా రారండి.. అయినా మీరెవరు..? నాకే ఎందుకు ఫోన్ చేస్తు న్నారు? " లక్కీ.

"మీ గురించి విన్నాం.. ఛానల్ వుందంటే మీకు సేఫ్‌గా వుంటుందని.. మీరు పార్ట్‌నర్‌షిప్‌లో వుంటే లాభాలు వస్తాయని తెలిసి" నసుగుడు..

"నాకు తోడుగా ఏ ఛానల్.. ఎవరూ అవసరం లేదండి.. నా పార్ట్‌నర్‌షిప్‌లో వుంటే లాభాలు వస్తాయో.. నష్టాలు వస్తాయో.. నాకు మాత్రం తెలియదండి. ఓ.కె. నేను నేనుగా వుండదలచుకున్నాను. వుంటాను...బై" లక్కీ.

మొబైల్ మళ్ళీ రింగయింది.. ఇంకో

## కొత్తగాలి...

**విద్య విజ్ఞానానికి**
**విజ్ఞానం వివేకానికి**
**వివేకం**
**విశిష్ట జీవనానికి!**

– *మా. శ్రీ. రాజు,*

*పాల్వంచ, భద్రాద్రికొత్తగూడెం జిల్లా*

నెంబరు.

"నమస్తే మేడమ్.. నేను పబ్‌ను పెట్టాలనుకుంటున్నాను"

"పెట్టండి" లక్కీ.

"దానికి మీ సలహా"

"మీరు సలహాలడిగే స్థితిలో వున్నారంటేనే అర్థమవుతోంది. డిపెండెడ్ ఆన్ అదర్స్.. అని. సో.. మీరు పబ్ కాదు కదా - టీ హోటల్ కూడా పెట్టలేరు. ఏదీ పెట్టలేరు. డోంట్ వేస్ట్ టైమ్.." కట్ చేసింది లక్కీ.

మొబైల్ మళ్ళీ రింగయింది.

"గుడ్ మార్నింగ్ మేడమ్"

"వెరీగుడ్ మార్నింగ్" లక్కీ.

"మేం రియల్ ఎస్టేట్ కం బిల్డర్స్‌గా వ్యాపారం ప్రారంభించబోతున్నాం.. మీ సహాయం, సలహా కావాలి"

"మీకు నా నెంబరు ఎవరిచ్చారని అడగను.. నేను మీ వ్యాపారానికి ఏ సహాయం చేయలేను, ఏ సలహా ఇవ్వలేను. సిమెంటు ఫ్యాక్టరీ లేదు, కనీసం ఒక సిమెంటు బస్తా లేదు కాబట్టి, సిమెంటు ఉత్పత్తి చేసే వేరే ఎవరినైనా సంప్రదించండి.." లక్కీ ఫోన్ కట్టేసింది.

ఫోన్ మళ్ళీ రింగ్ అయింది.

మరో నెంబర్.

"యస్ చెప్పండి" లక్కీ ప్రశాంతంగా.

"మేడం మాది ప్రజాస్వామ్య విలువల్ని పోషించే పార్టీ. భారతదేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వం నుండి మా పార్టీ ప్రజల్లో పని చేస్తోంది. మీరు మా పార్టీలో చేరితే మీకు అండగా మేముంటాం. అలాగే మీ నుంచి మా పార్టీ బలపడుతుంది" ఆవేశపూరితంగా మాటాడుతున్నాడు, అవతలి వ్యక్తి.

"ఆలోచించి మాటాడుతున్నారో.. లేక పార్టీ పుట్టినప్పటి నుండీ రొటీన్‌గా వల్లించే మాటల్ని మాటాడుతున్నారో గాని మీ చేతల్లో మీ ప్రశ్నకి జవాబు.. వుందనిపిస్తోంది. భారతదేశానికి స్వాతంత్ర్యం రాక మునుపు నుంచి మీ పార్టీ ప్రజలకు చేసిందేమీలేదని మీ మాటల్లోనే చెబుతున్నారు. నేను చేరితే పార్టీ బలపడుతుందేమో గాని మీ పార్టీలో చేరితే నాకు అండగా ఎందుకుంటారో తెలీదు. ఆ అవసరం నాకు లేదు. మరెప్పుడూ ఫోన్ చేయకండి, ఈ విషయమైతే.." లక్కీ ఫోన్ పెట్టేసింది.

ఫోన్‌లు వస్తూనే వున్నాయి.

విసుగులేకుండా సమాధానాలు చెబుతూనే వుంది లక్కీ.

ఆరోజే..

చాలా రోజులుగా చదువుతున్న పుస్తకం విశ్వనాథ 'వేయిపడగలు' ముగించింది.

★ ★ ★

ఒక నెలరోజులు ఎవరు ఫోను చేసినా ముక్తసరిగా మాటకు మాట మాత్రమే జవాబు చెప్పి తను తనలో వుండసాగింది.

దేశంలోని ప్రదేశాల్ని తెలిపే అట్లాస్ పటం ముందేసుకుని గడపసాగింది.

దేశచరిత్రను ఆసాంతం చదవసాగింది.

ఒకరోజు గోపాల్‌ని పిలిచి చెప్పింది.

"గోపాల్ మనం చాలారోజులు ప్రయాణం చేయాల్సి వుంటుంది. అందుకు నువ్వు తయారయి ఇంట్లో చెప్పి వచ్చేయ్. రేపు తెల్లవారు ఝామునే మన ప్రయాణం.." లక్కీ.

"మేడమ్" గోపాల్.

ఆ రాత్రి లక్ష్మి బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' పుస్తకం ముగించి పడుకుంది.

పడుకుందన్న మాటేగానీ.. కనులు మూసిందన్న మాటేగానీ.. నిప్పుల్లాంటి ఆలోచనలతో కనురెప్పలు మండిపోతున్నాయ్.. చిన్ననాటినుండి నేటి వరకు బతుకులోని మలుపుల్ని తలచుకుంటుంటే.. శరీరం నిప్పులకుంపటిగా గాక అగ్ని గుండమైపోతోంది.. ఉన్నట్టుండి తనలో జరుగుతున్న ఈ పరిణామం.. అంతవరకు బాగానేవున్న మనుషులు హఠాత్తుగా మరణించేవారిని గుర్తుతెస్తోంది.

ప్రశ్నలు.. ప్రశ్నలు.. ప్రశ్నలతో మెదడు వేడెక్కుతోంది. జీవితమంటే ఏమిటి? ఎందుకు జన్మించాం? ఎందుకిలా బతుకుతున్నాం? దేనికీ ప్రస్థానం.. ఏం చూసినా.. ఏం చేసినా.. ఎవరెన్ని చెప్పినా.. ఔనన్నా.. కాదన్నా.. జీవికి చివరికి మరణం తప్పడం లేదు.. జీవి రాకపోక తెలియడమేలేదు.. నడుమ మిగిలేది ఏమీ కనబడడం లేదు. జననమంటేనే మనకు తెలియకపోవడం.. మరణం గురించి జీవితమంతా ఏమాత్రం స్పృహ రాకపోవడం ప్రతి ఒక్కరు గమనించని అంశమనిపించింది.

బాల్యం.. ఏమీ తెలియని, ఏ రాతా రాయని తెల్ల కాగితం. యవ్వనం.. అన్నీ తెలుసుకునే తెలుసుననే గీతల్లో సాగే జీవితం. వృద్ధాప్యం.. ఏం తెలుసుకున్నాం? ఏం సాధించామనుకునే చింతతో కాలం వడదెబ్బకి రాలిపోయే కపోతం.

వయసుపెరిగే కొద్దీ లోకంలోని మనుషులు ఒకరికొకరు సహకరించుకునే దృష్టిపోయి వంచించుకోవడం పరిపాటయిందనిపించింది. లోకం చూపులతో శరీరం, భర్త దౌష్ట్యానికి హృదయం ముక్కలై పోయాయి. ఎన్నిపుస్తకాలు చదివినా! అన్నింటి సారాంశం మంచి, చెడు, హింస, అహింస, నీతి, అవినీతిగా ప్రతికాగితం లోనూ విశ్లేషించడమే జరిగింది. కాని నాటి నుంచి నేటిదాకా ఎవరి జీవితంలోనూ మంచి అన్నదే కనిపించలేదన్నది వాస్తవంగా కనిపిస్తోంది. ఎన్ని పుస్తకాలు, మరెన్ని బోధనలు మనుషుల్ని చెడుమార్గం నుంచి తప్పించలేకపోతుండటం ఎన్నో ఏళ్ళుగా నిరూపితమవుతూనే వుంది.

మంచి చెడులు రెండూ రెండు రైలు పట్టాలా? వాటిమీద మనిషి జీవిత ప్రయాణం తప్పదా? ఒకటి లేకుండా మరొకదానిపై బతుకు బండి సాగదా? అనాగరిక కాలంలోనూ హింస వుంది. దారిదోపిడీలు చేసే, ఇంటికి కన్నాలు వేసే, తాళాలు పగులగొట్టే దొంగలున్నారు. నేడు సునాయాసంగా చేతివేళ్ళతో ఎ.టి.ఎమ్. పేగులు తోడే దొంగలూ, కాగితాలతో ఫోర్జరీలతో అవసరం లేకుండా కంప్యూటర్ల ముందు కూచొని ఫింగర్స్‌తో కరెన్సీ ఫిగర్స్‌ని తమ ఖాతాల్లోకి మార్చుకునే పాష్ దొంగలూ ఉన్నారు. ఎంత టెక్నాలజీ పెరుగుతోందనుకున్నా ఎంతో నిఘా వ్యవస్థని రూపొందించుకుంటున్నా, మనుకుంటున్నా.. చివరికి.. దొంగని పట్టుకునే పోలీసుకి నూరుదారులైతే, తప్పించుకునే దొంగకి నూటొక్కదారి ఉంటూనే ఉంది. కొత్త కొత్త ఎత్తులతో దొంగెత్తుల్ని దొంగే కనిపెడుతున్నాడు. వాటిని కనుగొనే ప్రయత్నంలో పోలీసు వెనుకబడుతున్నాడు. దొంగ ఎప్పుడూ కొత్తదారినే ఎంచుకుంటాడు. పోలీసు ఆ దారిని వెతుక్కుంటూనే వెళుతుంటాడు. జీవితంలో కొన్ని అసాంఘిక సంఘటనల్లో తను తృటిలో తప్పించుకున్న సందర్భాలెన్నో తనకీ తెలుసు. ఏ ఒక్క విషయంలోనైనా పట్టుబడిపోయివుంటే జీవితాంతం కటకటాల వెనుకో, చివరికి అంతులేని చీకటి మాటులోనో జీవితం ముగిసిపోయేదనేది వాస్తవం. నేటికి ఇలా తను మిగలడమన్నది ఊహించనిదేనన్నదీ నిజం. లోకం

లో ఉన్నవన్నింటినీ బాహ్యంగా రుచిచూడడం, అంతర్గతంగా అనుభవించడం జరిగిందన్నది యదార్థం.. కానీ, విచిత్రమనిపిస్తోంది.. జననాన్ని, మరణాన్ని జీవితకాలంలో తెలుసుకోకపోవడం.. కారణాన్ని అన్వేషిస్తే.. కదులుతున్న కాయానికి మరణం దూరంగా జరుగుతూ పోతుండడమే ననిపిస్తోంది.

లక్ష్మీ చిత్తంలో 'చిత్' నాటుకుంది. అది ఒక్కరాత్రిలోనే విత్తనం దశ నుండి మహా వృక్షమై ఊడలు దిగి తుఫాను గాలికి పోటెత్తింది. సాహితీవేత్త 'బంగోరె' గుర్తొచ్చాడు.. జీవితకాలంలో అతను రాసింది తక్కువే.. అయినా జీవితాన్ని తెలుసుకోవడానికి తన జీవితకాలాన్ని లోక సంచారిగా వెచ్చించాడనిపిస్తుంది. తెలుగు నేలలో ఎక్కడోపుట్టి జీవిత లోతుల్ని అన్వేషిస్తూ సంచరిస్తూ పంజాబ్‌లోని భాక్రా డ్యాంపై నడుస్తూ డ్యాం పైనుంచి కిందికి చూసినప్పుడు తనకు కలిగిన ఉద్వేగం జీవితంలో అంతవరకూ ఏనాడు కలగలేదనిపించిందేమో.. ఆ ఉద్వేగంలో.. ఆనందోద్వేగంలో ఒక్క ఉదుటున డ్యాంపై నుంచి కింద పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తున్న ప్రవాహంలోకి దూకి పరమపదించడం జరిగింది. 'డైమెన్షన్' కొత్తదయినప్పుడు ఉద్వేగమన్నది సహజంగా జరిగే మానసిక క్రియాపరిణామం. లోకంలో చాలామంది హృద్రోగంతో అంటారు గాని ఉద్వేగంతోనే పరమపదిస్తున్నారనిపిస్తుంది. ఆ సందర్భం ఒక అనిర్వచనీయమైన తన్మయత్వానికి సంబంధించిన విషయమని తెలుస్తుంటుంది. ఆత్మబలికి, ఆత్మాహుతికి, ఆత్మవైకల్యానికి నడుమ ఆత్మకైవల్యమన్నది ఉంటుంది. జీవితాన్ని శరీరాన్ని ఆత్మకి సమర్పించడం. పరమాత్మకి ఆత్మని అంకితం చేయడం. విశ్వాత్మలో లీనమవడం.. తనకూ.. ఇలాంటి సందర్భం జీవితంలో వస్తుందని తను ఎన్నాళ్ళనుంచో అంతరాంతరాలల్లో ఆశిస్తోంది.. ఏనాడూ ప్రత్యేకంగా దీనికోసం ఎదురు చూడలేదు గాని అప్పుడప్పుడు ఇటువంటి ఆలోచనలు వస్తుండడాన్ని గమనిస్తూనే ఉంది. కాని, ఇప్పుడు తను అందులో లీనమయిపోతుండడం తనకు తెలుస్తూనేవుంది. పాతాళానికి పడిపోయేందుకు, ఆకాశానికి వెళ్ళిపోయేందుకు మెట్లుగాని, నిచ్చెనలుగాని అవసరం లేదని తెలుస్తోంది. కారణం.. జననానికి మరణానికి నడుమ జరిగే విషయాలన్నింటికి కారణాలుంటుంటాయి గాని జనన మూలానికి, మరణానికి కారణమన్నది తెలియకపోవడం వాస్తవం.. తెలుసుకోవడమనేది వారి వారి మనోశక్తిపై ఆధారపడిందనిపిస్తుంది.

లక్ష్మీ మస్తిష్కం ప్రస్తుతం విపరీతమైన మానసిక ఒత్తిడిలోగాక ప్రశాంతంగా విడుదలయిన కొత్త పుస్తకంలా అగుపిస్తోంది. జీవితంలో జరిగే వాటన్నింటికి ఇన్నాళ్ళు 'కామాలు' పెట్టుకుంటూ పోయిందేగాని ఇప్పుడు 'ఫుల్‌స్టాప్' పెట్టడానికి నిర్ణయం ఎవరి ప్రయేయం లేకనే తనంతట తనే జరిగిపోయింది. ఘర్షణలు, ఎత్తులు, పైయ్యెత్తులులేని 'స్థాయి' ఒకటి చీకటి పొదల్లోంచి వెలుగు వాకిళ్ళు తెరుచుకునే పరిస్థితికి, జనన మరణాలను ఏకకాలంలో దర్శించే వాస్తవ శాస్త్ర ప్రదర్శనానికి, చర్మంలో దాగిన అసలు మర్మాన్ని, దేహంతోనే కపాల దాహాన్ని తీర్చుకునే తరుణానికి మోముపై ప్రతి అణువు చిరునగవులతో అవయవాలన్నీ పువ్వులుగా విచ్చుకునే ముహూర్తం తనంతతానే మర్మ 'గర్భం'గా జరిగిపోయింది. ఎప్పుడు ఏమవుతుందోనన్న సందిగ్ధంలోంచి దగ్ధమైన అనవసర ఆలోచనలలోంచి ఎప్పుడైనా ఏమైనా జరుగుతుందనే సందర్భంలోంచి.. ఎప్పుడు ఏమైనా ఏమీ కాదనే 'స్థితి'ని నిర్ణయించేది పరిస్థితి కాదని, స్థిమితమైన కాల స్థితి.. ఆ 'స్థితి'ని దర్శిస్తూ నిశ్చలంగా కళ్ళు

విప్పార్చింది.. ఝాములన్నింటిని దాటిన మోములోంచి ముసి ముసి నవ్వుల పరిమళాల పువ్వుల్ని విచ్చింది..




తెలవారు ఝాము.. కనకాంబరం చీర కట్టి అదే రంగు జాకెట్టుతో తడారిన కురుల్ని అలాగే వదిలేసి తన గదిలోంచి ఓ చిన్న జర్నీ బ్యాగ్‌తో బయటికొచ్చింది.

కారులో కూచున్న గోపాల్ కిందికి దిగుతుంటే చేతితో సంజ్ఞచేసి తను వెనక డోర్ తీసి కూచుంది.

వంటింట్లో లైట్ వెలిగింది.

బహుశా వంటమనిషి లేచినట్టుంది.

"పద" లక్కీ.

వీధిలో కారు మెల్లగా రాలిన ఎర్రని పూవుల రహదారిలో పరుగిడ సాగింది. మెయిన్ రోడ్డుపైకి రాగానే పక్కనేవున్న పెట్రోల్ బంక్‌లోకి తీసుకెళ్ళాడు.

టాంక్‌ఫుల్ చేయించాడు.

లక్కీ పదివేలు తీసి గోపాల్‌కిచ్చింది.

కారు కదిలింది.

ఎక్కడికెళ్ళాలో చెబుతుందని ఒక చెవి లక్కీవైపే ఉంచాడు. కళ్ళు, మరో చెవి ట్రాఫిక్ వైపు ఉంచాడు.

"కాశీకి పద" లక్కీ.

తన జీవితంలో లక్కీ అన్న ఈ ఒక్క మాటే గోపాల్‌కి అర్థం కాలేదు. సరిగా విన్నానో.. లేదో అనుకున్నాడు.

"మేడమ్" ఆ పలుకులో ఎక్కడికెళ్ళాలో మరోసారి చెబితే బాగుండుననే ధ్వని.

"కాశీ.. అదే వారణాసి.. అదే బనారస్" అర్థమయిందా? " అన్నట్టు చెప్పింది.

"మేడమ్ సరే" అన్నాడు గాని 'కాశీ'కి ఎందుకో అర్థం కాలేదు.

దృష్టి రహదారివైపే ఉంది.

మరో ఆలోచన రానివ్వని గోపాల్ కాస్త ఆలోచించి వదిలేశాడు.

చూపుల్ని రహదారిపై పరిచాడు.

కారు సిటీ అవుట్‌స్కర్ట్స్ దాటేసరికి ఏడు గంటలయింది.. సూర్యుడు కారువెంబడే ప్రయాణిస్తున్నాడు, పెద్ద గోళాకారంతో అద్భుతంగా ఉన్నాడు. పిట్టలు సూర్యగోళానికి అటుఇటు తిరుగుతున్నాయ్.

రహదారి పక్కనున్న పొద్దు తిరుగుడు తోటపై సూర్యకాంతి పసుపుపచ్చని పుష్పాల్లో చొచ్చుకుని కళ్ళని మరింత పెద్దవి చేసి చూసేలా విరగబూసినయ్.

తెల్లార్లూ కురిసిన మంచు బిందువులపై సూర్యకిరణాలు పడి ఆకుల్లో ఇంద్రధనుస్సు గుడ్లు పొదిగినట్లు మిలమిలలాడుతున్నాయ్. ఓహ్..! ఇంత అందమైన లోకాన్ని మరచి మన జీవితకాలాన్ని గదుల్లో వుంచి కనురెప్పలకి తాళాలు బిగించి జీవిస్తున్నామనిపించింది లక్కీకి..

కారు ప్రయాణిస్తూనే ఉంది.

"ఏదైనా ఓ చిన్న హోటల్ దగ్గర ఆపు. టిఫిన్ తిందాం.. గోపాల్" అంది లక్కీ.

"మేడమ్" పదినిముషాల్లో ఓ పల్లెటూరి రోడ్డు పక్కన కారు ఆపాడు.

"మీకు ఏం తీసుకురావాలి మేడమ్? " గోపాల్.

"హోటల్లోకి వస్తా.. పద" లక్కీ.

కారు దిగి ముందుకెళ్ళి ఖాళీగా ఉన్న టేబుల్‌ని చూపించాడు గోపాల్.

హోటల్ చుట్టూ పరికించింది.

పల్లె వాతావరణం.

అందరూ తననే చూస్తున్నారు.

తను చూస్తే చూపుల్ని పక్కకు తిప్పుకో

వడం లేదు.

దొంగచూపుల నగరం గుర్తొచ్చింది.

చూసినపుడు తమ చూపుల్ని పక్కకు తిప్పుకోవడం, తను చూడనపుడు తననే చూస్తూ ఉండడం.. అటువంటి దొంగనాటకాలు ఏమీ తెలియని పల్లె వాతావరణం.. ఎవరో.. ఏమిటో.. అనే భావన వారి చూపుల సారాంశం చెబుతోంది.

సర్వర్ కం ఓనర్ వచ్చి టేబుల్ దగ్గర నిలబడ్డాడు.

అతని కళ్ళలో తృప్తి అగుపిస్తోంది.

"ఏమున్నాయ్? " లక్ష్మి.

"దోసె.. పూరి.. మిర్చి. బజ్జి ఉన్నాయమ్మ" అన్నాడు.

చుట్టూ చూసింది.

ఇంట్లో వేసుకునే దోసెల్లాగున్నాయి. దానికి మిర్చి జోడించి తింటున్నారు..

బావుందనిపించింది.

"నాకు దోసె.. మిర్చి. బజ్జి" అంది.

ఓనర్ హుషారుగా తన భార్య వేస్తున్న దోసెల దగ్గరికెళ్ళాడు.. పక్కనున్న ప్లేటు శుభ్రంగా తుడిచి.. దానిపైన ఓ కాగితం పరిచి మూడు మిర్చి బజ్జీలు వుంచాడు.. పెనం నుంచి తీసిన దోసెను అందులోకి వేయమని భార్యవైపు ప్లేటు చాచాడు, రెండో దోసెను కూడా వేపించుకుని తీసుకుని లక్ష్మి ముందు ఉంచాడు.

నీళ్ళ గ్లాసులుంచి నీళ్ళు పోస్తూ.. ఏదో ఆలోచన తట్టినవాడై..

"అమ్మగారు! మీరు బాటిల్ నీళ్ళు తాగుతారు కదా! ఈ నీళ్ళు సేతులు కడుక్కునేకి ఉంచండి" అన్నాడు.

లక్ష్మి మళ్ళీ చుట్టూ చూసింది.. ఏ ఒక్కరి దగ్గర మినరల్ వాటర్ బాటిల్ లేదు. అందరూ మగ్గులోంచి గ్లాసులోకి వంచుకునే నీళ్ళు తాగుతున్నారు.

చిన్నప్పుడు చెరువులోని బురదనీరు ఎర్రగా ఉన్నా తాగడం గురుతొచ్చింది..

"ఫర్లేదు.. ఈ నీళ్లే తాగుతా.. మినరల్ వాటర్ అవసరం లేదు" అంది.

"మీలాంటి వాళ్లు ఈ నీళ్లు తాగితే.." అనబోయాడు.

నవ్వుతూ "ఇంతమంది రోజూ తాగుతున్నా రాని రోగాలు నేను ఓ పూట తాగితే రావులే పెద్దాయనా.." అంది లక్ష్మి. ఆ మాటకు మెచ్చుకోలుగా మన ఆడబిడ్డే అన్నట్టు చూశారు పల్లెవాసులు.

దోసె వడ కాఫీలయ్యాక గోపాల్ బిల్ చెల్లించాడు. ఇరవై ఆరు రూపాయలైంది.

లక్ష్మి గమనించింది.

'కాఫీ'డే గురుతొచ్చింది.

కాఫీ తాగాలనే కోరిక పుడితే డబ్బున్న వాళ్లు కార్లు వేసుకుని పది పదిహేను కిలో మీటర్లు వెళ్లి కేవలం కాఫీకి.. అయిదువందలు చెల్లిస్తారు. కారు పెట్రోలు, ఒక కాఫీ కలిపి వేయి రూపాయల పైమాటే.. ఈ లెక్కన ఇక్కడ ఒక వ్యక్తి టిఫిన్ కాఫీలతో మూడు నెలలకు సమానం.

జీవన విధానంలో ఆర్థిక అంతరం గమనిస్తే 'మనిషి'కి నిర్లిప్తత కలుగుతుంది.

లక్ష్మికి నవ్వొచ్చింది.

కారు సాగుతూనే ఉంది.. దారి పక్కన పల్లెజనం.. వాళ్ల దుస్తులు.. పొలాలు, రహదారి మధ్యలో నడుచుకుంటూ ఒంటరిగా పోతున్న పిచ్చివాడు.

గమనిస్తూ పోతుంటే చాలు అలా.. చూస్తూ సాగుతుంటే చాలు..

జీవితానికి కాలం జీవితకాలానికి తక్కువ వస్తుందనిపిస్తుంది.

మధ్యాహ్నం రెండు గంటలవుతోంది.

ప్రయాణం, అలలు లేని ఏటవాలు నదిలో పడవై ప్రశాంతంగా సాగుతోంది.

నాగపూర్ మహారాష్ట్రలోని ఓ చారిత్రాత్మక పట్టణం.

ప్రపంచంలో ప్రతి ప్రదేశం చారిత్రక తను సంతరించుకున్నదయే వుంటుంది. కొన్నింటికి రికార్డ్సు లేక మౌనంగా వుంటాయి. మరికొన్నింటికి కోటలు,

యుద్ధాలు, రాజకీయాల రికార్డ్ గురుతులతో తలపులకొస్తుంటాయి.

"గోపాల్.. ఓ పనిచేద్దాం.. ఈరోజు ఇక్కడే విశ్రాంతి తీసుకుని ఉదయం నాలుగింటికే మనం బయలుదేరుదాం.. ఓ మంచి లాడ్జ్‌ని విచారించు" లక్ష్మీ.

"మేడమ్" పదిహేను నిమిషాలలో ఓ డీసెంట్ లాడ్జ్‌లోకి కారు పార్క్‌చేసి గదిలోకి వచ్చి 'ఏం కావాలో' అడగాలని మౌనంగా నిలుచున్నాడు గోపాల్.

"నాకు ఓ నార్త్ మీల్స్ పంపించు.. నీకు ఏం కావాలో తీసుకో.. నేను గదిలో రెస్టు తీసుకుంటాను.. లాడ్జ్ మేనేజర్‌కి డబ్బులిచ్చేసెయ్" అని బ్యాగ్‌లోంచి అయిదు వందల నోట్లు తీసి ఇచ్చింది.

గోపాల్ వెళ్లిపోయాడు.

భోజనం రాగానే తిని పడుకుంది లక్ష్మీ.

గదిలో ఎ.సి. చిన్నగా శబ్దిస్తోంది.

గది పైకప్పు కేసి చూస్తోంది.

చిన్నప్పటి నుండి సామాన్యమైన అనుభవాల జీవితంతో గడిచిన కాలం సిటీకి రాగానే ఒక్కసారిగా వేయింతల వేగంతో అనుభూతులకి తావివ్వని అనుభవాలతో, అనూహ్య మార్పులతో, అనేకానేక పరిచయాలతో ఎన్నో మలుపులు తిరిగింది.

మనుషుల మనస్తత్వాల్ని గమనిస్తే డబ్బు చుట్టూ కొలతలు గీసుకుని ఆర్థిక పరిధిలోనే పరిభ్రమణం చేస్తుండటం.. అందరిలో ఆ క్రమమే ఎక్కువగా సాగిందని తెలుస్తోంది.

ఒకరి కోరికలకు ఒకరు మర బొమ్మలుగా తయారయి ప్రవర్తించిన తీరులో యాంత్రికతే ఎక్కువగా అగుపించింది.

తను తెలియనితనంలో ఒకరి చేతిలో ఒకసారి కీలుబొమ్మయింది.

తదుపరి తనను మరబొమ్మగా చేసుకునే క్రమంలో తనే అందరిని నియంత్రించే కీ అయింది.

ఎంత ఆలోచించినా, ఎన్ని కాలాలు గడిచినా ఆడదాని బతుకు మగవాడి పిడికిట్లో

**కొత్తగాలి...**

**ఫలితం వచ్చేదాకా**
**ప్రయత్నం మానకు**
**కంపనుకున్న ట్రంప్**
**అమెరికన్లకు ఇంపవలేదా కడకు!**

– చిత్తూరు సాయిప్రసాద్‌రెడ్డి,
చింతలగూడెం, ప.గో. జిల్లా

గాజుబొమ్మగానే ఉంది.

మనస్తత్వాన్ని బట్టి షోకేసులో బొమ్మగానో, జననం నుంచి మరణం దాకా.. ఇంట్లో అమ్మగానో, బజారులో అంగడి బొమ్మగానో, ప్రియుడి పిడికిట్లో ఆటబొమ్మగానో నలుగురి మగాళ్ల నడుమ మట్టిబొమ్మగానో ఆడదాని జీవితం సాగుతోంది.

కొన ఊపిరి నుంచి తుది శ్వాస వరకు కొనసాగుతోంది.

కాలమెంత సాగినా.. మారినా ఆడజన్మ ఇలా కొనసాగుతూనే ఉంది.

ఆలోచనకి తావివ్వని స్థితినుంచి వాస్తవ పరిస్థితుల్ని గమనిస్తూ నిదురోయింది.

లక్ష్మీకి మెలకువ వచ్చేసరికి సాయంత్రం ఆరయింది.

కిటికీ దగ్గరికెళ్లి కర్టెన్ తొలగించింది.

సూర్యాస్తమయం ఎర్రని పండులా సూర్యుడు చూపుల దిగంతాల్లో జారిపోతున్నాడు. సూర్యోదయం.. సూర్యాస్తమయం.. జననం.. మరణం.. తిరిగి సూర్యోదయం మరల సూర్యాస్తమయంగానే జీవి మరణమనే చీకట్లో మునుగుతూ జననమనే వాకిట్లో తేలుతున్నాడనిపించింది.

సూర్యునికి జీవికి తేడా లేదనిపించింది.

లక్ష్మీ దొండపండు పెదాలపై గుండుమల్లెపువ్వులాంటి నవ్వు విరిసింది.

ఉదయం నుంచి ఫోను రింగవుతూనే ఉంది.
లిఫ్ట్ చేయడం లేదు.
లిస్ట్ చూడడం లేదు.
గెస్ట్‌హౌస్ గది శుభ్రంగా ఉంది.
అగరొత్తుల వాసన పొందాలనుకుంది.
రిసెప్షన్‌కు ఫోన్ చేసింది.
బాయ్ వచ్చాడు.
అగర్‌బత్తి, అగ్గిపెట్టె తెమ్మంది.
"ఔర్.." ఇంకా ఏమైనా చెబుతుందేమో నని చూస్తున్నాడు బాయ్.
"బస్.. ఏక్ గ్లాస్ దూద్ ఔర్ ఏక్ అచ్ఛా ఆపిల్" అంటూ డబ్బిచ్చింది.
బాయ్ వెళ్లిపోయి పది నిమిషాల్లో వాటితో వచ్చాడు.
ఆపిల్‌ని కడిగి ప్లేట్‌లో ఉంచాడు.
వేడి పాలగ్లాసుపై మూతవుంచి వెళ్లిపోయాడు. నాలుగు అగరొత్తులు తీసి అగ్గిపెట్టెతో వెలిగించింది..
పొగ మెల్లగా నాట్యం చేస్తోంది గాలిలో..
బూడిద తెల్లగా రాలుతోంది నేలపై..
అగరొత్తులు ఎక్కడ ఉంచాలో తెలియక టీపాయ్ పైని ఖాళీ యాష్ ట్రేపై ఓ వారగా వుంచింది.
యాష్‌ట్రేలో అంతకు మునుపున్న కొద్దిపాటి సిగరెట్ బూడిదకు, ప్రస్తుతం రాలుతున్న అగరొత్తుల బూడిదకు తేడా అగుపించడం లేదు. ఒకటి సువాసనతో మరొకటి ఘాటువాసనతో చివరికి రెండూ భస్మంగానే మిగులుతాయి.. మనుషులు అంతే.. జీవిత సత్యం ప్రతిచోట.. ప్రతిక్షణం.. అగుపిస్తూనే ఉంటుంది.
గమనిక.. ఎరుక.. వుంటే సత్యం బోధపడుతూనే ఉంటుంది.
తనలో తనే నవ్వుకుంది.
ఆపిల్ తీసి కొరికింది.. పళ్లగాట్లు పడి చిన్నముక్క నోటిలోకి తీసుకుంది. నములుతూ.. నములుతూ.. మధ్యలో పాలు సిప్ చేస్తూ కూచుంది.
అగరొత్తుల పొగ..
ఆపిల్ పండు..
వేడివేడి పాలు..
అరగంట గడిచింది.. తన్మయత్వంతో నిశ్చలంగా ఓ అనిర్వచనీయమైన ట్రాన్స్‌లోకి వెళ్లిపోయింది.
డోర్ నాక్ అయింది.
"కమిన్" అంది.
"మేడమ్..! ఖానాకేలియే ఆర్డర్ దీజియె.." ఇదివరకొచ్చిన బాయ్.
"బస్.. హోగయా.. అబ్ కుచ్‌భీ నై చాహియె.." అంది ఖాళీ అయిపోయిన పాలగ్లాసు వంక చూస్తూ..
బాయ్ వెళ్లిపోయాడు.
పరుపుపై పడుకుని కళ్లు మూసుకుంది.
తెలవారుఝాము మూడు గంటలకు మెలకువ వచ్చింది.
తలంటి స్నానం చేసింది.
తలవెంట్రుకల్ని తడితోనే వదిలేసింది.
పసుపు పచ్చని చీర కట్టింది.
సరిగ్గా నాలుగు గంటల సమయంలో తలుపు తెరిచింది.
ఎదురుగా.. గోపాల్..
ఇరువురు బయలుదేరారు..
తెల్లవారుఝామున నాగపూర్ వీధుల్లోని షాపులు, షట్టర్లు మూసుకుని నిదురబోతున్నాయి. వాటిముందు భిక్షగాళ్లు చినిగిన దుప్పట్లలో నిద్రబోతున్నారు.. వీధుల్లో దీపాలు మాత్రం మేల్కొని వెలుగుని పరుస్తున్నాయి.. కారు మెల్లిగా రహదారిలో పడవై సాగుతోంది.
కారు విండోస్‌లోంచి వెలుతురు చీకటి మిశ్రమాన్ని లక్ష్మి కళ్లతో ఆస్వాదిస్తోంది.
మంచుతెర పలుచగా అగుపిస్తోంది.
జీవితంలో చీకటి వెలుగుల కాలాన్ని మనసు మాయ పొరలపై సుఖదుఃఖాల చిత్రికల్ని చిత్రించుకుని బాధపడేవారే లోకంలో ఎక్కువగా అవుపిస్తుంటారు.

ఎప్పటికప్పుడు ఎక్కడికక్కడ జీవితాన్ని స్పర్శిస్తూ జీవిస్తూ సాగడం జరిగింది.

లక్ష్మీ పెదాలపై నవ్వు జారింది.

కారు సాగిపోతూనే ఉంది.

నాగపూర్ దాటింది.

రహదారి పక్క 'కాశీ 613 కిలో మీటర్లు' అన్న బోర్డు అగుపించింది.




సాయంకాలం సమయంలో కాశీ ప్రధాన వీధిలోకి కారు ప్రవేశించింది.

ఎక్కడ చూసినా జనాలు.

నీళ్ళు చిలకరిస్తే నేలపై ఒక్కనీటి చుక్క పడనంత సమూహాలతో దేశదేశాలనుంచి వచ్చిన ప్రజలు.

ఎక్కడికెళ్ళాలో తెలియక కారును ఓ టీస్టాల్ ముందు ఆపాడు గోపాల్..

గంగ వొడ్డున ఏదైనా మంచి గెస్ట్‌హౌస్ వుందేమో కనుక్కొమ్మని గోపాల్‌కి చెప్పింది లక్ష్మీ.

లక్ష్మీకి కారులోకే టీ తెచ్చిచ్చాడు.

టీస్టాల్ ముందు తను నిలబడి గెస్ట్ హౌస్ గురించి విచారించాడు.

రాహుల్ గెస్ట్‌హౌస్‌కు కారు కదిలింది.

గంగానదీతీరంలో ఎందరో రాజులు తమ విశ్రాంతి భవనాల్ని నిర్మించిన వైనం మనకు తెలుస్తుంది. అందులో ముస్లిం హిందూ రాజులిరువురూ అగుపిస్తారు. కాశీక్షేత్రంలోని గంగానదికి ఎంతో ప్రాముఖ్యతనిచ్చారు. వారణాసిలో గంగా తీరంలో ప్రతిఒక్కరు తమ సంకేతానికి చిహ్నంగా మహళ్లు నిర్మించినవైనం మనకు ఈనాటికీ తెలుస్తుంది.

గంగానది ఒడ్డున అద్భుతమైన కట్టడాల వరుసక్రమం అగుపిస్తుంది.

కాశీ, వారణాసి దాదాపు పదిహేను పేర్లతో భారతదేశ చరిత్రలో కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలి యుగం.. ఏ యుగాల చరిత్రను లిఖించినా కాశీ గంగలను ప్రస్తావించనిదే అది సంపూర్ణత సంతరించుకోదు. కారణం కృత యుగంలోని హరిశ్చంద్రుడైనా, త్రేతాయుగంలోని రాముడైనా, ద్వాపరయుగంలోని కృష్ణుడైనా, కలియుగంలోని ఏ రాజైనా కాశీని దర్శించక మానలేదు. గంగలో మునగకపోలేదు. కృతయుగానికి చెందిన ఆనవాళ్ళు మనకు కేవలం వారణాసిలోనే లభ్యమవుతాయి.

హరిశ్చంద్రుణ్ణి, రాముణ్ణి, కృష్ణుణ్ణి గురించి చరిత్రకు అందని పౌరాణిక కృతులలోని పాత్రలని కొట్టిపారేద్దామంటే వీళ్ళందరూ కాశీని దర్శించడం గంగను సందర్శించడం మనకు వాస్తవంగా అగుపిస్తుంది. దేశవిదేశ చరిత్రకారులూ, కవులూ, రచయితలూ గంగను స్పర్శించిన విషయం యదార్ధంగా కనిపిస్తుంది.

నాటినుంచి నేటికీ దేశంలోని ప్రతిరాష్ట్రం నుంచి వచ్చిన వారితో వారణాసి అలరారుతోంది. కేరళ, మలయాళీ, తమిళ, ఆంధ్ర, కర్నాటక, మహరాష్ట్ర, బీహారి, బెంగాలి, సిక్కు, కాశ్మీరి ఒక్కటేమిటి ఎన్ని భాషలున్నాయో, ఎన్ని జాతులున్నాయో అన్ని కాలనీలుగా అలరారుతున్నందునే నాడు బ్రిటీష్ పాలకులు వారణాసి అలియాస్ కాశీని దేశంలోని అన్ని భాషల రసాలు కలసిన ప్రాంతంగా గుర్తించి, అన్ని ప్రాంతాల రసాలతో తయారు చేసిన ప్రాంతమని అర్థం వచ్చేట్టు 'బనారస్'గా పేరు పెట్టారంటారు.

రాహుల్ గెస్ట్‌హౌస్ ముందు కారు ఆగింది. లక్కీ కారు దిగి రిసెప్షన్ దగ్గరి కెళ్ళింది.

కార్తీకమాసం రావడానికి పదిరోజు లుంది గనుక గెస్ట్‌హౌస్ ఖాళీగానే వుంది.

కార్తీకపౌర్ణమి రోజున కాశీ దేశవిదేశీ భక్తులతో నిండిపోతుంది. నగరమంతా దీపాలతో, విద్యుద్దీపాలతో కార్తీక దీపాల వెలుగులు సంతరించుకుని మిలమిల తళ తళ కాంతులీనుతుంది.

"నేమ్.. ప్లీజ్.. హౌమెనీ డేస్.. యూఆర్.. ఫ్రం" అంటూ రిసెప్షనిస్ట్ అడు గుతున్న దానికి లక్కీ చెప్పగానే..

"ఓ.. ఆంధ్రప్రదేశ్ నుంచి వచ్చారా!" అని స్పష్టమైన తెలుగులో మాటాడించింది రిసెప్షనిస్ట్.

"మాది.. హైదరాబాదే..!" అంటూ తన పేరు గౌతమి అని చెప్పింది.

రిజిస్టర్‌లో లక్కీ పర్టిక్యులర్స్ విత్ ఐడెం టిటీకార్డ్ జిరాక్స్ తీసి పిన్ చేసింది.

"మేడమ్ ఎన్ని రోజులుంటారో.. అప్రా క్స్‌మెట్‌గా చెప్పగలరా? " అంది గౌతమి.

"శాశ్వతంగా.." అంది లక్కీ నవ్వుతూ.

"అలా కాదు మామ్.. మేము.. అడ్వాన్స్ బుకింగ్ చేసేవాళ్లను దృష్టిలో వుంచుకొని అడుగుతుంటాం.. మీరెన్ని రోజులున్నా అభ్యంతరం లేదు.." తనూ నవ్వుతూ అంది గౌతమి.

"ప్రస్తుతం కార్తీక పౌర్ణమి వరకు ఎవరికీ నేనున్న గదిని కేటాయించకండి.. ఆ తరు వాత నేను చెప్పలేను.." ఆగింది లక్కీ.

"ఓకే.. మేడం.. యు ఆర్.. సో క్యూట్.. సో నైస్.. ఈ గెస్ట్‌హౌస్ మీదేన నుకోండి" నవ్వుతూనే చెప్పింది గౌతమి.

రాహుల్ గెస్ట్‌హౌస్‌లో గదిని చూపిం చాడు గెస్ట్‌హౌస్ బాయ్.

నిశ్శబ్దమైన వాతావరణంతో గది శుభ్రంగా వుంది.

లగేజ్‌తో పాటు గోపాల్ వచ్చాడు.

"ఓకే.. మేడం" బాయ్.

వందనోటు తీసి బాయ్‌కిచ్చింది లక్కీ.

తలవంచి నమస్కరించి వెళ్ళిపోయాడు.

"నేను ఫోన్ చేస్తాను గోపాల్" లక్కీ.

గోపాల్‌కి అర్థమయి కారు పార్కింగ్ చేయడానికి వెళ్ళిపోయాడు.

లక్కీ ఫ్రెషప్ అయింది.

గంగానది వ్యూ అగుపించేట్టు కట్టిన గెస్ట్‌హౌస్.. బాల్కనీ తలుపు తెరిచింది. అద్భుత దృశ్యం.

నీలికోక గాలిలో రెపరెపలాడినట్టు గంగానది నేలపై వొంపులు తిరిగి ప్రవహి స్తోంది. దీపాల వేళ నదిపైని గాలి నిశ్చ లత్వాన్ని సంతరించుకుంది. లక్కీ వద నంపై నుంచి దవనం, మంచు కలగలిపిన సువాసనతో పవనం వీచింది.

లక్కీ రెండు కళ్ళు గంగను నింపుకున్న కమండలాలయ్యాయి.

ఎన్నో నదులు.. మరెన్నో నీళ్ళు చూసి వుండొచ్చుగాని గంగను చూసిన కళ్ళు మాత్రం గుండెను కదలాడేలా చేశాయి.

ప్రవహించే నదిని చూస్తూ నిలబడింది.

గంగానది ఒడ్డున క్రమక్రమంగా దీపాలు వెలిగించడం మొదలయ్యింది.

చీకటిపై వెలుతురు రేకులు విరియడం ఊపందుకుంది.

నదిలో చిన్నచిన్న దీపాలు మెల్లిగా కదు లుతున్న దృశ్యం రానురాను గంగజలంతో కాకుండా దీపశిఖల కాంతుల అలలతో కద లిపోతున్న వైనం అద్భుతంగా ఉంది. కన్నులు కాంతులతో నింపిన మిన్నుల య్యాయి.

ఆకాశంలోని నక్షత్రాల పాలపుంత నేలపై కదులుతున్నట్టుంది.

గదిలో ఫోను మోగింది.

లక్కీ ఆ దృశ్యాన్ని చూస్తూనే ఫోనున్న చోటికెళ్లి ఫోను లిఫ్ట్ చేసింది.

"మేడం.. రిసెప్షన్ నుంచి గౌతమిని"

"చెప్పమ్మా.." లక్కీ.

అ
క్ష
రం

మనిషి సామాజిక
వికాసానికి తోడ్పడేవి
మంచి పుస్తకాలే

– కందుకూరి వీరేశలింగం



"పదినిముషాల్లో గంగాహారతి ఇస్తారు. మీరు మొదటిసారి వచ్చారుకదా! అందుకే చెప్తున్నాను" గౌతమి.

"థాంక్యూ.." అంది లక్ష్మీ.

"మీరు గెస్ట్‌హౌస్ వెనుకనుంచి వెళితే రెండునిముషాల్లో చేరుకుంటారు" గౌతమి.

"అలాగే.. బయలుదేరుతాను" లక్ష్మీ ఫోను పెట్టేసింది.

లక్ష్మీ వెంటనే గది తలుపు లాక్‌చేసి రిసెప్షన్ దగ్గరికి వచ్చి అమ్మాయికి కీ ఇచ్చింది.

రిసెప్షన్‌లో మరో ఇద్దరున్నారు.

గౌతమి కీ డ్రాలో వేసి రిసెప్షన్ ఛాంబర్ బయటికొచ్చి లక్ష్మీ దగ్గరకొచ్చింది.

లక్ష్మీ కళ్ళతో అడిగింది.

ఆ అమ్మాయి చూపులతోనే దారి చూపు తానని తెలిపి లక్ష్మీ వెంట నడిచింది.

గెస్ట్‌హౌస్ వెనకద్వారం వైపునుంచి రెడ్ కార్పెట్ పరచిన మెట్ల మీదినుంచి గంగా నదివైపు నడుస్తూ కుడిపక్కకు తిరిగారు.

గంగానదిలో పడవలు నీటిపై కాకుండా దీపాల కాంతులపై నిలిచివుండటం మనో హరదృశ్యంగా అగుపిస్తోంది.

ఘాట్ దగ్గరికి చేరుకున్నారు.

మెట్లమీద ఇరువురూ కూచున్నారు.

సమయం సాయంకాలం ఏడుగంటల పదిహేను నిముషాలు.

వారణాసి సకల దేవతలు కొలువున్న పవిత్ర స్థలం.

గంగాహారతి సమయం ఆసన్నమైంది.

శంఖం ఊపందుకుంది.

ఢమరుకం ఢమఢమ మోగింది.

గంటల గణగణలతో పరిసరం ఓంకార నాదమయింది.

ఒకపీఠంపై కూర్చున్న భక్తుడు 'ఓం' అంటూ శ్లోకం అందుకున్నాడు.

హారతి ఇచ్చే ఏడుగురు భక్తులు కాషా యధారులై అగరొత్తులతో పూజాకార్యక్ర మానికి శ్రీకారం చుట్టారు.

అరచేతుల్లోని అగరొత్తుల్ని శ్లోకాలకు అనుగుణంగా వివిధకోణాల్లో తిప్పి ధూపం పాత్రలను అందుకున్నారు.

గణగణ గంటల మోతల నడుమ శ్లోకా లకి అనుగుణంగా ధూపవిన్యాసంతో పరి సరాలు నిండాయి.

తదుపరి అఖండ జ్యోతులు వెలుగుతుం డగా గంగాహారతి మొదలయ్యింది.

ఒక్కోజ్యోతి దీపశిఖలతో వెలిగిపోతున్న మంచు శిఖరమై పోయింది.

చివర్న పూరించిన భక్తుని శంఖారా వంతో గంగాహారతి ఆరోజుకి ముగిసింది.

దశాశ్వమేధ ఒడ్డునుంచి భక్తులందరూ ఒక్కొక్కరే లేచి అక్కడుంచిన హారతిని కళ్లకద్దుకొని కొందరు నదివైపు మరికొం దరు తమ గదివైపు.. కదలసాగారు.

నలభై అయిదు నిముషాల గంగాహారతి ముల్లోకాలకి ఇచ్చే మంగళహారతి.

ధర్మశాలలో సాధువులు ఆకాశానికేసి చూసి చేతులతో చేసే సంజ్ఞలు, వారణా సిలో గంగా హారతిలో చేసే విన్యాసాలు ఒకటిగానే తోస్తుంది.

కారణం

లోకకళ్యాణార్థమై గ్రహాంతరవాసులతో సృష్టి గరిమనాభిని సమస్థితిలో ఉంచడా

నికి చేసే విశ్వరూప విన్యాసం.

లక్ష్మీ ఈ లోకంలో లేదు.

ఒక ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయింది.

ఒక వాతావరణంలో మనిషిలోని తర్కం మటుమాయమవుతుంది. తనే మాయమవుతాడు. తనులేని స్థితిలోకి తనకు తెలియకనే వెళ్ళిపోతాడు. సందర్భం.. సమయం.. ఏదైనా సరే!

గంగ.. నీరు..

ప్రాణుల ప్రాణప్రద జలం.

అన్నం పరబ్రహ్మ స్వరూపం.

జలం పరంజ్యోతి స్వరూపం.

గౌతమి లక్ష్మీని చూసింది.

లక్ష్మీ కాసేపటికి గౌతమిని చూసి పైకి లేచింది. గెస్ట్‌హౌస్‌కు వచ్చేవరకు మౌనం గానే నడిచారు.

రిసెప్షన్‌లో కీ తీసి ఇచ్చింది గౌతమి..

సమాధానంగా ఓ చిన్న నవ్వు పెదాల నుంచి జారవిడిచింది లక్ష్మీ..

లక్ష్మీ తనగదికెళ్ళి నీళ్ళు తాగి మంచంపై పడుకుంది.

రేయంతా.. నిదుర.. మెలకువలు కాని ఓ రకమైన స్థితిలో గడిపింది.

ఉదయం ఎనిమిది గంటల సమయం.

మొబైల్ తీసి గోపాల్‌కి రింగ్ చేసింది.

అయిదు నిముషాల్లో లక్ష్మీ ముందు గోపాల్ నిలబడ్డాడు.

"చూడు.. గోపాల్.. ఇక నువ్వు బయ లుదేరవచ్చు. ఫోర్డుకారును దాసుకిచ్చె సెయ్.. శాశ్వతంగా- మనం వచ్చిన కారు ను నువ్వు తీసుకో. అంతేకాదు నేనున్న ఇంటిని నీ భార్య పేరుమీద రాశాను.. ఇవిగో సేఫ్‌లాకర్ తాళాలు.. అపార్ట్‌మెం ట్స్‌ని మన ఇంట్లో పనిచేసే వారందరికి రిజిస్టర్ చేయించాను.. ఫాంహౌస్‌ని అనా థాశ్రమానికి.. తదితర డబ్బుదస్కం ఆ అనాథాశ్రమ ఖర్చులకు.. అన్నీ సవ్యంగా చేశాను.. వాటికి అనుగుణమైన పత్రాలు నా డ్రాలో వుంచాను. అన్నింటిని అందరికి సవ్యంగా అప్పచెప్పు..

ఇదిగో 'డ్రా' తాళం చెవి.. ఒక్క విషయం.. నా జీవితాన నేనెలా వున్నా.. నన్ను వెన్నంటి వున్న నిన్ను.. నీ ఆరా ధనా భావానికి.. అంకితత్వానికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను. డబ్బుకోసమే గాక నాకోసం పని చేశావు.. ఏ పనైనా నీ దనుకునే చేశావు.. మరొక్కపని నాకోసం చెయ్.. చివరిపని.. నేనెక్కడికెళ్ళింది.. ఏమైపోయింది.. మాత్రం ఎవరికీ చెప్పకు! ఎవరెంత ప్రశ్నించినా.. నీవు చెప్పవని తెలుసు.. ఎక్కడికి వెళ్ళిందో.. అని లోకం వారం పదిరోజులు ఆరాతీస్తారు. అంతే.. ఆ తరువాత మరిచిపోతారు.. నువ్వు నాకు అందించినంత సహకారం.. నా జీవితం మొత్తం వెతికినా ఎవరూ కాన రారు.. ఇకనువ్వు.." లక్ష్మీ.

గోపాల్ లక్ష్మీ కాళ్ళముందు కూచుని ఎక్కి ఎక్కి ఏడుస్తున్నాడు.

లక్ష్మీ పాదాల్ని చూస్తూ తన్మయత్వ మనస్కుడై కూచున్న గోపాల్ తలపై కన్నీ టిబొట్లు రాలడంతో ఈ లోకానికొచ్చాడు.. మెల్లిగా లేచి లక్ష్మీ పాదాల్ని చూస్తూ వెనక్కి వెనక్కి అడుగులు వేసుకుంటూ గదినుంచి నిష్క్రమించాడు.

లక్ష్మీ ముఖాన్ని ఎప్పుడో కొత్తలో ఒకటి రెండుసార్లు చూచాడు. అంతే అప్పటి నుంచి లక్ష్మీ మాటనే విన్నాడు. లక్ష్మీ ఆదే శాన్ని శిరోధార్యంగా చేసుకున్నాడు.

నాడు నేడు ఏనాడూ లక్ష్మీ పాదాలే వేయి వదనాలుగా దర్శిస్తూ వస్తున్నాడు.

లక్ష్మీ ఒక దీర్ఘ శ్వాస విడిచింది.

సుదీర్ఘ జీవితంలో శాశ్వతమంటూలేని ఒక విషయానికి శాశ్వత తెరపడింది.

గదిలో బెల్ మోగింది.

తలుపు తెరిచిచూస్తే గౌతమి.

లోనికి రమ్మని గౌతమి కళ్ళలోకి చిరు నవ్వు రువ్వింది లక్ష్మీ

ఎందుకో ఏమో ఒక్కోసారి ఒక్కొక్కరు

పరిచయం కావడంతోటే అంకితమవడం జరుగుతుంటుంది.

"అక్కా.." గౌతమి.

లక్కీ కనుబొమలు ముడిపడలేదుగాని కనురెప్పలు విశాలమయ్యాయి.

చెప్పమన్నట్టు.. చూపులు విరిశాయి.

"ఏంలేదు.. ఒంటరిగా ఎందరో వస్తుం టారుగాని నిన్నటి నుండి గమనిస్తున్నా.. ఒంటరిగా వున్నా.. దిగులు.. భయం ఏమీ లేనితనంతో మీరు వున్న తీరు నన్ను విపరీతంగా ప్రభావితం చేస్తోంది. అందుకే వచ్చాను. డిస్టర్బ్ చేయడంలేదు కదా!" స్పష్టంగా మాటాడింది గౌతమి.

"అదేం లేదు. నువ్వు నాకర్థమయ్యావు" అంది లక్కీ..

"థాంక్స్.."

నవ్వులు చిన్నపిల్లవాడి చేతుల్లో పువ్వుల్లా కాంతులీనాయి.

"కాశీ అంతా చూడాలి అనుకుంటే కాబ్‌ను బుక్ చేస్తా అక్కా" అంది చాలా సేపటి దాకా మౌనం రాజ్యమేలింది.

"అవసరం లేదు.. నేనే ఒంటరిగా.. తిరుగుతా.. ఇక్కడ రాత్రి అనేది చీకటి అనేది వుండదుకదా! కాశీ అంటే వెలుగు కదా!" అంది లక్కీ.

"నిజమే అక్కా.. మణికంఠ ఘాట్.. హరిశ్చంద్రఘాట్‌కి వెళ్ళే దారంతా పగలూ రేయి 'రామ్ నామ్ సత్యహై' అంటూ ప్రవాహంలా వుంటుంది.. అంతే కాదు.. ఎప్పుడూ కలవరింతల్లో పలవరింతల్లా శంభోశంకర నామాలతో గంగానది పరిస రాలు ధ్వనిస్తున్నా వారణాసి ప్రశాంతం గానే వుంటుంది.." బనారస్ విషయాలు తెలుపుతూ పోయింది గౌతమి.

లక్కీ ప్రతిరోజు రాత్రిపగలు అన్న తేడా లేక కాశీవీధుల్లో, సందుల్లో తిరగాడింది. గంగానది ఘాట్‌ల పరిసర వీధుల్లో ఏ సందుల్లో తిరిగినా మృదంగ ధ్వనులు, సుస్వరాల వీణాగానాలు, పిల్లనగ్రోవుల రా గాలు.. చిన్న చిన్న వీధిసందుల్లో తిరు గాడే గోవులు.. పాల క్యాన్‌లతో పరుగిడే మోటర్‌బైకులు.. అరవై సంవత్సరాలు వెన క్కి తిప్పితే.. ఒకనాడు అచ్చమైన పల్లెల్లో వున్న స్వచ్ఛమైన వాతావరణం వీధివీధిలో అగుపిస్తుంది. పాలు, పెరుగు, జున్ను వెన్నల సువాసనలతో నిండిన గాలి మన ముక్కుపుటాల్ని సుగంధాలతో గీటుతుం ది. అప్రయత్నంగానే నాలుకలోని నరాల్ని జివ్వుమనిలాగి తంబూరలా మీటుతుంది.

ఓరోజు మధ్యాహ్నం మణికంఠ ఘాట్‌ను చూద్దామని బయలుదేరింది.

మణికంఠ ఘాట్‌కు పదడుగుల దూరంలో ఫుట్‌పాత్ మీద ఇరువురు స్త్రీలు గాభరాగా చీరను గదిలా పట్టుకుని నిలబడ్డారు. చీర ట్రాన్స్‌పరెన్సీ వలన లోన ఎవరో స్త్రీ పడుకుని విలవిలలాడు తుంటే, మరో స్త్రీ ఆమె కాళ్ళముందు కూచుని ఏదో చేస్తున్న దృశ్యం స్పష్టంగా అగుపిస్తోంది.

లక్కీ సహజగుణంతో వాళ్ళవైపు అడుగే యబోయేంతలో "క్యావ్.. క్యావ్.." అని శిశువు ఏడుపు వినిపించింది.

లక్కీ పెదాలపై నవ్వు మొలిచింది.

ఒక జననం..

అక్కడున్న ఆడాళ్ళు తమ పనుల్లో నిమ గ్నమవడం చూసి లక్కీ అటువైపు అడుగే యడం మానుకుంది.

ప్రతికాన్పు సిజేరియన్‌తో చేసే పట్టణ నాగరికతకు అక్కడి జననం ఒక ప్రశ్నగా తలచి బిగ్గరగానే నవ్వింది.

'మంచి కాలం మంచి ముహూర్తం చూసుకొని రండి మీరు ఫలానా తేదీ నుండి ఫలానా తేదీలోపల ఏ దినంలో ఏ ఘడియలో కాన్పు చేయమంటే ఆ కాలం లోనే చేస్తాం' అనే మల్టీనేషనల్, ఇంటర్నే షనల్ ఆస్పత్రుల మాటలు లక్కీ చెవుల్లో సుళ్ళు తిరిగినయ్..

కాన్పుకు లక్షరూపాయలు వసూలు

చేయడం కళ్ళలో కనిపించినయ్..

ఒక చదువురాని మంత్రసాని నడిరోడ్డులో ఫుట్‌పాత్ మీద పురుడుపోయడం బొడ్డుకోయడం, బిడ్డను శుభ్రం చేసి తల్లికి అప్పగించడం ఆనందం కలిగించింది.

కాన్పుచేసే స్త్రీకి 'మంత్రసాని' అని పేరు పెట్టడం ఎంతో సమయస్ఫూర్తితో జనించిన శబ్దమనిపించింది.

లక్కీ మణికంఠ ఘాట్‌కి ఆలోచనలతోనే నడిచింది. ఇరవై అడుగులేసిందో లేదో దట్టమైన పొగలు మండుటెండలతో పోటీపడుతున్న మంటలు ఉవ్వెత్తున ఎగిసిపడుతున్నాయ్.

'రామ్‌నామ్ సత్య్ హై'

శవాలను ఒకటివెంట ఒకటి కాలుస్తూ.. గంగలోకి తోసేస్తూ..

భయానక దృశ్యం.

ఎక్కడ చూసినా శవాలే..

శవాలు క్యూలో వుండటం..

భారతదేశంలో శవాలు తప్ప మనుషులు 'క్యూ'లో వుండటం అసంభవమనిపించింది లక్కీకి.. అంత హృదయ విదారక దృశ్యంలోనూ.. అంత విషాద సందర్భంలోనూ.. పెదాలపై నవ్వు పూచి వెంటనే విరిగిపోయింది.

'రామ్ నామ్.. సత్య్ హై'.. రాముని నామమే సత్యము.. రాముని నామమొక్కటే సత్యము.. రామనామము వినా లోకమంతా అసత్యము.. సత్యపాలకుడు సత్యవాక్కు పరిపాలకుడు ఈ లోకంలో నాటి నుంచి నేటి వరకు రాముడొక్కడే. మిగిలినదంతా అసత్యమని.. మరణం తథ్యమనే వాక్యం.. శవాన్ని కాటికి తీసుకెళ్ళేవరకూ పూలు చల్లుతూ నినదించడం ఉత్తరభారతంలో మనకు అగుపిస్తుంది.

మణికంఠ ఘాట్‌లో శవాల్ని తగలబెడుతున్న దృశ్యాన్ని లక్కీ యమలోక ఊహాచిత్రంగా భావించింది.

మంటల్లో మండుతున్న ఒక శవం కపాలం 'ఠప్' మని పగిలింది.

## కొత్తగాలి...

**చెరువులు, నాలాలు**
**కబ్జాల పాలు**
**వరదలు బురదలు**
**పౌరుల పాలు**

– పొనుగోటి నరసింహారావు,
హైదరాబాద్

లక్కీ నోటినుండి నవ్వు 'ఫక్కు'మని బిగ్గరగా వచ్చింది.

నిముషాల క్రితం ఫుట్‌పాత్‌మీద జననం నిముషాల మీద ఘాట్‌లో దహనం

పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనం

శంకరుని శ్లోకం లక్కీ హృదయంలో చక్రభ్రమణమవసాగింది.

ఈ మాత్రం జీవితానికి.. ఎన్ని అవతారాలు ఎత్తుతాడు మానవుడు.

దేవుని దశావతారాలు, మనిషి శతసహస్రావతారాల ముందు దిగదుడుపేనా?

జననానికి, మరణానికి నడుమ సాగే కాలాన్ని మనిషి ఎందెందుకు వినియోగిస్తున్నాడో తలుచుకుంటే మానవజన్మ మీదే అసహ్యం కలుగుతుంది.

తను తయారుచేసే కరెన్సీ కాగితాల గడ్డి కరవడానికి కుక్క, నక్క, ఎలుక, పిల్లి, పంది, పులి, సింగం, గద్ద, పాము, తిమింగలం ఒక్కటేమిటి? సకల జంతు పక్షిజాలాన్ని తనలోంచి ఆయుధాలుగా తీస్తాడు. తన శరీరం సకల క్రూరజంతుజాలాల నిక్షిప్తమని తెలియచేస్తాడు.

మానవునిగా జన్మనెత్తిన మనిషీ!

సకలశాస్త్రాలతో అలంకారాలతో ఈ లోకాన్ని రూపుదిద్దాల్సిన రుషీ!..

ఎంతగా పతనమవుతున్నావ్..?

తిండికి కాదు.. బట్టకు కాదు.. కేవలం కేవలం డబ్బు అనే జబ్బు అంటించుకుని ఎంత గబ్బుగా తయారయ్యావ్..?

లక్కీ చదివిన సాహిత్యమంతా బుర్రలో ఒక్కసారిగా గిర్రున తిరిగింది.

మనిషి జీవితాన్ని ఎన్ని కోణాల్లోంచి చూపించారందరూ..

ఇది.. ఇది.. ఇదికాదు.. జీవితమని, పదవీ, ధనకాంక్ష, అధికార, పైశాచిక మనస్తత్వాల్ని మానసిక రుగ్మతల్ని ఎండకట్టి వివరించారే! అయినా.. మనిషి.. మనిషిగా మారడం లేదే!

నాటి నుంచి నేటి వరకు.. దొంగ వున్నాడు, శ్రమజీవి వున్నాడు, అక్రమార్కుడున్నాడు, అమాయకుడున్నాడు..

ఇది ఇంతేనా!

న్యాయం అన్యాయం రైలుపట్టాలా?

జీవితమనే రైలు ఆ రెండు పట్టాలమీద నడవాల్సిందేనా!

సత్యం, అసత్యం, రెండు పెదాలా? మాట ఆ సత్యాసత్యమైన రెండు పెదాల నుంచి విడుదల కావల్సిందేనా!

ధర్మం - అధర్మం రెండు చేతులా? ఏ పని చేసినా ఆ రెండు చేతులతో చేయాల్సిందేనా!

నీతి-అవినీతి రెండు కాళ్ళా?

ఎక్కడికెళ్లినా ఆ రెండు కాళ్ళమీద నడవడం తప్పనిసరేనా!

నాడు గోడకు సున్నితంగా కన్నమేసే దొంగలున్నట్టే నేడు కరెన్సీ బాక్స్ (ఏటియం)ని చేతివేళ్ళ నైపుణ్యంతో తెరిచే దొంగలు..

లోకంలో ఏ కాలంలోనూ, ఈ వృత్తి ఇలాగే కొనసాగుతూ పోవల్సిందేనా!

ప్రపంచంలో దొంగలు, దోపిడీ వర్గం లేనిదేశం ఏద్దైనా వుందా? లేదే! మానవ జీవన క్రమంలో ఈ కల్మషాలన్నీ ఇలాగే కొనసాగాల్సిందేనా?

మానవుడు ఈ అక్రమక్రమం నుండి విడుదల కాలేడా?

కృతయుగం హరిశ్చంద్రుని కాలం నుంచి నేటి అమాయకుని వరకూ ప్రతి ఒక్కరూ సత్యం కోసం కష్టాలు పడవల సిందేనా?

శ్రీరాముని కాలం నుంచి నేటి బికారిమనిషి వరకూ నీతి న్యాయం కోసం పోరాటం చేయవలసిందేనా?

శ్రీకృష్ణుని కాలం నుంచి నేటి కుచేల నికృష్టుని వరకూ ధర్మసంస్థాపనార్థం యుద్ధం కొనసాగించాల్సిందేనా?

నాడు వాల్మీకులు, వ్యాసులు, చెప్పిన నీతులు నేడూ చెప్పాల్సిందేనా?

ఏం చెప్పినా! ఎవరు చెప్పినా! మనిషెందుకు మంచిగా మారడం లేదు?

మనిషి మారడా?

మారనివాడే మనిషా?

ఓవైపు 'అహింసో పరమో ధర్మః' అంటూనే హింసమార్గం ఎంచుకొని కర్తవ్యుడై కదులుతున్నాడు.

నాడు కృతయుగంలో

చంద్రమతిని నడిరోడ్డులో వేలం..

త్రేతాయుగంలో సీతాపహరణం..

ద్వాపరయుగంలో

ద్రౌపతీ వస్త్రాపహరణం

నేడు కలియుగంలో

ఒకేసారి!

వేలాదిమందిని వ్యభిచార గృహాలకు అమ్మకం..

నిముషానికొక నిర్భయ మానభంగం..

ఘడియకొక స్త్రీ సజీవదహనం..

హింస మనిషికి ప్రవృత్తిగా కాదు, శాశ్వత వృత్తిగా తయారయింది.

అహింస హంసను రెక్కవిప్పి ఎగరక మునుపే ఆదిలోనే హింసాపాదంతో తొక్కేయడం జరిగింది.. జరుగుతుంది.. జరుగుతూనే వుంది.

అనాది నుండి అందమైన జీవితానికి

## కవితల పోటీకి ఆహ్వానం

విజయవాడకు చెందిన 'ఆంధ్ర నాటక కళాసమితి' దేశవిదేశాల్లో ఉన్న తెలుగువారికోసం కవితల పోటీ నిర్వహిస్తోంది. ప్రథమ బహుమతి రూ. 50 వేలు, ద్వితీయ రూ. 30 వేలు, తృతీయ రూ. 20 వేలు, ప్రోత్సాహక బహుమతులు రూ. 1116/-. గాంధీ మహాత్ముడు, గాంధీ సిద్ధాంతాలపై పద్య, గేయ, వచన కవితలను పోటీకి పంపాలని నిర్వాహకులు ఓ ప్రకటనలో తెలిపారు. ఏభై సంవత్సరాల వయసులోపు వారు ఇందులో పాల్గొనవచ్చు. రచన కనీసం పది నుంచి ఇరవై పుటలు ఉండాలి. గడువు తేది 2017 జనవరి 31.

వివరాలకు 91602 56999 లేదా 0866 - 2533855 ఫోన్ నెంబర్లలో సంప్రదించవచ్చు.

లోకంలో సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం, అభినయం, నాట్యం ఎన్నో కళలు మనిషికి అందుబాటులో వున్నాయి.

ఆకలికి సరిపడా తిండి సంపాదించుకుని మిగిలిన సమయమంతా కళలోనూ శాస్త్రవిజ్ఞానంలోనూ జీవించడమే కదా జీవితం.. అందమైన జీవితం!

డబ్బుజబ్బు అంటించుకుని మురికి గబ్బుకొడుతూ జీవించడమేనా! మనిషి జీవితం? బతుకు అవసరాల నిమిత్తం మారకద్రవ్యమేకాని జీవితావసరానికి కళలే కదా! అత్యవసరం.

మణికంఠఘాట్‌లో మనుషుల భౌతిక శరీరాలు బూడిదై గంగలో కలిసిపోవడం చూస్తున్న వాళ్ళ బంధువులు తాత్కాలికంగానైనా ఆలోచిస్తున్నారా? కార్యక్రమం జరిపించి చేతులు దులుపుకొని దైనందిన మోసపూరిత, క్రోధపూరిత, స్వార్థపూరిత జీవితంలోంచి పొందే తాత్కాలిక కృత్రిమత కోసం పాకులాడటంతో లోకం ఇలాగే వుంటోంది.

డబ్బు, బంగారు నగలు ఎందుకు దాచుకుంటున్నారో.. అందుకు అందాల్ని ఆనందాల్ని అనుభవించే జీవితాన్ని ఎందుకు చేతులారా పోగొట్టుకుంటున్నారో అర్థం కాదు. కేవలం ధన కనక సంపాదన కోసం జీవితాన్ని చండాలంగా చేసుకోవడం ఎక్కడ చూసినా అగుపిస్తున్న చిత్రం.. అడుగడుగునా కనిపిస్తున్న వాస్తవం.

స్వాములు, వేదాంతం చెప్పేవారూ.. ఆస్తుల కోసం.. పరుగులిడడం ఆశ్చర్యం కాదు అసహ్యం కలిగించకమానదు.

లక్ష్మి తన జీవితకాలాన్ని పిండితే తనకు తెలిసిన సత్యం జీవితాన్ని గమనిస్తూ నిరంతర జాగరూకతతో ఎరుకతో గడిపిన క్షణాలే జీవితంగా గమనించింది.

ఒకానొక దశలో సాహిత్యం చదువుకున్న చదువే జీవితానికి పనికి వచ్చే చదువుగా శాశ్వత జ్ఞానంగా గమనించింది. అది ఆదిశంకరుడు చెప్పినా నేటి అభ్యుదయవాది సెలవిచ్చినా ఆఘ్రాణించింది.

★ ★ ★

కార్తీక పౌర్ణమి రోజు కాశీ తెల్లవారకనే మేలుకుంది.

బిస్మిల్లాఖాన్ షెహనాయ్ సన్నాయి రాగాలతో కాశీనాథుని గుడితలుపులు సన్నగా తెరుచుకున్నాయి.

గంగానదిలో మునిగి చేసిన పాపాలు పోగొట్టుకునే దిశగా మనుషులు తండోపతండాలుగా గంగానదిలో స్నానించడం, ఒడ్డుకు చేరగనే పాపాలతో జీవితాన్ని ప్రారంభించడం.. నవ్వుగాక మరేమిటి!

దరహాస జీవిత ముఖంపై చేస్తున్న పరిహాసంగాక మారుమాటేమిటి?

సరే!

ఉదయమే గంగలో మునిగిన లక్ష్మి..

చలిలో మంచు పుప్పొడిని పూసుకుని

అభ్యంగ స్నానం చేసిన లక్ష్మీ..

కాశీనాథుని దర్శనం కోసం గంగలోంచి నడిచివస్తున్న అపరగంగగా కదిలింది.

ఒక్కొక్కమెట్టు ఎక్కుతున్న లక్ష్మీ.. వెంట్రులకు పడిన ముడుల్ని పక్కన బెట్టి, జీవితానికి పడిన చిక్కుముడుల్ని మెట్టుమెట్టుకు సహజంగా తనలోంచి విడిపోతున్న వైనాన్ని గమనిస్తూ కాశీనాథుని విశాలాక్షిని దర్శించుకునేందుకు మంచైై కదిలింది.

హరోం హర హరోం హర ధ్వనులు వారణాసిలో ధ్వనులుగా శంభో శంకర హరహర మహాదేవ పద శబ్దాలు అడుగడుగునా ప్రతిధ్వనులుగా వాతావరణం..

విశాలాక్షిని దర్శించింది.

విశ్వనాథునికి క్షీరాభిషేకం జరిగింది.

తీర్థం అరచేతుల్లో గంగగా భాసిల్లింది.

శివుని శిరమందున్న గంగ తన ముకుళిత హస్తాల్లోంచి తన కంఠంలోకి జారడం..

తాదాత్మ్యం.. తాదాత్మ్యం.. తాదాత్మ్యం అద్భుత తాదాత్మ్యం.

తన్మయత్వం.. తన్మయత్వం.. తన్మయత్వం.. అహరహం హరోంహర తన్మయత్మం..

లక్ష్మీ నిరాడంబర నిర్వికారంతో అలాగే నడుచుకుంటూ కాశీవీధులన్నీ సాయంత్రం వరకు తిరిగింది.

చివరికి అశ్వమేధ ఘాట్‌కు చేరుకుంది.

గంగ ఒడ్డున కిక్కిరిసిన జన సమూహం.

గంగాహారతి మొదలయ్యింది.

మనుషుల్లోకి భక్తితత్వం ప్రవేశించింది.

శంఖం పూరించిన ఏడుగురు గంగాహారతినిచ్చే యువకులు.

గంటలు గణగణలాడుతున్నాయి.

అగరొత్తుల్ని వెలిగించి.. ధూపాన్ని గంగపై అలుముకున్న మంచుకు సమర్పిస్తున్న వైనం అద్భుతం..

చివరిగా జ్యోతి ప్రజ్వలనంతో అఖండ జ్యోతి హారతులు సాంతం గంటల గణగణల నడుమ శివనామస్మరణతో గంగ పులకిస్తోంది.

పడవల్లో తిరుగాడుతున్న భక్తులు..

గంగలో దీపాలు వదులుతున్న భక్తులు.. ఒకానొక జీవితకాల అద్భుత దృశ్యం..

గంగాహారతి ముగిసింది.

లక్ష్మీ మస్తిష్కంలో శాశ్వతత్వం విరిసింది.

గంగ ఒడ్డు నుంచి నిష్క్రమిస్తున్న భక్తులతో సందడి తగ్గుముఖం పట్టింది.

లక్ష్మీ కూచున్న ఒడ్డు నుంచి లేచింది. గంగవైపు కదిలింది.

పడవ నడిపేవాళ్ళు గుమిగూడారు.

"కిత్‌నా లోగ్ హై (ఎందరున్నారు)?" లక్ష్మీని అడిగారు.

"అకేలా (ఒంటరిగానే)" లక్ష్మీ నింగిలోని జాబిలిని చూస్తూ జవాబిచ్చింది.

"షేర్ కరో.. కమ్ పడేగా (ఇతర్లతో పంచుకుంటే తక్కువవుతుంది)" పడవవాళ్ళు.

"నై (అవసరంలేదు)" అంది లక్ష్మీ.

"నై..?! (షేర్ చేసుకోవడం అవసరం లేదా)" లక్ష్మీ దృఢత్వానికి అప్రయత్నంగా ఆశ్చర్యపోతూ ఓ పడవవాడు.

"హ.. అకేలా.. జానాపడేగా.. (అవును! ఒంటరిగానే వెళ్ళాలి మరి)" లక్ష్మీ దృఢత్వం.

"చలో.. (పదండి)" ముందుకొచ్చాడు పడవవాడు.

లక్ష్మీ పడవలో కూచుంది.

పడవ గంగ అలలపై కదిలింది.

సరంగు ఏమీ మాటాడలేదు.

కారణం లక్ష్మీ దృక్కులు నిశ్శబ్దాన్ని చల్లుతున్నాయి.

"ఓ కినారా తరఫ్ చలో (పడవను గంగ ఆవలి తీరంవైపు కదిలించు)" లక్ష్మీ.

పడవవానికి అర్థంకాలేదు కాశీ ఒడ్డుకు

కదా! చేర్చాల్సింది..

కాశీ ఆవలి ఇసుక తీరంవైపు వెళ్ళమం టుందేమిటి ఈమె, అనుకున్నాడు గాని ఆమెకు జవాబిచ్చే శక్తిహీనుడయ్యాడు.

గంగ ఆవలి ఒడ్డుకు, కాశీ ఘాట్లకు అభి ముఖంగా పడవ నడిపాడు.

తీరాన్ని చేర్చాడు.

లక్ష్మి గంగలోకి దిగి ఇసుక తిన్నెలవైపు చూసి పడవ వ్యక్తికి తనవద్దనున్న మొత్తాన్ని ఇచ్చింది.

అడిగిన దానికన్నా ఎక్కువ ఇచ్చినం దుకు ఆనందంలో వున్న పడవవాడ్ని చూసి 'ఇక నువు వెళ్ళిపోవచ్చు' అని కళ్ళ తోనే సంజ్ఞ చేసింది.

పడవ తీరం విడిచింది.

లక్ష్మి ఒక్కతే మిగిలింది. అవతలి తీరంలో దూరంగా కాంతులతో మిలమిల లాడుతోంది కాశీ.

లక్ష్మి తీరంలోని ఇసుకలో కూచుంది.

ఎవ్వరూ లేరు.

ఒంటరిగా మింటికేసి చూసింది.

జాబిలిలోంచి కురుస్తున్న వెన్నెలలో గంగానదిపై నుంచి వీస్తున్న చల్లగాలితో మిళితమైన వాతావరణం.

వెన్నెల మంచు కలిపిన సుగంధపరి మళం శ్వాసలోకి ఊపిర్లూదుతోంది..

కొత్తవాసన..

సరికొత్త సువాసన..

ఏనాడూ పీల్చని పరిమళం తనకు తానుగా తనలోకి ప్రవహించడం తన్మయ త్వంతో తనువు ఊగిపోవడం..

అద్భుతమైన అనుభవం

గతం

వర్తమానం

ఏమీ తెలియని తనం

సమయం ఎంతగడిచి పోయిందో అన వసరం.

ఒంటరితనం

తనలో తను

తనతో తను మమేకం

సత్యం శివం సుందరం

ఓహ్..

గంగా ప్రవాహం పెరిగిన వైనం

తీరంలో కూచున్న తనను గంగానది కెరటం తాకడం

గంగ తనను ఆహ్వానిస్తున్న వైనం స్పష్టంగా అవుపించింది.

పరిసరాల్లో ఎవరూ లేరు.

నిశ్శబ్దం

గంగ నిశ్శబ్ద ప్రవాహం

తనలో నిశ్శబ్దం

తనలో నిర్భయత్వం

తనలో నిశ్చలత్వం

సత్సంగత్వే నిస్సంగత్వం

నిస్సంగత్వే నిర్మోహత్వం

నిర్మోహత్వే నిశ్చలతత్వం

నిశ్చల తత్వే జీవన్ముక్తిః

గంగ అలల ఆహ్వానం పలికింది.

గంగానదిలోకి లక్ష్మి అడుగులేసింది.

గంగానది లక్ష్మి అడుగుల్ని తనలోకి తీసుకుంది.

గంగానది లక్ష్మి నడుముపై చేయి వేసి అలల వేళ్ళతో గిలిగింతలు పెట్టి లాక్కుంది.

గంగానది లక్ష్మి శంఖంలాంటి కంఠాన్ని సుతారంగా తాకింది.

గంగానది లక్ష్మి పెదాల్ని సున్నితంగా తడిమింది.

గంగానది జలం లక్ష్మి గొంతులోకి తీర్థంగా తొణికింది.

గంగానది తన అలలుగా వున్న లక్ష్మి శిరోజాల్ని తనవిగా తలచింది.

గంగ లక్ష్మిని సంపూర్ణంగా ఆహ్వానిం చింది. గంగలో లక్ష్మి శివైక్యమయింది.

గగనంలో జాబిలి మేఘాల్లో ముని గింది. గగనంలోకి నేలపైని ఏకాకి తార ఏకతారగా దర్శనమిచ్చింది.

లగ్నజితగా మిగిలింది.

Ⓒ

# అవార్డులు - ఆవిష్కరణలు




తెలుగు విశ్వవిద్యాలయం వ్యవస్థాపక దినోత్సవం సందర్భంగా హైదరాబాద్‌లో డిసెంబరు 2న ప్రముఖ కవి నందిని సిధారెడ్డి దంపతులను విశిష్టపురస్కారంతో సత్కరిస్తున్న మంత్రులు హరీశ్‌రావు, కడియం శ్రీహరి




త్రిపుర రాజధాని అగర్తలలోని ముక్తధార ఆడిటోరియంలో డిసెంబరు 4న కేంద్రసాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో నిర్వహించిన కార్యక్రమంలో కథాపఠనం చేస్తున్న వేంపల్లి గంగాధర్. వేదికపై (ఎడమ నుంచి) సయంతానీ భట్టాచార్య (బెంగాలీ), అశ్వతీ శశికుమార్ (మలయాళం), శంకర్ బసు (బెంగాలీ), హన్సద సౌవేంద్రశేఖర్ (ఆంగ్లం), సాహితీవేత్త సరోజ్‌లను చూడవచ్చు



హైదరాబాద్ రవీంద్రభారతిలో డిసెంబరు 13న 'హనుమత్ సుప్రభాతమ్' శ్రావ్యసంపుటి (సీడి) ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, భారతీతీర్థస్వామి ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో సామవేదం షణ్ముఖశర్మ, రమణాచారి, ఓలేటి పార్వతీశం, మామిడి హరికృష్ణ తదితరులు



నెల్లూరులో డిసెంబరు 11న డా. పెళ్లకూరు జయప్రదసోమిరెడ్డి 'నిద్రిత నయనాలు' కథా సంపుటిని జాయింట్ కలెక్టర్ ఆర్.ఎస్.రాజ్‌కుమార్ ఆవిష్కరిస్తున్న దృశ్యం. వేదికపై (ఎడమ నుంచి) సోమిరెడ్డి వెంకటశేషారెడ్డి, ఈతకోట సుబ్బారావు, వి. ప్రతిమ. రచయిత్రి జయప్రద, చిన్ని నారాయణరావు, హనుమారెడ్డి, తిప్పావఝుల సుబ్రహ్మణ్యం, డా. సుధాకర్



హైదరాబాద్ శ్రీకృష్ణదేవరాయ తెలుగు భాషానిలయంలో డిసెంబరు 6న 'శ్రీచంద్రశేఖర విజయము' గ్రంథావిష్కరణ సభలో గ్రంథకర్త రామోజు లక్ష్మీరాజయ్యను సత్కరిస్తున్న రమణాచారి, ఎమ్మెల్యే కోనేరు కోనప్ప. చిత్రంలో రఘుశ్రీ, చిమ్మపూడి శ్రీరామమూర్తి, రాచకొండ గిరీష్‌కుమార్, మురళీధరగౌడ్, ఆచార్య ఫణీంద్ర, బండారుపల్లి రామచంద్రారెడ్డి




**చి**వరికి ఆ ఇద్దరు జోకర్లు పట్టుబడిపోయారు. పోలీసులు వెంటాడుతున్నారని వాళ్లకు తెలియదు. అందుకే భయం లేకుండా పట్నానికి వచ్చేశారు. 'ఎవ్రిడే హార్డ్‌వేర్' అనే షాపులోకి కాలు పెట్టారో లేదో పోలీసులు వాళ్లమీదికి ఎగిరి దూకారు. వాళ్లిద్దర్నీ సిమెంట్ నేలకేసి అదిమి పట్టుకున్నారు. చేతులు వీపులోకి వచ్చేటట్టు చేసి బేడీలు తగిలించారు. రంపపు పొట్టు ముఖం నిండా అలుముకుంది. అయినాసరే వాళ్లిద్దరూ "ఇక్కడేదో పొరపాటుంది, కామ్రేడ్ పోలీస్‌మెన్! మేం ఏమీ దొంగిలించలేదు!" అంటూ అరిచారు.

"షటప్!"

"అయ్యో..!"

పక్కనే బకెట్లో నేల తుడిచే గుడ్డ కనిపించింది. పోలీసులు ఆ గుడ్డముక్కలను వీళ్ల నోళ్లలో కుక్కారు. లాక్కెళ్లి బయట ఉన్న

తెల్లని వ్యాన్‌లోకి ఎక్కించారు వాళ్లను.

సిటీ పోలీస్ స్టేషన్‌లో వెంటనే విచారణ మొదలయింది. అదేమీ గొప్పగా సాగలేదు. ఆ పల్లె రైతులు ఇద్దరూ.. తాము విప్లవ వ్యతిరేక ప్రచారం చేయలేదంటే చేయలేదని చెప్పసాగారు. కళ్లజోడు పెట్టుకున్న, స్ఫోటకం మచ్చలున్న పోలీస్ చీఫ్ వాళ్లు వేసిన ఒక జోక్ గురించి గుర్తుచేశాడు. ఇద్దరు రైతుల్లో పొడుగాటి మనిషి అందరూ ఆశ్చర్యపోయేటట్టు పోలీస్ పెద్దాయనను ఒక ప్రశ్న అడిగాడు. "ఎవరూ ఈ డెంగ్ గ్జియావోపింగ్? నేనెప్పుడూ కలవలేదు" అంటూ అతను తన తోటి మనిషికేసి తిరిగి నువ్వేమైనా కలిశావా? " అంటూ అడిగాడు.

"కలవలేదు. అతనెవరో పెద్ద సైన్యాధికారి లేదా ఆఫీసరు అయి ఉంటాడు" అన్నాడు పొట్టి రైతు.

"నటనలు ఆపండి! కామ్రేడ్ డెంగ్జియావోపింగ్ అంటే మన దేశానికీ, మన పార్టీకి ఛైర్మన్‌గారు. తెలియదా? "

"నిజంగానా? ఆయన అందరికంటే పెద్దాయనా? ' అడిగాడు పొడుగాటి రైతు.

"ఔను"

"మరి ఛైర్మన్ మావో ఏమయ్యారు? మాకు ఛైర్మన్ మావో గురించి తెలుసు"

"ఆయనగారు ఆరేళ్ల క్రితమే పోయారు. అది కూడా తెలియదా? "

"అయ్యో.. నిజంగానా! ఆయన చనిపోయారని తెలియనే తెలియదు. మాకయితే ఆయనే మహాప్రభువు. కాదు కాదు.. ఒక తాతయ్యలాంటివారు. మా ఇంట్లో ఇంకా ఆయన బొమ్మ గోడమీద వేలాడుతూనే ఉంది" అన్నాడు పొట్టి రైతు.

పోలీసాఫీసర్లు నవ్వును ఆపుకోవడానికి నానా కష్టాలు పడ్డారు. వాళ్ల చీఫ్ ఆలోచనలో పడ్డాడు. విచారణ మొదలు పెట్టడానికి ముందు తాను ఈ పల్లెటూరి రైతులను ఊరికే పట్టేస్తాననుకున్నాడు. కానీ వాళ్లు చాలా తెలివిగలవాళ్లలా కనబడుతున్నారు. నేరాన్ని కప్పిపుచ్చుతూ నాటకాలాడుతున్నారు. వాళ్లను ఇవాళ్టికి వదిలేస్తే పోతుందనిపించింది. అప్పటికే మధ్యాహ్నమైంది. ఆ తరువాత వాళ్లతో ఏదో రకంగా నేరాన్ని ఒప్పించవచ్చు. అందుకే అతను గార్డ్‌లను పిలిచి ఆ ఇద్దరినీ బొక్కలో తోయమన్నాడు.

★ ★ ★

ఏడు వారాల క్రితం ఈ ఇద్దరు రైతులు శాంతివీధిలో సన్‌లైట్ డిపార్ట్‌మెంట్ స్టోర్‌కు వెళ్లారు. పొడుగాటి రైతు కౌంటర్‌మీద లావుపాటి వేళ్లతో దరువేస్తూ "రబ్బరు బూట్లు చూపించగలరా? " అని అడిగాడు.

ముగ్గురు సేల్స్‌గర్ల్స్ తీరికగా వెడల్పాటి కిటికీ అంచుమీద కూచుని ఉన్నారు. వీధి

## చైనా మూలం :
## హా జిన్

## అనువాదం :
## కె.బి. గోపాలం

దీపాల వెలుగులో వాళ్లు నీడలాగా కనబతున్నారు. మాటలు ఆపేసి వాళ్లలో నుంచి ఒకమ్మాయి దిగి ముందుకు వచ్చి "ఏ సైజు? " అని అడిగింది.

"నలభైరెండు" అన్నాడు పొడుగాటి రైతు.

ఆమె ఒక జతను అందించింది. వేలాడుతున్న చీటీని చూపిస్తూ "యాభై అయిదు యువాన్లు" అన్నదామె.

"ఏంటి? పోయిన నెలలో యాభైకే ఇచ్చారు కదా? ఇవాళ యాభై ఐదు ఎందుకైంది? ఒక్క నెలలో ద్రవ్యోల్బణం పదిశాతం పెరిగిందా? పిచ్చి" ఆశ్చర్యంగా అన్నాడు పొట్టిరైతు.

"యాభయి అయిదు" అంది అమ్మాయి చికాకుగా ముక్కు విరిచి. ఆ ముక్కు




వెల్లుల్లిపాయలా తెల్లగా పెద్దగా ఉంది.

"ఈ ముసలాడికిది మరీ ఎక్కువేలే" అన్నాడు పొడుగాటి రైతు. అతనికి ముప్పై పైన మాత్రమే ఉంటాయి. బూట్లను ఎత్తి చప్పుడు వచ్చేటట్లు కౌంటర్‌మీద పడేశాడతను.

ఇద్దరు మనుషులు నడిచి వెళ్లిపోతుండగా పొడుగాటి అతను నేలమీద ఉమ్మేశాడు. "వెధవది అన్ని ధరలూ పెరుగుతాయి. మన ఛైర్మన్ మాత్రం పెరగడు" అన్నాడు తన నేస్తంతో గట్టిగా.

పొట్టి మనిషి నవ్వాడు. "అవును, ఆ పొట్టివాడు మారడు" అన్నాడు.

వాళ్ల మాటలు విని అమ్మాయిలందరూ కిలకిలా నవ్వారు. రైతులు ఇద్దరూ వెనక్కు తిరిగి తమ నీలంరంగు టోపీలను పైకెత్తి ఆడిస్తూ అమ్మాయిలను చూసి చిరునవ్వారు. వాళ్ల ముఖాలు పెద్ద బ్రాకెట్లలాగా విచ్చుకున్నాయి.

ఒక గంటలోపల జోకు ఆ డిపార్టమెంటల్ స్టోర్ అంతటా వ్యాపించింది. "అన్ని ధరలూ పెరుగుతాయి. కానీ డెంగ్జియావోపింగ్ మాత్రం పెరగడు. ఒక రోజులో నగరంలోని వేలాదిమంది ఈ జోకు విన్నారు. దయ్యంలా జోకు అన్ని ఆఫీసులను, కార్ఖానాలను, హోటళ్లను, సినిమాహాళ్లను, సందులను, గొందులను, రైల్వేస్టేషన్లను పట్టేసుకున్నది.

* * *

ఇద్దరు రైతులు పోలీస్ స్టేషన్ సెల్‌లో హాయిగా పడుకున్నారు. అక్కడ వారికి తేరగా జొన్నగంజి, ఉడికించిన గుమ్మడికాయ పులుసు దొరికినందుకు సంతోషంగా ఉంది. కానీ తాము చేసిన నేరం ఏంటో మాత్రం వాళ్లకు అంతుచిక్కలేదు.

ఉదయం తొమ్మిది గంటలయింది. ముగ్గురు సేల్స్‌గర్ల్స్ పోలీస్ స్టేషన్‌కు వచ్చారు. ఒక అమ్మాయిని జోకర్‌లు చెప్పినదంతా విన్నది విన్నట్టు మళ్లీ చెప్పమన్నారు. పొడుగాటి మనిషి గుంటముఖం గుర్తించిందామె. "అన్ని ధరలూ పెరుగుతాయి. కానీ డెంగ్జియావోపింగ్ పెరగడు" అన్నది ఇతనేనని చెప్పింది.

"ఇదేం అన్యాయం? నేను ఆ పేరు కూడా ఎరగను. అలాంటి చిత్రమైన పేరు



నాకెలా తోస్తుందనుకున్నారు? " అతగాడు మోకాలిమీద చేత్తో కొట్టుకుంటూ వంకర కళ్లు మెరుస్తుండగా గట్టిగా అరిచాడు.

"మేం అతగాని ఊసే ఎత్తలేదు. మన ఛైర్మన్ ఎప్పుడూ పెరగడు అని మాత్రం అన్నాం" అన్నాడు పొట్టి మనిషి.

"మాటకు మాటగా ఏంటి అన్నావు? " డిటెక్టివ్‌ల బృందానికి నాయకుడిగా వచ్చిన బట్టతల పోలీసాయన గట్టిగా అడిగాడు.

"-అన్ని ధరలూ పెరుగుతాయి. మన ఛైర్మన్ మాత్రం ఎన్నడూ పెరగడు-అన్నాను. నేను అన్నది మా ఊరి ఛైర్మన్ లౌ గురించి" అన్నాడు పొడుగాటి రైతు.

ఇక పొట్టి రైతు అందుకున్నాడు.. "మా పొట్టి లౌ విచిత్రమైన మనిషి, మాకందరికీ అతనంటే అసహ్యం. దినసరి కూలీ ఒకటి న్నర యువాన్ కన్నా ఎక్కువ ఉండకూడ దంటాడు. మీసాల చేపలు, పెద్దతల కార్ప్‌ల కోసం చెరువు కట్టడానికి డబ్బు కావాలట.. ఆ చెరువులో మాలాంటి వారికి ఏం దొరుకుతుంది? చేపల పెంట కూడా దొరకదు. చేపలన్నీ పెద్ద ఆఫీసర్ల



పొట్టలోకి చేరుకుంటాయని అందరికీ తెలుసు. నన్ను నమ్మకపోతే మీరే వెళ్లి చూడండి. మా ఛైర్మన్ లౌ పొట్టివాడో కాదో? " అతను పుచ్చిన తన పళ్లను బయటపెడుతూ హాయిగా నవ్వాడు.

కొంతమంది అమ్మాయిలు, అబ్బాయిలు కూడా నవ్వారు. కానీ విచారణ జరుపుతున్న పెద్దాయన ముఖం చూసి వెంటనే వాళ్లు మిన్నకుండిపోయారు.

ప్రధానాధికారి అమ్మాయిలను పిలిచి జోకు అసలు మాటలను గుర్తు చేసుకుని చెప్పమన్నాడు. వాళ్లు పొడుగాటి రైతు నిజంగానే 'మన ఛైర్మన్ ఎన్నడూ పెరగడు' అన్నాడని చెప్పేసరికి పెద్దాయన కొంచెం విస్తుపోయాడు. అమ్మాయిలు ఆ మాటలను మిగతా వాళ్లకు చెప్పినప్పుడు కూడా డెంగ్జియావోపింగ్ ప్రసక్తి రాలేదు. జోకు పాకుతుంటే ఎక్కడో ఒకచోట మారింది. ఇప్పటి మహావికృత రూపానికి చేరింది. ఎక్కడో చిన్న పొరపాటు జరిగి పరిస్థితి ఇక్కడి దాకా వచ్చింది.

విచారణ చేసేవారు ఏమీ తోచని పరిస్థితిలో పడ్డారు. జోకు మొదటి రూపం ఎక్కడ, ఎప్పుడు ఎలా మారిందన్న విషయాన్ని వాళ్లు ఎలా తేల్చగలరు? జరిగిన దాంట్లో అసలు కారణం ఎక్కడో దూరిన మాట తేడా అంటే పెద్ద అధికారులు అంత సులభంగా ఒప్పుకోరు. నేరం జరిగిందన్నది అందరికీ తెలిసిపోయింది. అయితే నేరం చేసినవారు లేకుండా ఒక నేరం ఎలా జరుగుతుంది? మాట మార్చిన మనిషి ఆచూకి తెలియకపోవచ్చు. అతను కావాలని ఆ పనిచేసి ఉండకపోవచ్చు. అయినాసరే జోకు తాలూకు చివరి రూపానికి బాధ్యులంటూ ఎవరో ఒకరు ఉండాలి కదా. ఈ పరిస్థితిలో విచారణ ముందుకు సాగేది ఎలా?

చీఫ్ వచ్చి రైతులను మళ్లీ సెల్‌లోకి పంపించాడు. ఊరి నుంచి ఛైర్మన్ లౌను తీసుకురమ్మని ఒక జీపును పంపాడు.

★ ★ ★

ఛైర్మన్ లౌ తీరును చూసి అందరూ ఆశ్చర్యపోయారు. గుండ్రని నుదురు, ఐవరీలాంటి దంతాలు, బాణంలా తిరిగిన కనుబొమ్మలు, పెద్ద కళ్లు, వాటిలో పెద్ద కంటిపాపలు.. అతను చిత్రంగా ఉన్నాడు. అతని ముఖం ఎంత అందంగా, ఎంత తెలివిగా ఉందో! అతను మూడడుగుల రెండు అంగుళాలు మాత్రమే ఉన్నాడు గనుక సరిపోయింది. లేకుంటే సినిమా తార దిగి వచ్చాడని ఎవరయినా అనుకుంటారు! పైగా అతని తీరు కూడా చాలా హుందాగా ఉంది. గొంతు మరింత గంభీరంగా ఉంది. అతను బాగా చదువుకున్న మనిషి అని అది చెప్పేస్తూ ఉన్నది. అంతటి పొట్టి దేహంతో కూడా అతను ఒక పెద్ద గ్రామానికి అధికారిగా కొనసాగుతున్నాడంటే ఆశ్చర్యం లేదు: మధ్యాహ్నం ఆయన పోలీసు ప్రధానాధికారిని కలిశాడు. "చూడండి కామ్రేడ్ చీఫ్! ఈ ఇద్దరు భడవలను తప్పక శిక్షించాలి. వాళ్లకు గుణపాఠం చెప్పాలి. లేకుంటే ఊళ్లో ఉన్న ముప్పైయొక్క వేల మందిని నేనెలా అదుపు చేయగలను? పల్లె ప్రాంతాలలో లీడర్‌ను పట్టుకుని జోకులు వేస్తూంటే పనెలా జరుగుతుంది? " అన్నాడాయన.

"నేను అర్థం చేసుకోగలను. వారంకిత్రం ఏరియా గవర్నర్ ఫోన్ చేసి ఈ కేసు వ్యవహారం గురించి అడిగారు. బహుశా ఇప్పటికే ఈ విషయం బీజింగ్‌లో కూడా ప్రచారంలోకి వచ్చి ఉంటుంది" అన్నాడు చీఫ్.

2 గంటల 10 నిమిషాలకు మళ్లీ విచారణ మొదలైంది. గదిలో కాసేపు కూచున్న తరువాత ఇద్దరు రైతులు తమను అన్యాయంగా కట్టిపడేశారని వెంటనే వదిలిపెట్టాలని పట్టుబట్టారు. తాము బీద కుటుంబాల వాళ్లమని, తమకు పార్టీ మీద, సోష

లిస్టు మాతృభూమి మీద.. గొప్ప గౌరవం ఉందని ప్రకటించారు. వాళ్లు రాజకీయాలలో తలదూర్చలేదు కనుక ప్రస్తుత వ్యవహారాల గురించి తెలియదన్నారు. అన్ని విషయాలూ తెలుసుకుంటామని ఇకమీద మళ్లీ చికాకు కలగజేయబోమని చీఫ్‌కు వాళ్లు మాట ఇచ్చారు. వదిలిపెడితే వెంటనే తాము వెళ్లి ఒక రేడియో కొంటామని, వార్తలను ఎప్పటికప్పుడు వింటూ ఉంటామని కూడా చెప్పారు.

మాటలను ఆపమన్నట్టు చీఫ్ చేయి కదిలించాడు. "ఛైర్మన్ డెంగ్ గురించి తప్పుడు ప్రచారం చేసిన నేరం మాత్రం మీది కాదంటారు. మరి ఇక మిమ్మల్ని నేను ఎలా వదలను? మీ తీరు సరిగా లేదు" అన్నాడతను.

"ఓరి దేవుడా! ఇదంతా అపార్థాల వ్యవహారం. కామ్రేడ్ పోలీస్‌మేన్! దయచేసి.." పొట్టి రైతు గోలగా చెబుతున్నాడు.

"ఇదంతా కుదరదు. నేను చెప్పేది వినండి. ఒక పుస్తకంలోని వాక్యాన్ని రకరకాలుగా చదవచ్చునని, కొందరు దానికి రియాక్షనరీ అర్థం చెప్పవచ్చునని అనండి. ఇక ఆ చదవడానికి బాధ్యులెవరు? రాసినవారా? చదివినవారా? " అన్నాడు చీఫ్.

"బహుశా రాసినవాళ్లే" అన్నాడు పొడుగాటి రైతు.

"కరెక్ట్! సాక్ష్యాలన్నీ చూస్తే ఈ పుకారు పుట్టించింది మీరేనని తేలిపోయింది. కనుక తరువాతి సంగతులకు మీరే బాధ్యులు"

"అంటే.. ఇక మీరు మమ్మల్ని ఇంటికి పోనివ్వరా? " అడిగాడు పొట్టి మనిషి.

"కరెక్ట్"

"మమ్మల్నెంతకాలం జైల్లో పెడతారు? "

"ఏమో, ఓ నెల కావచ్చు. జీవితాంతం కావచ్చు"

"ఏంటీ? " గట్టిగా అరుస్తూ "నేను ఇంకా ఇంటి పైకప్పు తిరగేయనే లేదు. చలి కాలం వచ్చేస్తోంది. నన్ను మీరు ఇక్కడే పెట్టేస్తే నా పిల్లలు చలిలో గడ్డకట్టుకు.." అన్నాడు పొడుగు రైతు.

"మీకింకా అర్థం కాలేదు!" ఛైర్మన్ లౌ తన లావుపాటి చేతితో బల్లమీద గట్టిగా కొడుతూ "ఇంకా బతికి ఉన్నందుకు మీరు అదృష్టవంతులు అనుకోవాలి. విప్లవానికి వ్యతిరేకంగా పితూరీలు చెప్పినందుకు ఇప్పటికి ఎంతమందిని ఉరి తీయలేదు? ఇక్కడే హాయిగా ఉండిపోండి. మిమ్మల్ని మీరు కొత్త మనుషులుగా మార్చుకోండి. నేను వెళ్లి మీ ఇంటివాళ్లకు చెబుతాను. మీ లోపలి లాగులు ఎక్కడికి పంపాలో వివరిస్తాను. అసలు లాగులు ఉన్నాయా? "

అందరి కళ్లూ ఆశ్చర్యంగా కుర్చీలో కూచున్న ఆ పొట్టి మనిషి వేపు తిరిగాయి. ఆయన కాళ్లు ఉలన్ మేజోళ్లతో కదులుతూ ఉన్నాయి.

చీఫ్ కేకవేసి గార్డులను పిలిచాడు. "వీళ్లను నగర కారాగారానికి తీసుకుపోండి. రాజకీయ ఖైదీలతోకలిపి బంధించండి" అంటూ అతను తన కళ్లద్దాలు తీశాడు. ముఖం ముడుచుకుంటూ కళ్లద్దాలను చొక్కా చేతులమీద రుద్ది శుభ్రం చేసుకున్నాడు. నిజమే మరి. ఈ జోకర్లను గురించి అతను సరైన నిర్ణయం చేయలేక పోతున్నాడు. ప్రాంతీయ అధికారులకు ఈ కేసు గురించి ఎంతకాలం ఆసక్తి ఉంటుందో? తెలియదు. అంతకాలం పాటు వాళ్లిద్దరూ జైల్లో ఉండవలసిందే.

"ఛైర్మన్ లౌ! మీరు మమ్మల్ని కనికరించాలి" పొడుగాటి మనిషి దేబిరించాడు.

"ఇదంతా మీ మంచికే. ఇక మళ్లీ అతి తెలివిగా మాట్లాడే ధైర్యం చేయకండి" అన్నాడు లౌ.

"నిన్నంటాను. నీ తాతలనూ అంటాను. పొట్టివాడా!" పొట్టిరైతు అరిచాడు. అతను కాళ్లతో నేలమీద కొడుతున్నాడు. నలుగురు పోలీసులు వచ్చారు. బందీలను పట్టుకుని లాక్కుపోయారు. ©

# కోటీశ్వరుడు

- గంటి రమాదేవి




టీవీ షో 'కోటీశ్వరుడు?' పోటీ చివరి దశకు చేరుకుంది. కాంతం ఆమె భర్త వెంకట్రామయ్యా టక్కరిగా, ఎలాగోలా కోటిరూపాయల ప్రశ్నకి చేరుకున్నారు.

'కాంతంగారూ! ఇంతవరకూ మీ జంట చాలా బాగా ఆడుతూ వచ్చారు. ఇలా (అయోమయంగా ఉంటూ) ఇంతదూరం వచ్చినవాళ్ళు మీరే! ఇప్పుడు కోటిరూపాయల ప్రశ్న రాబోతోంది. మీకు అన్ని లైఫ్ లైన్లూ అయిపోయాయి. ఒక్క 'ఫోన్ ఎ ఫ్రెండ్' తప్ప. ఈ ఆఖరి ప్రశ్నకి జవాబు కరెక్ట్‌గా చెబితే మీకు కోటిరూపాయలు వస్తాయి. తప్పుచెబితే 3,20,000/- రూపాయలకి పడిపోతారు' షో యాంకర్ నవ్వుతూ చెప్పాడు.

కాంతం, వెంకట్రామయ్యను మోచేత్తో పొడిచి, 'ఒళ్ళు దగ్గర పెట్టుకుని ఆడు.. తేడా వచ్చిందంటే తెలుసుగా! జాగ్రత్త!!' అతని చెవిలో గొణిగింది.

బిత్తరపోయిన వెంకట్రామయ్య ముఖం చూసి, యాంకర్ అన్నాడు 'మీ వారి ముఖంలో ఎప్పుడెప్పుడు కోటీశ్వరుడు అవుదామా? అన్న ఆత్రుత కనబడుతోంది'

'ఆత్రుతా.. బొందా? సమాధానం తప్పు అయితే ఇంటికెళ్ళిన తర్వాత నా పని 'తాషా మరపాసే.. కాంతం అప్పడాల పిండిలా పిసికేస్తుంది' ఏడవలేక నవ్వుతూ యాంకర్ వైపు చూసి గొణుక్కున్నాడు వెంకట్రామయ్య.

'ఆ... మీ ఆయన ముఖంలో ఆ'దురదా' కనబడుతోంది. సరే! మీ కంప్యూటర్ స్క్రీన్ మీద ప్రశ్న చూడండి.. జాగ్రత్తగా ఆలోచించి చెప్పండి? సమాధానం కరెక్టయితే కోటి రూపాయలు మీవే.. కాకపోతే.. మూడు లక్షల ఇరవైవేల రూపాయలకు పడిపోతారు' అని 'కంప్యూటర్‌గారూ.. ప్రశ్న చూపించండి..' అన్నాడు.

కొంతసేపు మ్యూజిక్ తర్వాత, కంప్యూటర్ తెరమీద ప్రశ్న ప్రత్యక్షమైంది. ఈ లోపల కాంతమ్మ ముఖమూ, వెంకట్రామయ్య బెదురుగొడ్డు ముఖమూ, యాంకర్ ముఖమూ మార్చి మార్చి చూపించారు.

కొంతసేపు సస్పెన్స్ తర్వాత, కంప్యూటర్ స్క్రీన్ మీద ప్రశ్న ప్రత్యక్షమైంది.

లక్ష్మీదేవి వాహనం ఏది?

వాటి సమాధానాలు

ఎ. పావురం బి. పిచ్చుక

సి. గుడ్లగూబ డి. లొట్టిపిట్ట

'జాగ్రత్తగా ఆలోచించి చెప్పండి. టైం లిమిట్ లేదు కాంతంగారూ.. కోటిరూపాయలు వస్తే మరేమి చేయదలచుకున్నారు?' ప్రశ్నించాడు యాంకర్.

'ఓ ఇల్లు కొనుక్కుని, ప్రపంచ యాత్ర చేసి, అప్పులు తీర్చి, మిగిలిన మొత్తం ధారాళంగా చారిటీకి ఇస్తాను. ఇంకా మిగిలితే.. మా వెంకట్రామయ్యకి కొత్త పంచెలచాపు కొనిస్తాను. ఆ అన్నట్టు.. వీటికి ముందు.. నాకు కావలసిన చీరలు కొనుక్కుని, బంగారు వడ్డాణం, కాసుల పేరు, రాళ్ళ నెక్లెస్ కొనుక్కుని.. ఆ తర్వాత దాన ధర్మాలు చేస్తాను. మాది దానధర్మాలు చేసే వంశం కూడాను.. అహ.. మరిచిపోయాను.. వెంటనే ఓ మామిడి పిందెల నెక్లెస్ మా అమ్మాయికి చేయిస్తాను. ఇంకా.. ఇప్పటికి ఇంతే!' కాంతం కన్ఫ్యూస్ అయిపోయి తికమకగా చెప్పింది.

యాంకర్ ముఖంలో చిరునవ్వు.

'ఒకే కాంతంగారు..' అని, 'అమ్మా కాంతం!

నువ్వు చెప్పినవన్నీ కొనడానికి ఈ కోటీ చాలదు. చాలా కోట్లు కావాలి. ఇంకా నయం. కూతురికి బంజారాహిల్స్‌లో మేడ, అల్లుడికి బీఎండబ్ల్యు కారు కొంటానని అనలేదు. మా తల్లే..' అని మనసులో అనుకున్నాడు.

'మీ కోటిరూపాయల ప్రశ్న జాగ్రత్తగా చూసి చెప్పండి. ప్రశ్న మరోసారి.. లక్ష్మీదేవి వాహనం ఏది? సమాధానాలు ఎ. పావురం బి. పిచ్చుక సి. గుడ్లగూడ డి. లొట్టిపిట్ట'

కాంతం, వెంకటరామయ్యల మధ్య తీవ్రంగా చర్చలు జరిగాయి.

'వీటిలో అన్నీ పక్షులే! ఈ గుడ్లగూబ కొంచెం తేడాగుంది. పిచ్చుక ఈ మధ్యన కనపడటం లేదు. అన్నీ కట్టగట్టుకుని ఎక్కడికో ఎగిరిపోయాయి. ఇక పావురాలు మన కాలనీలో తిరుగుతూనే ఉంటాయి. లొట్టిపిట్ట కొత్తరకం పిట్టలా ఉంది. గుడ్లగూబ'

వెంకటరామయ్య అందుకుని 'కాంతం గుడ్లగూబ అని అనుకుంటున్నా.. అది పక్షే!' అన్నాడు.

'గుడ్లగూబ పేరెత్తితే గూబ పగులుద్ది! డబ్బుల తల్లికి ఇలాంటి, అలాంటి వాహనం ఉండదు. గుడ్లగూబ ముఖం ఆడించుకుంటూ భలేగా చెప్పావు. మా లక్ష్మికి, మహాలక్ష్మికి ఓ 'మాంచి' వాహనం ఉంటుంది. అది నాకు తెలుసు. పైగా.. ఈ 'కోటీశ్వరుడు?' చివరాఖరి ప్రశ్నలు తికమకగా ఉంటాయట. మా ఫ్రెండ్ పేరిందేవి చెప్పింది'

'ఆలోచించు కాంతం. లొట్టిపిట్ట 'పిట్ట' జాతిది కాదు. అదో జంతువు'

'ఛస్! నీకేమీ తెలియదు. తప్పయితే నీ పని ఇంటికి వెళ్లాక..' కళ్ళతో బెదిరించింది కాంతం.

'ఏం నిర్ణయించారు? మీకింకా ఓ లైఫ్ లైన్ 'ఫోన్ ఎ ఫ్రెండ్' ఉంది' యాంకర్ మధ్యలో కలుగచేసుకుని అన్నాడు.

'నా బెస్ట్ ఫ్రెండ్ ఛాయాదేవికి ఫోన్ చేస్తా! నంబరు.. ఆ.. అది..' కాంతం యాంకర్‌కి ఓ ఫోన్ నెంబరు చెప్పింది.

ఛాయాదేవికి ఫోన్ వెళ్ళింది. ఛాయాదేవి ఫోన్ ఎత్తింది. యాంకర్ తానెవరో చెప్పి.. 'మీ ఫ్రెండ్ కాంతంగారు ఆఖరిప్రశ్నకి మీ సహాయం కోరుతున్నారు. మీరు ఆవిడ బెస్ట్ ఫ్రెండ్ అని చెప్పారు. ముందు ఆవిడ ప్రశ్న వినిపిస్తారు. ఆలోచించి సమాధానం చెప్పండి. మీకు ముప్పై సెకన్లు సమయం' అని 'కాంతంగారూ! మీరు మీ ప్రశ్న చెప్పండి' అన్నాడు.

'ఛాయా! ప్రశ్న విను.. లక్ష్మీదేవి వాహనం ఏది? ఒకటి.. పిచ్చుక.. రెండు.. పావురాయి.. మూడు.. గుడ్లగూబ.. నాలుగు.. లొట్టిపిట్ట. నాకు పిచ్చుక, పావురాయి కాదనిపిస్తోంది. ఇక మిగిలినవి లొట్టిపిట్ట.. గుడ్లగూబ.. నీ సమాధానం వెంటనే చెప్పు'

ఛాయాదేవి ఆలోచించి చెప్పింది. 'నేను లొట్టిపిట్ట అనుకుంటున్నాను. గుడ్లగూబ కాదు'

'ఛాయా! లొట్టిపిట్ట సరైన సమాధానం అని అనుకుంటున్నావా?' కాంతం అడిగింది.

'పక్కా! వన్ హండ్రడ్ పర్సెంట్.. నో డౌట్! కళ్ళుమూసుకు చెప్పెయ్' ఛాయాదేవి అరిచింది.

కొన్ని సెకన్ల తర్వాత..

గుయ్‌గుయ్‌మన్న శబ్దంతో లైన్ కట్టయింది.

కాంతం కాసేపు ఆలోచించి చెప్పింది.

ఆ సమాధానం విని వెంకటరామయ్య, యాంకరూ తుళ్ళిపడ్డారు.

'ఫిక్స్ చెయ్యమంటారా? ఆలోచించుకోవాలా?'

'అక్కరలేదు.. ఆన్సర్.. సి. గుడ్లగూబ ఫిక్స్'

కొన్ని నిముషాల తర్వాత యాంకర్ అనుమానంగా కాంతం ముఖకవళికలు చూశాడు. ఆ

## చతుర కథ

తర్వాత పెద్ద అరుపు. ఢాం.. ఢాం.. శబ్దాల తర్వాత యాంకర్ మళ్ళీ అరిచాడు. 'కాంతం గారూ! మీరు చరిత్ర సృష్టించారు. కోటి గెలిచారు.. హా.. హా.. హా..'

★ ★ ★

వీడ్కోలు సమయంలో యాంకర్ అడిగాడు. 'మీ బెస్ట్ ఫ్రెండ్ ఛాయాదేవి లొట్టిపిట్ట అంటే మీరు దాన్ని కాదని ఎలా అన్నారు? అంతకు ముందు మీ ఆయన వెంకటరామయ్యగారు 'గుడ్లగూబ' అంటే ఎందుకు కాదన్నారు?'

'కెమెరాలు ఆపెయ్యండి.. చెబుతాను'

కెమెరా ఆగింది. ఏవో యాడ్స్ వస్తున్నాయి.

కాంతం, యాంకర్‌తో నెమ్మదిగా చెప్పింది. 'మా ఆయన మాటలకేం గానీ.. ఈ ఛాయాదేవి సంగతి నాకు బాగా తెలుసు. కుళ్ళు పీనుగ! అది కావాలనే తప్పు చెబుతుందని నాకు తెలుసు! అందుకే అది చెప్పిన ఆప్షన్ కాకుండా.. రెండో ఆప్షన్ చెప్పాను'

'ఆ..'

Ⓒ




డా. కేశవరెడ్డి

# ఇన్‌క్రెడిబుల్ గాడెస్

*నిర్వహణ :*
**వి. రాజారామమోహనరావు**

**'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' నవల 1970 దశకంలో ఓ ప్రముఖ వారపత్రికలో ధారావాహికగా వెలువడింది. అప్పటికి రచయిత డా. కేశవరెడ్డి కొత్తవారు. నవలలోని వస్తువూ కొత్తదే. కథానాయకుడు రామచంద్రుడు అంటరానివాడు. అతని జీవనం పందుల పెంపకం! అతని కుటుంబం, పందులే ఈ నవలలో ప్రముఖంగా కనిపిస్తాయి. అంటరానివాడి కథ అయినా తర్వాత ఏం జరిగిందో చదవాలన్న ఆసక్తితో నడవడం ఇందులోని ప్రత్యేకత!**

'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' నవల అట్టడుగు వర్గాల కథ.. అవిశ్రాంత కష్టాల కొలిమి!

కుగ్రామాల్లో, అడవి ప్రాంతాల్లో జంతువులే జీవనంగా బతికేవాళ్ళలో మాల మాదిగలే ఎక్కువ. తరతరాలుగా వీళ్ళ మీద జరగని అన్యాయం లేదు. వీళ్ళు గురికాని దోపిడీ లేదు. అలాంటి వాళ్లలో రామచంద్రుడు ఒకడు. మాల కులం. ఊరు గంగపట్నం. రాయలసీమలోని కుగ్రామం. భార్య నాగ, కొడుకు కిష్టుడు.. అతడి సంసారం.

ఊరి పెదరెడ్డిని 'మాలపల్లి ముందరుండే పోరంబోకు చెక్కకుపట్టా చేసియ్యి సామి. గుడి సేసుకోవాల' అని ప్రాధేయపడ్డాడు రామచంద్రుడు. రెండేళ్ళు తన ఇంట్లో సేద్దిగాడుగా ఉంటే చేసిస్తానన్నాడు పెదరెడ్డి. దాంతో పెదరెడ్డింట్లో, పొలంలో రెక్కలుముక్కలు చేసుకొని చాకిరీ చేశాడు. ఆ చాకిరీని వివరిస్తూ.. 'పెదరెడ్డి పొలం సర్వస్వం రామచంద్రుడికి కరతలామలకం. ఆ నేల స్వభావం, ఎంత సత్తువ కలిగి వున్నదీ అతనికి తెలుసు. ఆ భూమిలోని ప్రతి అంగుళం అతని చెమటతో తడిసినదే, అతడు దున్నినదే అంటారు రచయిత.

పెదరెడ్డికీ రామచంద్రుడంటే ప్రత్యేకమే. 'ఈ మాలపల్లిలో వుండే యదవలంతా నాటు యదవలు గదరా! ఇంత ఊరిలో పేగులు, గుండెకాయా వుండే మొగాడు ఒక్కడైనా ఉన్నాడా? రామచంద్రునికుండే తెంపూ, తెగువా ఎవరికుంది? ' అనేవాడు.

రెండేళ్ల తర్వాత రామచంద్రుడు మళ్ళీ ప్రాధేయపడ్డాడు. మర్నాడే ఆ పని చేయిస్తానన్నాడు పెదరెడ్డి. సంతోషంతో ఆ రాత్రి నిద్దరే పోలేదు రామచంద్రుడు. తరతరాలుగా అతని వంశంలో ఎవరికీ ఆస్తి అన్నదే లేదు. తనో జాగాకి, వేసుకోబోయే ఇంటికి యజమాని!

మర్నాడు గుర్రబ్బండిలో పెదరెడ్డి, పరివారం- వెనకాల రాళ్ళల్లో, గతుకుల్లో పరిగెడుతూ రామచంద్రుడు.. పదిమైళ్ళు ప్రయాణం! కాలిబొటనవేళ్లు చెక్కుకుపోయి రక్తం ధార కట్టింది. అయినా లెక్కచేయలేదు. తనకు సొంతం కానున్న నాలుగు కుంటల నేల కోసం రిజిస్ట్రార్ ఆఫీసు ముందు కాచుక్కూచున్నాడు.

రామచంద్రుడిని ఆఫీసులోకి తీసుకెళ్లి, కొన్ని కాగితాల మీద వేలిముద్రలు వేయించి 'రేపటి నుంచి ఆ జాగా నీదే! ఇల్లన్నా కట్టుకో, ఉద్యానవనాలన్నా వేసుకో!" అన్నాడు పెదరెడ్డి.

మర్నాటి నుంచే రామచంద్రుడు, భార్య నాగ పార, పలుగులతో ఆ నేల బాగు చెయ్యనారంభించారు. రెండు వారాలకి కంప, రాళ్లు తొలిగాయి. మరి రెండు వారాలకి ఎత్తు పల్లాలు సమం చేసుకున్నారు. మరికొన్నాళ్లకి ఇల్లు తయారైంది. ఏడాదిగా అదే ఇంట్లో ఉంటున్నారు. తన ఇరవై పందులకి గూడు ఏర్పాటు చేశాడు. కొడుకు కిష్టుడికి మూర్చరోగం తగ్గింది. అంతా బాగుంది. ఆ ఇల్లు

కలిసొచ్చిందని మురిసిపోయారా భార్యాభర్తలు.

నవల ఇక్కడ మొదలు పెట్టారు రచయిత. పెదరెడ్డికి రామచంద్రుడి మీద పిచ్చి కోపం వచ్చింది, ఆయన పిలవగానే కోర్టుకి వచ్చి దొంగ సాక్ష్యం చెప్పలేదని. దానివల్ల పెదరెడ్డికి నష్టమేం జరగలేదు. మాల గూడెమంతా ఆ దొంగసాక్ష్యం చెప్పింది. కేసు ఆయనే గెలిచాడు. అయినా ఓ మాల ఎదవ తనమాట కాదన్నాడని కసి.

దాంతో రామచంద్రుడి ఇంటిజాగా అతనిది కాదన్నాడు పెదరెడ్డి. తెల్లారేసరికి ఇల్లు ఖాళీ చేయాలన్నాడు. పట్టా చేసిచ్చిన పోరంబోకు, ఏడాదిగా ఉంటున్న ఇల్లు.. తనది ఎలా కాకుండా పోతుందో అర్థంకాలేదు రామచంద్రుడికి. ఆ రాత్రే రెడ్డిగారింటికి న్యాయం కోసం వెళ్లాడు. ఆయన కనబడలేదు. అతని తొత్తులు, రామచంద్రుడి కులపోళ్లే అతడ్ని చితక్కొట్టారు. ఎలాగో ఇల్లు చేరాడు. తెల్లారింది. అంతా అయోమయంగా ఉందతనికి.



పెదరెడ్డి శక్తి సామర్థ్యాలు రామచంద్రునికి సుపరిచితమే. అయినా జరుగుతున్న అన్యాయం సహించగలిగేలా లేదు. అసహాయత, దైన్యం వివశుడ్ని చేశాయి. సంధిప్రేలాపన మొదలుపెట్టాడు 'నా యింటి మీద చెయ్యేసినాడి ఎవికలేరి కుప్పపెట్టేస్తా. నా కష్టం తిని, నా నోట్లో దుమ్ము కొట్టేవాడికి మంచి సావు రాదు, నా యింటెనక దిబ్బపురుగై పుడతాడు' అంటూ. తర్వాత పెళ్లాన్నీ తిట్టాడు. ఆక్రోశపడ్డాడు. లోకంలో న్యాయమే లేదనుకున్నాడు.

మరికాసేపటికి అక్కడికి ఓ జీపు వచ్చింది. దాని వెనకాలే మాలగూడెం అంతా వచ్చింది. పార, పలుగులతో పెదరెడ్డి తొత్తులొచ్చారు. పోలీసులూ వచ్చారు. ఓ పెద్ద డ్రామా నడిచింది. రెవెన్యూ వాళ్లదగ్గర రామచంద్రుడి జాగా పోరంబోకేనని వుంది. పోరంబోకులో ఇల్లు కట్టుకుని ఖాళీ చెయ్యటం లేదని పెదరెడ్డి కంప్లైంట్ ఇచ్చాడు. ఆ జాగా తన పేరు మీద పట్టా అయినట్టు రామచంద్రుడి దగ్గర ఏ కాగితమూ లేదు. సత్యాన్ని నమ్మటమే తప్ప, దాని తాలూకు ఆధారమేం వాడి దగ్గర లేదు. వాడే కాదు, ఆ మాలలందరూ అంతే! పెదరెడ్డి కాళ్ల దగ్గర పడి ఉంటేనే బతుకు. లేకపోతే హింసే. చిత్రమేంటంటే వాళ్ళ వాడిని వాళ్ళే హింసిస్తారు. రామచంద్రుడు కాళ్ళావేళ్ళా పడ్డాడు. ఏడ్చాడు. ఏ ఒక్కరూ రామచంద్రుడి పక్షం నిలవలేదు. పైగా పెదరెడ్డి చెప్పినట్టు దొంగసాక్ష్యం చెప్పకపోటం రామచంద్రుడి నేరమన్నట్టు ఈసడించారు.

రామచంద్రుడి రెండేళ్ళ గొడ్డు చాకిరీ, వాడి ఆశల గూడు.. ఆ ఇల్లు నిలబడుతుందా? లేదా? అన్న ఉత్కంఠతో పాఠకులు గుండెలు అరచేత పట్టుకుని చదివేంత అద్భుతంగా రాయగలిగారు రచయిత.

రామచంద్రుడి ఇంటి మీద గునపం పోటు పడింది. అది వాడి గుండెలో దిగినట్టయింది. కొద్దిసేపట్లోనే ఇల్లు నేల మట్టమైంది. నవలలో మొదటి అధ్యాయం ఇది. మలి అధ్యాయం రామచంద్రుడు కుటుంబంతో, పందులతో ఊరు విడిచి అగమ్యగమనం సాగించటం.

తన ఇంటిని కూలదోయించిన పెదరెడ్డికి, కూలదోసిన గంగపట్నం హరిజనులకు దూరంగా పోవాలన్నదే రామచంద్రుడి ఆలోచన. ఎక్కడికి వెళ్ళాలో? ఎలా బతకాలో? తెలియదు.

భార్య, కొడుకు, ఓ చెక్కపెట్టె, ఇరవై పందులు.. ఇవే అతనికి మిగిలినవి. రోడ్డెక్కింది ఆ కుటుంబం. ఓ లారీ అతని సాయంతో రెండొందల మైళ్ళు ప్రయాణం చేసి, ఓ పాడుబడ్డ సత్రానికి చేరారు. అందులోని సాధువు ఆనూపానూ చెప్పాడు. సత్రానికి కొంచెం దూరంలో ఓ ఊరుంది. పేరు 'పొంటిల్లు'. అన్నీ పాకలే. ఇంటికప్పులు కూడా సరిగా లేని పాకలు. ఒకే ఒకటి మూడంతస్తుల భవంతి! అది ఆ ఊరి మునసబుది. అతనూ పెదరెడ్డి లాంటివాడేనని తెలిసింది. ఇక్కడా అన్నీ మునసబువే. ఊరంతా పేద మాలలు. అంతా మునసబు తొత్తులే.

రామచంద్రుడి పందుల్లో మూడు ఈనటానికి సిద్ధంగా ఉన్నాయి. ఇక ప్రయాణం కుదరదు. కొద్దిరోజులు ఆగాలి. అక్కడే ఉండి, మునసబు దగ్గర కూలిపని చేసుకుందామని వెళ్ళి అడిగాడు. కొబ్బరితోటలో పని ఇచ్చాడు మునసబు. ఒక చెట్టు కొడితే మూడు రూపాయలు కూలి. ఎన్ని చెట్లు కొడితే అన్ని మూళ్లు! ఆ ఆశే రామచంద్రుడి

# సమాజపు లోతులు ముట్టిన రచయిత!



డా. పి. కేశవరెడ్డి ప్రముఖ తెలుగు నవలా రచయిత. చిత్తూరు జిల్లాలోని తలుపులపల్లిలో ఓ రైతు కుటుంబంలో జన్మించారు. పాండిచ్చేరి యూనివర్శిటీలో ఎం.బి.బి.ఎస్ పూర్తి చేసి నిజామాబాద్‌లోని విక్టోరియా ఆస్పత్రిలో వైద్యవృత్తి చేపట్టారు. గ్రామీణ సమాజపు రూపురేఖలను, అంతఃసంఘర్షణలను లోతుల్లోకి వెళ్లి చిత్రీకరించిన రచయితగా ప్రసిద్ధి చెందారు. దళితులు, గిరిజనులు, స్త్రీలు.. అణచివేతకు గురయ్యే సమూహాల పట్ల సంవేదనతో రచనలు చేసిన ప్రగతిశీల రచయితగా గుర్తింపు పొందారు.

'అతడు అడవిని జయించాడు, మునెమ్మ, మూగవాని పిల్లనగ్రోవి, శ్మశానం దున్నేరు, సిటీ బ్యూటిఫుల్, చివరి గుడిసె, రాముడుండాడు రాజ్జముండాది, ఇన్‌క్రెడిబుల్ గాడెస్' వంటి అద్భుతమైన రచనలు అందించారు. ఆయన స్వీకరించిన ఇతివృత్తాలు చాలా క్లిష్టమైనవి. సాధారణ వ్యక్తులు ఊహించలేనివి కూడా. వర్ణవ్యవస్థను, వర్గాన్ని, భూస్వామ్యాన్ని, దాని నిజస్వరూపాన్ని బట్టబయలు చేసిన రచనలు ఆయనవి. కేశవరెడ్డి రచనల్లో ఉద్యమాల ప్రస్తావన నేరుగా ఉండదు కానీ ఆయా పాత్రల ద్వారా పాఠకులకు గోచరమవుతుంది. సమాజంలోని వైరుధ్యాల చిత్రణ కళాత్మకంగా ఉంటుంది. అందుకు 'చతుర'లో ప్రచురితమైన 'మునెమ్మ' ఉదాహరణ. హెమింగ్వే, స్టెయిన్‌బాక్, విలియం ఫాక్‌నేర్ వంటి మహా రచయితల ప్రభావం ఆయనపై ఉండేది.

పాలిట శాపమైంది. ఇక్కడా రామచంద్రుడు తొత్తులా మారలేదు. ఆత్మాభిమానంతోనే ఉన్నాడు. అది మునసబుకి రుచించలేదు.

మేతకెళ్లిన పందులు మునసబు చెరుకుతోటలో ఎరువుగా వేస్తున్న గానుగపిండి తినేశాయి. దాంతో మునసబు మాల సేద్దిగాళ్ళు పందుల్ని దారుణంగా కొట్టి చంపేశారు. రామచంద్రుడు అల్లాడిపోయాడు. ఇల్లే పోయిందనుకుంటే, ఇప్పుడు పందులూ పోయాయి. ఎంత లేదన్నా ఐదు వేలు ఖరీదు చేసేవి. గంగ జాతరపుడు అమ్ముదామని అనుకున్నాడు. ఇదిలా ఉంటే, కొబ్బరిబొండాం కోసం మునసబు చెట్టెక్కిన కిష్టుడు, చెట్టు మొవ్వ దగ్గరుంచిన బ్లేడ్‌ముక్కలు కోసుకుని తొడలు తెగి, పట్టుజారి కింద పడి చచ్చిపోయాడు. ఒక్కరోజులోనే కన్నకొడుకు, పెంచుకున్న పందులూ చచ్చిపోవడంతో రామచంద్రుడి జీవితం శవప్రాయమై పోయింది.

విధివశాత్తు, రామచంద్రుడికిలా జరిగిందనిపించినా, నిజానికి దాని వెనకాల, ఆ ఊరి తాలూకు అమానుష క్రౌర్యం, తోటి మాలవాడి పట్ల ఇసుమంత జాలిలేని మాలల ఉదాసీనతా, ముఖ్యంగా వాళ్ళు దేవతలా కొలిచే మునసబు పట్ల గుడ్డి భక్తి, విశ్వాసాలు దీనంతటికీ కారణం. గంగపట్నంలోనూ అంతే. అక్కడ దైవం పెదరెడ్డి. ఈ రెండు ఊళ్ళలోనే కాదు, రాయలసీమలోని చాలా గ్రామాల్లో ఇదే పరిస్థితి ఉందని రచయిత అభిప్రాయం.

జనం చచ్చిపోయినా మునసబుకి లెక్కలేదు. అతనికి కొబ్బరికాయలే ముఖ్యం. అధికారులు, పోలీసులు ఇలాంటి క్షుద్రదేవతలకి మద్దతు!

సర్వం పోగొట్టుకున్న రామచంద్రుడు మరో ఊరికి సాగిపోయాడు. అక్కడా అంతే! సంఘటనలు వేరు తప్ప, సమాజం రంగు అదే. న్యాయం, ధర్మం అన్న మాటే లేదు.

నవల చివరలో రామచంద్రుడి ముఖం మీద తాగుబోతు రెడ్డితో కాండ్రించి ఉమ్మేయించాడు. అగ్నిప్రమాదంలో చిక్కుకున్న ఆ తాగుబోతు బొబ్బల ఉపశమనానికి, గుళ్ళోని దీపం శెమ్మిలోని నూనె తీసుకురావటానికి రామచంద్రుడు సాహసించలేదు. మాలోడు గర్భగుడిలోకి వెళ్ళకూడదన్న సంప్రదాయం!

నవల ముగింపు ఓ అమానుష పరిస్థితికి ప్రతీక. దేశంలో అందరు మాలలు ఇలాగే లేకపోవచ్చు. కానీ మెజారిటీ ఇంతే అన్నది రచయిత విశ్వాసం.

ఇన్‌క్రెడిబుల్ గాడెస్‌కి తెలుగు అర్థం 'క్షుద్ర దేవత' అంటూ ఆరంభమైంది ఈ నవల. క్షుద్ర దేవతల రూపంలో ఉన్న అమానుష వ్యక్తులకి భక్తి విశ్వాసాలతో సేవ చేస్తున్న మాలల జీవితాన్ని కళ్ళకు కట్టిన రచన ఇది. ©

# చతుర ప్ర.జ.

## పాఠకుల ప్రశ్నలకు ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస డా. కె. రామానుజాచార్య సమాధానాలు



ప్ర. శ్రీరామ పట్టాభిషేకం చిత్రపటంలో లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల భార్యలు లేకపోవడంలో ఆంతర్యమేమిటి?

– వి. సన్యాసయ్య, తుని

జ. శ్రీరామ పట్టాభిషేకం అని మీరే అంటున్నారు. పట్టాభిషేకంలో ఆ సింహాసనం పక్కన, ముందు, కింద, పైన మగవారే ఉంటారు కానీ ఆడవారు ఉండరు. పట్టాభిషేకం సీతారాములకు కదా! సీతారాములు ఉంటారు. వారికి సేవలు చేస్తున్న తమ్ములు, భక్తులు, రుషులు ఉంటారు. సింహాసన ప్రాంతంలో బహిరంగంగా మరదళ్ళు నిలబడి సేవ చేయటం రాచమర్యాదలకు, కుటుంబ సంప్రదాయానికి విరుద్ధం. వారి తల్లులు కౌసల్య, సుమిత్ర, కైకేయిలు, విభీషణ సుగ్రీవాదుల భార్యలు, కొందరి రుషుల భార్యలు, అంతఃపురస్త్రీలు.. ఇలా వారంతా పట్టాభిషేకాన్ని చూడటానికి వారికి కేటాయించిన చోట కూర్చుంటారు. మొత్తం సభాప్రాంగణాన్ని చిత్రీకరించినప్పుడు అందరూ కనిపిస్తారు.

ప్ర. శ్రీరామనవమి, శ్రీకృష్ణాష్టమి పండుగలను భక్తిశ్రద్ధలతో జరుపుకునే మనం అష్టమి, నవమి రోజుల్లో ముఖ్యమైన పనులు మొదలుపెట్టడానికి ఎందుకు వెనుకాడుతాం?

– యు. విజయశేఖరరెడ్డి, భాగ్యనగర్ కాలనీ, హైదరాబాద్

జ. శ్రీరామనవమి, కృష్ణాష్టమి భగవానుడు అవతరించిన రోజులు. అమావాస్యనాడు పుట్టినా పండుగ చేసుకుంటాం. అమ్మవారి పండుగను దీపావళి అమావాస్యనాడు జరుపుకుంటాం. అమావాస్యనాడు శుభకార్యాలను ఆచరిస్తామా? పండుగలు, పుట్టినరోజులు వేరు. శుభకార్యాలకు ముహూర్తాలు వేరు. అయినా అష్టమి, నవమి నాడు ప్రయాణం చేయరాదు. ఉపనయనం, అక్షరస్వీకారం, కేశఖండనం, గృహప్రవేశం చేయరాదు. అష్టమి జయ తిథి. కొన్ని పనులు.. కొనటం, అమ్మటం వాహనాలు తీసుకోవడం ఇత్యాది కార్యక్రమాలు చేస్తూనే ఉన్నాం. వివాహాలు అష్టమి, నవములలో చేస్తూనే ఉన్నాం. అన్ని కార్యక్రమాలకు ఒకే తిథి పనికిరాదు. ఒక్క తిథులే కాదు, కొన్ని నక్షత్రాలూ కొన్ని కార్యక్రమాలకు పనికిరావు. నక్షత్రాలు, నక్షత్రాధిపతులు, తిథులు, అధిపతులు, వారాలు, వారాధిపతులు, వారి స్వభావాలు.. ఇవన్నీ చాలా ఉంటాయి. అదొక మహాసముద్రం.

ప్ర. శంతనమహారాజు కుమారుడు చిత్రాంగదుడు అదే పేరుగల గంధర్వునితో యుద్ధం చేసి మరణించాడని భారతంలో ఉంది. ఆ యుద్ధ కారణమేమి? వారిలోకాలు వారికుండగా యక్షులకు, గంధర్వులకు భూలోకంలో పని ఏమిటి?

– వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి

జ. ఎవరి రాజ్యాలు వారికుండగా, ఎవరి సంపదలు వారికుండగా, ఎవరి భార్యలు వారికుండగా ఇతరుల ఆస్తుల కోసం ఎందుకు ప్రయత్నిస్తున్నారో తెలుసుకదా! అసంతృప్తి, ఆశాపాశాలు, ద్వేషాసూయలు, తనకన్నా బాగా.. గొప్పగా.. ధనవంతునిగా.. బలవంతునిగా ఇంకొకరు ఉండొద్దు! ఈ బుద్ధి ఒక మానవులకే కాదు.. దేవతలకు, యక్షులకు, రాక్షసులకు, గంధర్వులకు, సకల జీవరాసులకు ఉంటుంది. అంత ఎందుకు? ఒక కుక్క తనకు దొరికిన దానిని తింటూనే పక్క కుక్క తింటున్నదానిని చూసి, తాను తింటున్నదానిని విడిచి దానికోసం ఆ కుక్కతో కయ్యమాడుతుంది. అదే ఒక కోడి తనకు ఆహారం దొరికితే, పక్క కోడిని పిలిచి




# చతుర ప్ర.జ.8



ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ఉప న్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణన లోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

పెడుతుంది. ఒక కాకి చనిపోతే వంద కాకులు అక్కడ చేరి అరుస్తూ తమ సంతాపాన్ని ప్రకటి స్తాయి. అందుకే బతుకులో కోడిని, చావులో కాకిని చూసి నేర్చుకోమంటాడు భర్తృహరి. ఈర్ష్య, అసూయాద్వేషాలే అన్ని యుద్ధాలకు కారణం అని తెలియాలి.

ప్ర. శకునశాస్త్రం అన్ని మతాలవారికీ వర్తి స్తుందా?

– ఎ. పూర్ణచంద్రరావు, విశాఖపట్నం

జ. సకల మానవుల ఆచార వ్యవహారాలు, విధి విధానాలు, అలవాట్లు, ఆవేశకావేశాలు ఒకే విషయాన్ని బోధిస్తాయి. తాను తలపెట్టిన పని విజయమంతం కావాలి! తననుకున్న సిరిసంపద లను సంపాదించాలి! అందరి కంటే గొప్ప కీర్తిని సాధించాలి! అందరూ నన్నే గౌరవించాలి! నా మాటే అందరూ వినాలి! దీనికి అనుగుణంగా కొన్ని నియమాలు.. విధానాలు నిర్దేశించుకుం టారు. ఒక్కొక్కరూ ఒక్కో విధానాన్ని అమలు చేస్తారు. కొందరు 'సిక్త్ సెన్స్' అంటారు. కొందరు భవిష్యవాణి అంటారు. మరికొందరు జరుగుతున్నవాటికి, జరగబోవువాటికి సూచన లుగా స్వీకరిస్తారు.. ఆలోచిస్తారు. వాటినే శకు నములు అంటారు. శకునము అంటే సూచన. అత్యవసరమైన పనిమీద ఎన్నో ఆలోచనలతో, ఆశలతో బయలుదేరుతున్నా ముందడుగు వేయ గానే చేతిలోని సంచి జారి పడింది. ఏమను కుంటాం? ఇదేదో జరుగబోవు దానికి సూచనో? అనుకున్న డబ్బు రాదనో? వచ్చినా సంచిలాగే చేజారిపోతుందా? అని ఆస్తికులు, నాస్తికులు అందరూ భావిస్తారు.. ఆలోచిస్తారు. వీరు చెబు తారు.. వారు చెప్పరు.. అంతే తేడా! అలాంటిది జరిగినప్పుడు భగవన్నామస్మరణ చేసుకొని ఇంకా సమయముంటే కాళ్ళు చేతులు కడుగుకొని ఆచ మనం చేసి హరినామస్మరణ చేసి సాగాలి.

ప్ర. విష్ణుసహస్రనామస్తోత్రం ఫలశ్రుతిలో 'శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్' అన్నచోట ప్రాప్నోతి, అనుత్తమమ్ అని విపరీతార్థం వస్తోంది. ఎలా పరిష్కారం?

– హెచ్.ఎ.ఆర్. సూర్యనారాయణ

జ. అనుత్తమం అంటే మీరనుకున్నట్లు విపరీ తార్థం కాదు. అనర్థమేమీ లేదు. సంస్కృత భాష రాక, వచ్చినా వ్యాకరణం తెలీక, వచ్చిన అపార్థం ఇది. అనుత్తమం అంటే ఉత్తమమైది కాదు అని భాష రాని వారు భావిస్తారు. అనుత్తమం అంటే 'నాస్తి ఉత్తమం యస్మాత్' అని సమాసం. 'దేని కంటే శ్రేష్ఠమైనది లేదో' అని అర్థం. అంటే అన్నిటి కంటే ఉత్తమమైనది. దీనిని మించిన ఇంకొక ఉత్తమమైనది లేదు అని అర్థం. 'అమూల్యం' అంటే అర్థం వెల లేనిది అనా? వెలకట్టలేనిది అని అర్థం. దానికంటే విలువ కలది ఇంకొకటి లేదు అని అర్థం.

కావ్యభాషలో వ్యవహార ప్రౌఢిలో భాషా సొబ గులలో ఇటువంటివి చాలా ఉంటాయి. 'అబ్బా! నీవు చేసిన మేలు మరిచిపోలేను!' అని శత్రు వును ఉద్దేశించి అన్నాడంటే అర్థమేమిటి? తిట్టే సాహసం లేక 'దుర్మార్గుడా! నీ అపకారాన్ని జన్మలో మరిచిపోలేను' అని అర్థం. అది వానికి తెలుస్తుంది. ఇటువంటివి భాషాయోషాలంక రాలు. ఇవే మానవునికి నిజమైన నిధినిక్షేపాలు.

ప్ర. రాధాకృష్ణుల ఆలయాలున్నాయి కానీ కృష్ణునికి మిగతా భార్యలతో ఆలయాలు లేకపో వడానికి కారణమేమిటి? రాధాకృష్ణుల సంబం

# రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. భగవద్గీత చనిపోయిన వారి కర్మకాండలప్పుడే వినిపిస్తున్నారు, శుభకార్యాలప్పుడు వాడకపోవడంలో ఔచిత్యం ఏమిటి? మూఢనమ్మకమా? అవగాహనా రాహిత్యమా?

**– వెల్మల భాగ్యలక్ష్మి,**
హుజూరు, కరీంనగర్ జిల్లా

**జ.** ఇది పూర్తిగా అవగాహనా రాహిత్యమే! జీవాత్మ, పరమాత్మ, శరీరము, ప్రకృతి వాటి స్వరూప స్వభావాలను మానవుడు నిరంతరం తన జీవన మార్గంలో ధ్యానిస్తునే ఉండాలి. వ్యక్తిత్వ వికాసానికి సమగ్ర శిక్షణ ఇచ్చే గ్రంథం భగవద్గీత. సమాజ సంక్షేమాన్ని సామరస్యాన్ని సుహృద్భావాన్ని పెంచుతుంది. సంకల్ప బలాన్ని, ప్రయత్న దార్ఢ్యాన్ని చెప్పేది భగవద్గీత.

అహంకారాన్ని, మమకారాన్ని పూర్తిగా విడిచిపెట్టే యే కార్యాలైనా ఆచరించాలి అని చెప్పేది భగవద్గీత. నాకే కావాలి, నాదే కావాలి అనే స్వార్థం అనర్థదాయకం. పరోపకారం పరుల సేవయే పరమార్థం. పాండవులు తమ రాజ్యానికై కాదు యుద్ధం చేసింది. ధర్మరాజ్యం కోసం, ధర్మస్థాపన కోసం. అందుకే అంత యుద్ధం చేసి ప్రాణాలను పణంగాపెట్టిన పాడవులు 35 సంవత్సరాలే పరిపాలించి స్వర్గారోహణం చేశారు. అంటే అది రాజ్యయుద్ధం కాదు. ధర్మయుద్ధం. ఇపుడు మనవాళ్ళు ధర్మాన్ని, ధర్మయుద్ధాన్ని మరణంలోనే మరణంతోనే వింటున్నారు. గీత ఒక్కవేదాంతాన్నే చెప్పటంలేదు. సుఖమయ జీవనాన్ని, ఉత్తమ సమాజాన్ని, వ్యక్తిత్వ ధర్మాన్ని, వ్యక్తిత్వ వికాసాన్ని బోధిస్తుంది. ఎల్లవేళలా వినాల్సిన గ్రంథమిది.

ధాన్ని వివరించగలరు?

**– బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్**

**జ.** రుక్మిణీసత్యభామాసమేత శ్రీకృష్ణ భగవానుని ఆలయాలు చాలా ఉన్నాయి. రుక్మిణీ కృష్ణులకు ఆలయాలు ఉన్నాయి. నీలా కృష్ణుల ఆలయాలున్నాయి. రాధారుక్మిణీ సత్యభామాసమేత శ్రీకృష్ణ భగవానుని ఆలయాలున్నాయి. రుక్మిణీదేవి అంటే లక్ష్మి. అనగా శ్రీదేవి. సత్యభామ అంటే భూదేవి. ఇక నీలా నీలాదేవియే! శ్రీభూనీలా సమేతంగా శ్రీమన్నారాయణుడు వైకుంఠంలో ఉంటాడని అన్ని పురాణాలు చెబుతున్నాయి. మనకు వేదంలో కూడా శ్రీదేవి భూదేవి నీలాదేవుల పేర్ల మీద శ్రీసూక్తం, భూసూక్తం, నీలాసూక్తాలున్నాయి. ఇక రాధాకృష్ణుల మీద చాలామందికి చాలా సందేహాలున్నాయి. బ్రహ్మవైవర్త పురాణం చదవితే అన్ని సందేహాలు తీరుతాయి. ఆ పురాణానుసారం గోలోకమే అన్నిలోకాల కంటే ఉత్తమలోకం. రాధాకృష్ణులే ఆది దంపతులు.. మూల దంపతులు. వారి నుంచే లక్ష్మీనారాయణులు, బ్రహ్మాసరస్వతులు పుట్టారు. శ్రీకృష్ణపరమాత్మ అంటే నారాయణుడు, శంకరుడు, బ్రహ్మ. రాధ అంటే లక్ష్మి, పార్వతి, సరస్వతి. అన్ని నదులు, అన్ని జలాశయాలు, అన్ని అరణ్యాలు. శ్రీకృష్ణభగవానుడు రాధ కోసమే గోవులను సృజించాడు. శ్రీకృష్ణభక్తులలో శ్రేష్ఠులే దేవతలు. ఇలా సకల దేవతాశ్రేష్ఠుడు శ్రీకృష్ణుడు. సకల శక్తులలో రాధయే పరదేవత.

ప్ర. స్వర్గస్థులైన నా తల్లిదండ్రులకు ప్రతియేటా ఆబ్దికం పెట్టడానికి ఆరోగ్యపరంగానూ, ఆర్థికంగానూ ఇబ్బందిగా ఉంది. దీనికి ప్రత్యామ్నాయం ఏదైనా ఉందా?

**– రామకూరు నాగేశ్వరరావు, శ్రీకాకుళం**

**జ.** ఆరోగ్యపరంగా ఇబ్బంది ఉంటే ఇతరులకు దగ్గర సంబంధం ఉన్నవారికి అయ్యే ఖర్చు ఇచ్చి వారితో చేయించవచ్చు. అలాంటి వారు ఎవ్వరూ లేకుంటే దేవాలయాల్లో పూజారులకు డబ్బులు, భోజన సామగ్రి ఇచ్చి మా అమ్మనాన్నల పేరు మీద భోజనం చేయమని చెప్పవచ్చు. అలాంటి వారు దగ్గరలో లేకుంటే ఆ రోజు అనాథలకు, అభాగ్యులకు భోజనం పెట్టించవచ్చు. ఇక ఆర్థికంగా ఇబ్బంది నిజంగా ఉంటే అంటే మనకు తినటానికే గడవని స్థితి ఉంటే నదిలో స్నానం చేసి మనసారా తల్లిదండ్రులను తలచుకొని తర్పణాలు విడవాలి. ముగ్గురు తినగలిగితే అందులో ఒకరికి అమ్మానాన్న పేరు మీద భోజనం పెట్టాలి. ఆనాడు అంటే తిథినాడు ఏమీ లేకుంటే తరువాత సమకూరిననాడే తిథిని చేయాలి. మన కున్ననాడు, మనకున్న దానితో మన భక్తిశ్రద్ధలను తల్లిదండ్రులకు నివేదించుటకే శ్రాద్ధం పెట్టాలి అని తెలుసుకోండి.

## కాలాతీతం

నోబెల్ గ్రహీత
**సాల్ బెల్లో**

# డాంగ్లింగ్ మాన్

డిసెంబర్ 15, 1942 - ఏప్రిల్ 9, 1943 మధ్యకాలంలో కథానాయకుడు జోసెఫ్ రాసుకున్న డైరీ రూపంలో ఉంటుంది 'డాంగ్లింగ్ మాన్' నవల. అతడి ఆలోచనలు, మీమాంస, సదసత్సంశయాలు, ఆందోళనలు, అస్తిత్వసమస్యల గురించిన మేధోమథనం ఇందులోని కథా వస్తువు. అంటే ఆత్మ-లోకంలోని అపరిచిత లోకాలకు చేసిన ప్రయాణం.

ఇంటర్ అమెరికన్ ట్రావెల్ బ్యూరోలో ఉద్యోగం చేస్తుంటాడు జోసెఫ్. సైన్యంలో చేరాలని ఆదేశాలు రావటంతో ఉద్యోగానికి రాజీనామా చేసి, రోజులు లెక్కపెట్టుకుంటూ కూర్చుంటాడు. కథ ప్రారంభమయ్యేనాటికి అతడు ఉద్యోగం మానేసి ఏడునెలలు దాటింది. ప్రభుత్వం అంటే కొయ్యగుర్రం లాంటిది. ఇక ప్రభుత్వోద్యోగుల లక్షణం అవినీతి.. అనాసక్తత.. జీతం తీసుకుంటున్నందుకు కొంతయినా పనిచెయ్యాలనే ఆలోచన ఏ కోశానా లేకపోవడం. జోసెఫ్‌కు ఎంతకూ సైన్యం నుండి ఆదేశాలు రానేరావు. నాగరిక జీవితమా? సైనిక జీవితమా? తేల్చుకోలేని సందిగ్ధతలో కొట్టుమిట్టాడతాడు. క్రమంగా సహనం నశిస్తుంది. ఆందోళన పెరుగుతుంది. మనశ్శాంతి కరువవుతుంది. ఈ బలవంతపు విశ్రాంతిని అధ్యయనానికి వినియోగించాలనుకుంటాడు. ఫ్లాటు ఖాళీ చేసి, ఒక చిన్న గదిలో భార్య ఈవాతో గడుపుతాడు. భర్త కోపతాపాలను - నిశ్శబ్దంగా భరిస్తుంది ఈవా. నిస్సహాయతతో జోసెఫ్‌లో నిరాశ పెరుగుతుంది. చేసేది, చెయ్యగలిగిందీ లేక మరింత ముడుచుకుపోతాడు. 'నాలోని మరో నేను' అనే భావన అతడి దృక్పథాన్ని శాసిస్తుంది. ఈ 'నిజమైన నేను' ఎవరో తెలుసుకోవటానికి జోసెఫ్ చేసిన ప్రయత్నమే 'డాంగ్లింగ్ మాన్'.

'ఒకప్పుడు తనెంతో ఉన్నతులూ, సంస్కారవంతులూ, ఈ చీకటి లోకంలో వెలుగురేఖలు అనుకొన్న మిత్రుల అసలు స్వరూపం తెలిసివచ్చింది.



చాలా చవకబారు మనుషులు వాళ్లు. మాటలకు, చేతలకూ అస్సలు పొంతన లేదు. నిబద్ధత లేదు. ఇతరులకన్న గొప్పవాళ్లమనే భ్రమ కల్పించటం, తాము స్వయంగా ఆ భ్రమలో ఉండటం తప్ప నిజాయితీ లేని మనుషులు' ఇలా రాసుకుంటూ పోయాడు డైరీలో. నమ్మిన కాళ్ల కింద భూమి తొలుచుకుపోయినప్పుడు పరాయీకరణ ప్రారంభమవుతుంది. సోదరుడు అమోస్ పట్ల అభిమానం తగ్గుతుంది. అతడి కూతురు తనను 'ముష్టివాడు' అన్నందుకు చెంపలు వాయిస్తాడు. ఆ తర్వాత అమోస్ నుండి ఏ రకమైన ఆర్థిక సహాయమూ అంగీకరించడు. తన అత్తమామలు చూపిన కృత్రిమ సానుభూతిని ఏవగించుకుంటాడు. గర్ల్‌ఫ్రెండ్ ద్రోహం చేసి మరొకరితో పోతుంది. భార్యను ప్రేమించలేడు. చివరికి తన మీద తనకే అసహ్యం వేస్తుంది. ఆత్మలేని ఆత్మ లోకంలో ఒంటరిననుకొంటాడు.

కొంతకాలం క్రితం ఉన్నత విలువల్ని బోధించిన సెర్వేటియస్ పార్టీలో సభ్యుడతడు. అక్కడ ఒక ప్రశ్నకు జవాబు చెప్పవలసి వచ్చినప్పుడు పరాయీకరణ ప్రారంభమైంది. 'సత్పురుషుని జీవన విధానం ఎలా ఉండాలి? అతని కార్యాచరణ ఏమిటి? '- అంటే ఆదర్శాల గురించిన చర్చ అది. ఆదర్శాలకూ, వాస్తవజీవితానికీ మధ్య ఉన్న వ్యత్యాసాన్ని ఎలా పూరించటం? అర్థహీనంగా, గందరగోళంగా కనిపిస్తున్న ఈ లోకంలో భగవంతుడు, కళ, డబ్బు అంటూ కొన్ని ఆదర్శాలు అవసరం. కానీ వీటివల్ల గందరగోళం సమసిపోదు, అర్థహీనమైన ప్రపంచం అర్థవంతంగా మారదు. హేతుబద్ధత ఒక్కటే మనిషికి చుక్కాని. కానీ పరాజయాలను అతిక్రమించటం ఎలా? ప్రత్యామ్నాయాల ప్రవాహంలో కొట్టుకు పోతాడు జోసెఫ్. కాదు, మునిగిపోతాడు. తన మెడకున్న బండరాయి పేరు సందిగ్ధత. ప్రత్యామ్నాయ లోకంలో ఎదురైన మరో ప్రశ్న - ఎలా బతకటం? స్వేచ్ఛకు, విముక్తికి మూలం ఆత్మ జ్ఞానం. ఇదే అన్ని ఇతర జ్ఞానాలకూ మూలం. ఇదిలేక, మిగతా విషయాలేవీ అర్థం కావు - తన భవిష్యత్తును తాను నిర్మించుకోలేడు. అప్పుడే మరో ప్రశ్న ఉదయిస్తుంది. 'నీ నుండి నువ్వు వేరుగా వున్నాననుకుంటున్నావు. అంటే నీ గమ్యం, నీలో ఉన్న మరో వ్యక్తి గమ్యం వేర్వేరు అనుకుంటున్నావా?'

ఈ ప్రశ్నకు జవాబు దొరికిందాకా ముందుకు కదలలేడు జోసెఫ్.




వసంతకాలం వచ్చింది. నిస్పృహ పెరిగింది. అవగాహనతో మాత్రమే స్వేచ్ఛ అర్థమవుతుందని తెలిసి వచ్చింది. జడివాన కురిసిన ఒక రాత్రి భార్యతో, ఇరుగుపొరుగులతో పోట్లాడి ఇంట్లోంచి బయటికొచ్చి రోడ్ల మీద పిచ్చిగా తిరిగాడు. కలుగులోంచి వచ్చిన చిట్టెలుక మరెక్కడికో పరిగెత్తింది. చిరిగిపోయిన గొడుగు ఎగురుతూ వచ్చింది. రోడ్లమీద నీళ్లు నిలిచి నడవటానికి ఇబ్బందిగా ఉంది. తిరుగుబాటు చేసి, పోట్లాడి లాభం లేదు. జీవితాన్ని యథాతథంగా అంగీకరించవలసిందే. వీలైనంత త్వరగా సైన్యంలో రిక్రూట్ చేసుకోవలసిందిగా అభ్యర్థన పంపిస్తాడు.

జోసెఫ్ ఆత్మాన్వేషణకు ఇదే క్లైమాక్స్. ఇప్పుడు సందిగ్ధత తొలిగిపోయింది. ఇక, తను డాంగ్లింగ్ మాన్ కాడు. ప్రత్యామ్నాయాలతో పోరాటానికి బదులు, సరెండర్‌నే ఎంచుకున్నాడు. ఇప్పుడు తనలోని తనకూ, భౌతికవాస్తవమైన తనకూ తేడా లేదు. సైన్యం అనే మానవ సమూహంలో చేరటం వల్ల సైనికుడిగా మనకో గుర్తింపు వస్తుంది. ఒంటరితనంలో తనెవరో తనకే తెలియకుండా పోయింది. 'సైన్యంలో క్రమశిక్షణ ఉంటుంది. తానేం చెయ్యాలో ఇతరులు నిర్ణయిస్తారు. సమాజమైనా, సైన్యమైనా.. నియమబద్ధమైన జీవితమే అభిలషణీయం. అధికారాన్ని అంగీకరించటంలోనే ప్రత్యామ్నాయాల మధ్య వైరుధ్యం పరిష్కారమవుతుంది' ఇవీ అతడు తన డైరీలో రాసుకున్న చివరి వాక్యాలు.

వ్యక్తి జీవితగమనాన్ని నిర్దేశించే విలువల గురించి అనాదిగా చర్చలు కొనసాగుతూనే వున్నాయి. ఆత్మజ్ఞానముంటే తప్ప తను మరేమీ అన్వేషించలేననుకున్నాడు జోసెఫ్.

1940లలో అమెరికన్ సమాజాన్ని తీవ్రంగా ప్రభావితం చేసిన ఒకే ఒక సమస్య రెండో ప్రపంచయుద్ధం. యుద్ధమంటే సైనికులు. తిరిగి ప్రశ్నించకుండా పై అధికారుల ఆదేశాలను పాటించే సైనికుడు మరణమైనా, శత్రువు మీద విజయమైనా- వాటిని నిర్ణయించేది తాను కాదు. స్వేచ్ఛ అంటే ఆదేశాలను పాటించటం. 'మనిషికెంత స్వేచ్ఛ ఉంది?' అని ప్రశ్నిస్తుంది యుద్ధం. తనను తాను బంధించుకున్న ఐదునెలల్లో దుఃఖం మాత్రమే వుందని గ్రహించాడు జోసెఫ్.

# సాల్ బెల్లో (1915-2005)

కెనడాలో జన్మించిన అమెరికన్ రచయిత సాల్ బెల్లో. అసలు పేరు సాలమన్ బెల్లోస్. తల్లిదండ్రులు రష్యాలోని సెయింట్ పీటర్స్‌బర్గ్ నుండి వలస వచ్చిన లియమేనియన్ యూదులు. బాల్యంలో శ్వాసకోశ వ్యాధులతో బాధపడటం వల్ల, ప్రతిదానికీ ఇతరుల మీద ఆధారపడకుండా వుండటం అలవాటు చేసుకున్నాడు బెల్లో. ఒకసారి మంచం పట్టినపుడు హారియెట్ బీచర్ స్టోవ్ రాసిన 'అంకుల్ టామ్స్ కేబిన్' చదివి రచయితగా మాత్రమే బతకాలని నిర్ణయించుకున్నాడు.

బెల్లోకు తొమ్మిదేళ్లప్పుడు కుటుంబం చికాగోలోని హంబోల్డ్ పార్క్‌కు మకాం మార్చింది. ఆ తరువాతి రోజుల్లో ఆయన రాసిన అనేక నవలలకు ఇదే నేపథ్యం. బెల్లో తండ్రి అబ్రహం ఉల్లిపాయల వ్యాపారం చేసేవాడు. బెల్లోకు పదిహేడేళ్లప్పుడు తల్లి మరణించింది. ఆమెకు మతవిశ్వాసాలెక్కువ. కొడుకు రేబై లేదా కాన్‌సర్ట్ పియానిస్ట్ కావాలని కోరుకుంది. కానీ బెల్లోకు మతచట్రంలో ఊపిరాడలేదు. ఆ సంకెళ్ళను తెంచుకోవటానికి నిశ్చయించుకున్నాడు. అందుకు రచనను ఆయుధంగా మలుచుకున్నాడు. అయితే బైబిల్ అంటే యిష్టం. షేక్‌స్పియర్‌ని, పందొమ్మిదో శతాబ్ది రష్యన్ నవలా రచయితల్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు.

మొదట చికాగో యూనివర్సిటీలో ఇంగ్లీషు సాహిత్యం చదవాలనుకున్నాడు. అక్కడి ఇంగ్లీషు డిపార్టుమెంటులో అంతా యూదు వ్యతిరేకులున్నారని గ్రహించి నార్త్‌వెస్టర్న్ యూనివర్సిటీకి మారాడు. చివరికి ఆంత్రపాలజీ, సోషియాలజీలలో డిగ్రీ తీసుకున్నాడు. ఆనాటి

'ఏం చెయ్యాలి?' అనుకుంటూ కాలయాపన చెయ్యటం కన్న సమాజం ఆదేశించిన పని ఏదైనా, అదే తన కర్తవ్యం అనుకోవటంలో స్వేచ్ఛ వుంది. స్వేచ్ఛ అంటే ఆనందం. తనతో తాను పోట్లాడుకుంటూ కూర్చోకూడదు.

వైరుధ్యాలతో బతకటమే అపజయం. సమాజం లేక తాను లేడు. సమాజ అవసరాలను తీర్చటానికే వుంటుంది వ్యక్తిగత స్వేచ్ఛ. అసలు వ్యక్తిత్వమనేది సామాజికం. అంతేగానీ స్వతంత్ర వ్యక్తిత్వం అనేది వుండదు. ఎవరి చీకటి గుహలలో వాళ్ళు బతుకుతామంటే వాళ్లు సమాజంలో వ్యక్తులుగా వుండటానికి అనర్హులు. సమాజంలో భాగంగా వుండటమంటే కార్యాచరణ అని అర్థం. నీ చర్యల్ని, కర్తవ్యాన్ని సమాజం నిర్ణయిస్తుంది. సమాజానికి మించిన స్వేచ్ఛ అనేది ఒక భ్రమ మాత్రమే. నవల చివర జరిగిన ఒక సంఘటన అతని సందిగ్ధతను పటాపంచలు చేస్తుంది. భార్య పేర వున్న చెక్కును బ్యాంకులో క్యాష్ చేసుకోవాలనుకుంటాడు జోసెఫ్. కానీ ఉద్యోగం లేదు గనక అతడికి డబ్బులివ్వటానికి నిరాకరిస్తుంది బ్యాంకు. అంటే ఉద్యోగం లేకపోతే ఈ సమాజంలో వ్యక్తి వున్నా లేనట్టే.

వ్యక్తివాదాన్ని తీవ్రంగా ఖండించిన నవల డాంగ్లింగ్ మాన్. మనిషి సంఘజీవి. ఒంటరి వాడు కాదు. ఒంటరిగా బతకలేడు. అపుడపుడూ సమస్యలు వచ్చినా సమాజ చట్రంలో పరిష్కరించుకోవాలి గానీ దాన్నించి దూరంగా, దాన్ని కాదనీ బతకటం సాధ్యం కాదు. ఎవరికి వాళ్ళు తాము ఉన్నతులమనీ, సంఘ నియమాలకు అతీతులమనీ అనుకోవచ్చు. కానీ సమాజమే లేకపోతే వాళ్లు ఎవరితో పోల్చుకుంటారు? అంటే ఆదర్శాలు కూడా వ్యక్తిగతం కాదు.

వ్యక్తిస్వేచ్ఛకు పట్టంగట్టే అమెరికాలో, సాల్ బెల్లో తన ఇరవైతొమ్మిదో ఏటనే ఇలాంటి నవల ప్రచురించటం ఒక సంచలనమే. ఎందుకంటే, వ్యక్తి సమాజంలో భాగమని అంగీకరిస్తే సామాజిక న్యాయం, సామాజిక నీతి కూడా వుంటుంది. ఎవరికి వాళ్లు గొంతెమ్మ కోరికలు కోరటానికీ, ఏడంతస్తుల మేడల్లో నివసించటానికీ వీల్లేదు మరి. వ్యక్తి ఆలోచనాసరళి కూడా సమాజ జీవితంలో భాగమేనని గ్రహించాడు జోసెఫ్. రచయితలా అతడు కూడా మాజీ కమ్యూనిస్టు.

రెండో ప్రపంచయుద్ధంలో పెట్టుబడిదారీ జర్మనీకి వ్యతిరేకంగా పెట్టుబడిదారీ అమెరికా తరపున సైన్యంలో చేరటానికి ఇష్టపడ్డాడు. సంపదను సమకూర్చుకోవటమే పరమావధిగా బతికిన

ఆయన మిత్రుడొకాయన 'బెల్లోకు పుస్తకాలే వూపిరి' అన్నాడు.

1930లలో చికాగోలోని రాడికల్ రచయితలు రిచర్డ్‌రైట్, నెల్సన్ ఆల్‌గ్రీన్‌లతో స్నేహం చేశాడు. ఆ తర్వాత ట్రాట్‌స్కీయిస్టుగా మారాడు. రెండో ప్రపంచయుద్ధ కాలంలో, మర్చంట్ మెరైన్‌గా పనిచేసిన బెల్లో 1944లో తొలి నవల 'డాంగ్లింగ్ మాన్' పూర్తిచేశాడు.

1948 గగెన్‌హైం ఫెలోషిప్ పొంది, 1953లో అడ్వెంచర్స్ ఆఫ్ ఆగీ మార్చ్ నవల రాశాడు. అది స్పానిష్ నవల. డాన్ క్విక్సోట్ లాంటి పికారెస్క్ నవల (తుంటరి, జులాయిల గురించిన కథామాలిక. మన గిరీశం అలాంటి వాడే). న్యూయార్కులో చాలాకాలం గడిపిన బెల్లో, తిరిగి చికాగో వెళ్లి యూనివర్సిటీ ఆఫ్ షికాగోలోని 'కమిటీ ఆన్ సోషల్ థాట్'లో ప్రొఫెసర్‌గా చేరాడు.

ఆగీ మార్చ్‌తోనే బెల్లోకు ఎంతో కీర్తి వచ్చినా, 1964 నాటి 'హెర్జోగ్'తో బెస్ట్ సెల్లింగ్ రచయితగా గుర్తింపు వచ్చింది. 1975లో వచ్చిన హంబోల్ట్స్ గిఫ్ట్‌తో ఆయనను అపురూపమైన జీనియస్‌గా ప్రశంసించింది సాహితీలోకం. ఈ నవలే 1976లో బెల్లోకు నోబెల్ బహుమతి రావటానికి కారణం. రచయితగా జీవితం కొనసాగిస్తూనే పలు యూనివర్సిటీల్లో ప్రొఫెసర్‌గా పనిచేశాడు. మార్సెల్ ప్రూస్ట్, హెన్రీ జెమ్స్ తనను బాగా ప్రభావితం చేశారని చెప్పుకున్నాడు.

ఈయన నవలిక 'సీజ్ ది డే' ఒక మాస్టర్ పీస్ అన్నాడు వి.ఎస్. ప్రిట్‌చెట్. 1976లోనే పులిట్జర్ ప్రైజ్, నేషనల్ మెడల్ ఆఫ్ ఆర్ట్స్, మరో మూడుసార్లు నేషనల్ బుక్ అవార్డు గెల్చుకున్నాడు బెల్లో. 1990లో లైఫ్‌టైం అచీవ్‌మెంట్ ఫర్ కాంట్రిబ్యూషన్ టు అమెరికన్ లెటర్స్ అవార్డు అందుకున్నాడు.

ఎన్ని నవలలు రాసినా 'హెండర్సన్ ది రెయిన్ కింగ్' తనకు అత్యంత ఇష్టమైన నవలనీ, అందులోని ప్రధాన పాత్ర తనేనని ఒక ఇంటర్వ్యూలో చెప్పాడు. 'పేదరికం నుండి గట్టెక్కడం సులభమే. మానసికమైన పేదరికాన్ని అధిగమించటం కష్టం' అంటాడు బెల్లో.

సమాజంలో కొన్నేళ్ల క్రితమే వచ్చిన ఆర్థిక సంక్షోభంతో ఆ కలలు కూడా చెదిరిపోయాయి. లక్షలాది మంది ఉపాధి కోల్పోయారు. చిన్న, మధ్య తరగతి వ్యాపారస్తులు, వృత్తిపనివాళ్లు రోడ్డున పడ్డారు. మేధావులు ఎన్ని వాదాలను సృష్టించినా, అన్నీ సమాజ పరిధిలోనే వుండాలని గ్రహించాడు జోసెఫ్. సెర్వేటియస్ సొసైటీ కేవలం ఒక ఊహాస్వర్గాన్ని కాంక్షించింది.

రెండో ప్రపంచయుద్ధం తర్వాత వచ్చిన అమెరికన్ సాహిత్యంలో డాంగ్లింగ్ మాన్ ఒక సంచలనం. రచయితకు మాత్రమే కాదు, తర్వాత తరాల రచయితలకూ దిక్సూచిగా నిలిచింది. 'వ్యక్తులే హీరోలు, సాహసోపేత జీవితమే అభిలషణీయం' అన్న హెమింగ్వే ధోరణిని నిరసించటం కూడా ఈ నవల పాపులారిటీ పెరగటానికి మరో కారణం. అప్పటికి హెమింగ్వే శిఖరాలకు సమానమైన రచయిత. రచయితలందరూ ఆయన్ను అనుకరించటానికి ప్రయత్నిస్తున్నారు. తరువాతి రోజుల్లో డాంగ్లింగ్ మాన్ జోసెఫ్ లాంటి పాత్రలతో చాలా నవలలు వచ్చాయి. వాటిల్లోని కథానాయకులందరూ వయసుతో పాటు ఎదిగిన జోసెఫ్‌లే అనిపిస్తుంది. ఆధునిక మానవునికి ప్రతీక డాంగ్లింగ్ మాన్. ఎటూ తేల్చుకోలేడు. స్వీయమానసిక ధోరణి అనే గొలుసు పట్టుకుని వేళ్లాడుతుంటాడు.

***జోసెఫ్ గురించి మరికొంత:***

డైరీ రూపంలో వుంది గనుక ఈ నవలలో జోసెఫ్ తప్ప మరొకరి ఆలోచనలుండే అవకాశమే లేదు. ఇతనిదీ రచయిత వయసే. ఇతడు కూడా కెనడాలోనే పుట్టాడు. తల్లిదండ్రులు రష్యా నుండి వలస వచ్చారు.

తరువాత చికాగో చేరుకున్నారు. అయితే జోసెఫ్ సైన్యంలో చేరటానికి అనుభవించిన ఉత్కంఠ ఆ రోజుల్లో అమెరికాలో వేలాదిమంది యువకులు అనుభవించారు. ఈ ఉత్కంఠ వల్లనే వాళ్లలో అభద్రతా భావం పెరిగింది. ఆత్మశోధనకు ఇదే కారణం. కాలేజీలో చరిత్ర చదివిన జోసెఫ్ మాజీ కమ్యూనిస్టు. తన డైరీలో ఫ్రెంచి తత్త్వవేత్త, రచయిత దెనిస్ దిదెరో, కార్ల్ మార్క్స్, జోసెఫ్ హైడెన్ (సంగీతకర్త)ల గురించి ప్రస్తావిస్తాడు.

ఇంతకూ జోసెఫ్ సమస్య/ పరిష్కారం వైయక్తికమా? సామాజికమా? ఆనాటి అమెరికన్ యువతకు అతణ్ణి ప్రతినిధిగా చూడవచ్చా? అన్న ప్రశ్నలకు నవలలో సమాధానం దొరకదు.

**– ఎం. వసంత**

35

# భామనే.. సత్యభామనే..!

## సొగసు చూడతరమా...

అప్పటివరకు నాజూగ్గా, హుషారుగా కనిపించిన చాలా మంది మహిళలకు పెళ్లయి పిల్లలు పుట్టగానే వాళ్ల రూపమే పూర్తిగా మారిపోతుంది. నిజమే ఇల్లు, పిల్లలు, పనులతో తమ పట్ల శ్రద్ధ తగ్గిపోతుంది. ఇది ముఖ్యంగా వారి ఆరోగ్యం మీద ప్రభావం చూపుతుంది. మూడు పదులు దాటగానే బీపీ, షుగర్, అధిక బరువు వంటి సమస్యలు చుట్టుముడతాయి. అలా కాకుండా పెళ్లయి పిల్లలు పుట్టాక కూడా తమ అందాన్ని, ఆరోగ్యాన్ని చెక్కు చెదరకుండా కాపాడుకుంటున్న ఈ 'అమ్మ'డుల సొగసు రహస్యమేంటో చూద్దాం..

### ఐశ్వర్యరాయ్

నిమ్మరసం, తేనె కలిపిన గోరువెచ్చని నీటిని తాగడంతో ఐశ్వర్యరాయ్‌కు రోజు మొదలవుతుంది. బ్రౌన్ రైస్, బ్రౌన్ బ్రెడ్ తీసుకుంటారు. ప్రోటీన్లు, ఒమెగా త్రి ఫాటీ ఆమ్లాలు పుష్కలంగా లభించే చేపలు, ఉడకబెట్టిన కూరగాయలు ఆమె ఆహారంలో ఎక్కువగా ఉంటాయి. రోజుకు 8 గ్లాసుల నీళ్లు తాగుతారు. వర్కవుట్ల

కాజోల్

ఐశ్వర్యారాయ్

కన్నా యోగా చేయడానికి ఇష్టపడతారామె.

## శిల్పాశెట్టి

ఉసిరి రసం, బొప్పాయి ముక్కలు, ఉడకబెట్టిన రెండు కోడిగుడ్లు లేదా ఆమ్లెట్లు. ఇవి శిల్పాశెట్టికి అల్పాహారం. మధ్యాహ్న భోజనానికి, అల్పాహారానికి మధ్య కొబ్బరి నీళ్లు తాగుతారు. అన్నం బదులు చపాతీలు తింటారు. ప్రతి రెండు గంటలకోసారి ఓ గ్లాసు మజ్జిగ తాగుతారు. సాయంత్రం సమయాల్లో డ్రైఫ్రూట్స్ తింటారు. రాత్రి ఆలివ్ నూనెతో చేసిన భోజనం తీసుకుంటారు.

## కాజోల్

ప్రతిరోజూ యోగా తప్పనిసరిగా చేస్తారు. బరువులూ ఎత్తుతారు. రోజుకు దాదాపు మూడొందల పుషప్స్ చేస్తారు. ఆహారం విషయంలోనూ అతి జాగ్రత్తగా ఉంటారు. గుడ్లు, పాలు, పనీర్, చికెన్ ఆమె ఆహారంలో మెండుగా ఉంటాయి. బరువును నియంత్రణలో ఉంచుకునేందుకు పీచు పదార్థాలుండే ఆహారం ఎంచుకుంటారు. నీళ్లు ఎక్కువగా తాగుతారు. మధ్యమధ్యలో ఆకలేసినపుడు తాజా పండ్లు, కూరగాయలు తీసుకుంటారు.


మాధురీ దీక్షిత్

## మాధురీ దీక్షిత్

మాధురీదీక్షిత్ సమయం దొరికినపుడల్లా పిల్లలు, భర్తతో ఆరు బయట ఆటలు ఆడతారు. వారానికి మూడు సార్లు కథక్ నృత్య అభ్యసన చేస్తారు. మిగతా రోజుల్లో గుండెకు సంబంధించిన వ్యాయామం, బరువులెత్తడం, యోగా వంటివి చేస్తారు. భోజనంలో ఎక్కువగా పండ్లు కూరగాయలు ఉండేట్లు జాగ్రత్తపడతారు. రోజులో ఐదారు సార్లు కొద్దికొద్దిగా ఆహారం తీసుకుంటారు. నిద్రను ఏమాత్రం నిర్లక్ష్యం చెయ్యరు.


మలైకా అరోరా

## మలైకా అరోరా

బాలీవుడ్ సినిమాల్లో ప్రత్యేక గీతాలతో అలరించే మలైకా అరోరా ఉదయాన్నే గోరువెచ్చని నీళ్లు తాగుతారు. వేపుళ్లు, నూనె ఉప్పు ఎక్కువగా ఉండే పదార్థాలు తీసుకోరు. తక్కువ మొత్తంలో ఎక్కువసార్లు తింటారు. రాత్రి 7.30 కల్లా భోజనం ముగిస్తారు. జొన్న, సజ్జ రొట్టెలు, ఆకుపచ్చని కూరగాయలు, మొలకెత్తిన విత్తనాలు, చేపలు ఆమె ఆహారంలో భాగంగా ఉంటాయి.

సేకరణ : సంధ్యారాణి

# సుగుణాల రేగు

వెయ్యి సంవత్సరాలనాటి ఫలం రేగు పండు. విటమిన్లు, ఖనిజాలు పుష్కలంగా లభించే ఈ పండ్లు అనారోగ్యాన్ని దరిచేరనీయవు. చైనాతో పాటు అనేక ఇతర ఆసియా దేశాలు కొన్ని వందల సంవత్సరాల నుంచి రేగు పండ్లను ఆయుర్వేద వైద్యంలో ఉపయోగిస్తున్నారు!

★ రేగు పండ్లలోని క్షారకాలు రక్తాన్ని శుద్ధి చేస్తాయి. శరీరంలోని విషపదార్థాలను నాశనం చేసి రోగనిరోధక వ్యవస్థపై ఒత్తిడి తగ్గిస్తాయి.

★ వీటిలో లభించే కాల్షియం ఎముకలను దృఢ పరుస్తుంది. వయసుమీద పడడం వల్ల వచ్చే కీళ్లనొప్పులను అరికడతాయి. వీటిలోని ఫాస్ఫరస్, ఐరన్ ఖనిజాలు కండరాల బలహీనత, అజీర్తి, ఆయాసం, తలబరువు వంటివాటిని తగ్గిస్తాయి.

★ రేగు పండ్లలోని పీచు పదార్థం జీర్ణశక్తిని పెంచుతుంది. తద్వారా మలబద్ధకం తగ్గుతుంది. అంతేకాదు తిమ్మిరి, వాపు, కడుపు ఉబ్బరం వంటి సమస్యలను దరిచేరనీయదు. కొన్ని రకాల క్యాన్సర్‌లను అరికడుతుంది.

★ వీటిలో లభించే కర్బన సమ్మేళనాలు నిద్రలేమికి మంచి మందు.

★ తక్కువ క్యాలరీలు, ఎక్కువ ప్రోటీన్లు, పీచుపదార్థం ఉండే రేగుపళ్లు అధిక బరువును నిరోధిస్తాయి.

★ వీటిలో ఉండే విటమిన్ సి, ఎ ఇంకా జీవ పదార్థాలు, ఆమ్లాలు దీర్ఘకాలిక రోగాలను ప్రేరేపించే రోగకారకాలను నాశనం చేస్తాయి. సి విటమిన్ తెల్లరక్త కణాల ఉత్పత్తిని అధికం చేస్తుంది.

★ హార్మోన్ స్థాయిలను క్రమబద్ధీకరించి ఒత్తిడి, వ్యాకులతలను అరికడతాయి.

★ యాంటీ ఆక్సిడెంట్లు అధికంగా ఉండే ఈ పండ్లు క్యాన్సర్, గుండె సంబంధిత వ్యాధులను నియంత్రిస్తాయి.

★ చర్మవ్యాధుల నుండి కూడా విముక్తి లభిస్తుంది. సోరియాసిస్, ఎగ్జిమా, మొటిమల సమస్యలను నివారిస్తాయి. అంతేకాదు చర్మం ముడతలు పడకుండా తాజాగా ఉండేట్లు చేస్తాయి.

- ఎండిన రేగుపండ్లను కేకులు, బ్రెడ్ తయారీలో వాడతారు!
- కొరియాలో అతిథులను రేగు పళ్ల టీతో స్వాగతిస్తారు! అక్కడ రేగుపళ్లతో చేసిన టీ, ఇడ్లీ ప్రత్యేక వంటకాలు!
- చైనాలో జామ్, పేస్ట్రీ, పూరీ తయారీలోనూ రేగుపళ్లు ఉపయోగిస్తారు. అక్కడ జరుపుకునే మిడ్ ఆటమ్ పండుగకు ప్రత్యేకంగా తయారు చేసే మూన్‌కేకులోనూ వీటిని ఉపయోగిస్తారు.
- చైనా, కొరియా, తైవాన్ దేశాలలో ఎండిన రేగు పండ్ల పొడితో చేసిన టీబ్యాగులు అమ్ముతారు. రేగు గుజ్జుతో చేసిన సిరప్‌లూ లభిస్తాయక్కడ!
- చైనాలో పులియబెట్టిన రేగుపళ్లతో వైన్ తయారుచేస్తారు!
- బంగ్లాదేశ్‌లో, పశ్చిమ బంగ, తమిళనాడు రాష్ట్రాలలో రేగుపళ్ల పచ్చడి చేస్తారు.
- అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో రేగుపళ్ల గుజ్జుతో చాక్లెట్లు తయారుచేస్తారు.
- మొరాకోలో రేగుపళ్ల తేనె తయారు చేస్తారు!

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**పూల రమాదేవి**

683/ఎ, రోడ్‌నెం. 10,
వైదేహినగర్, వనస్థలిపురం,
హైదరాబాద్ పిన్ : 500 070

## చతురంగం - 69 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పో | 2 త | న | | 3 పృ | 4 రా | ణం | | 5 క | 6 త |
| రి | | 7 వ | 8 ల | లు | డు | | 9 చా | మ | రం |
| | 10 అ | మి | త | ము | | 11 స | త | తం | |
| 12 త | మ | | లు | | 13 మ | ర | క | | 14 గ |
| 15 మి | రి | 16 యం | | 17 సు | హ | మ | | 18 కా | డు |
| | 19 క | డ | 20 లి | | తి | | 21 ని | రు | డు |
| 22 శ | | 23 మూ | క | 24 లు | | వా | 25 మి | | రు |
| 26 కు | 27 మా | రి | | 28 ష్ఠం | 29 ప్రా | | 30 నా | 31 ము | |
| 32 న | ర | | 33 గ్లో | | 34 లు | 35 పా | | 36 ల | 37 క |
| 38 ము | న | స | ఖ | లు | | 39 త | ల | గ | డ |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. పి.శుభ, బంజారాహిల్స్, 2. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 3. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 4. పి.బి.సీతాదేవి, నరసాపురం, 5. ఆర్.భారతి, ఎమ్మిగనూరు, 6. కె.వి.దుర్గామోహనరావు, వనస్థలిపురం, 7. సంజీవిగారి శ్రీహరి, బెంగళూరు, 8. యు.విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 9. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 10. జి.రాజ్యలక్ష్మి, సోమాజీగూడ, 11. నోరి శివప్రకాశం, సరస్వతి నగర్, నెల్లూరు, 12. అడపా సత్యనారాయణ బాబ్జీ, కూకట్‌పల్లి, 13. ఎ.పూర్ణచంద్రరావు, చింతచెరిక, 14. ఎన్.ప్రేమలత, ప్రగతి నగర్, 15. పుల్లాపంతుల వెంకట సుబ్బారావు, భీమవరం, 16. అల్లాడి లక్ష్మి, విశాఖ, 17. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 18. ధరణి పద్మాసన, నల్లకుంట, 19. పి.దేవసేనమ్మ, జూబ్లీహిల్స్, 20. సముద్రాల సంతోష్‌కుమారాచార్య, జగిత్యాల, 21. జి.సుబ్బరామయ్య, తిరుపతి, 22. శోభ.జి, తిరుపతి, 23. జి.జనార్దన్‌రెడ్డి, నిజామాబాద్, 24. ఆర్.వి.సి.హెచ్.నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 25. సావిత్రి, రథం బజారు, బాపట్ల, 26. బిరుదు సురేష్‌బాబు, పేరాల, 27. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 28. నార్నె చంద్రబాబు నాయుడు, ఇంకొల్లు, 29. తోకల విష్ణువర్ధన్, గుంటూరు, 30. వానపల్లి వెంకట సత్య గంగరాజు, విశాఖ, 31. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 32. సి.భారతి, హైదరాబాద్, 33. బిక్కుసూరి రాజేశ్వర్, నిర్మల్, 34. ఎం.వసంత, బోరబండ, 35. లోకే పుష్పలత, మంథని, 36. కె.లక్ష్మీకాంతం, గుంటూరు, 37. జి.శ్రీగౌరి, పుంగనూరు, చిత్తూరు జిల్లా, 38. బి.రేవతి, బెంగళూరు, 39. వి.వి.సత్యనారాయణశెట్టి, తిరుపతి, 40. కాకర్లమూడి కృష్ణప్రసాదు, తణుకు, 41. కట్టా మేఘన, కె.పి.హెచ్.బి. కాలనీ, 42. భోగరాజు అంజనీ మైత్రేయ, విజయనగరం, 43. చింతపల్లి నాగేశ్వరరావు, ప్రసాదంపాడు, 44. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 45. సి.హెచ్.వి.ఎస్.ఎల్.రాజేశ్వరి, కాకినాడ, 46. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోల్, 47. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 48. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 49. సయ్యద్ జమీలాబేగం, కర్నూలు, 50. కె.హెచ్.భీమేశ్వరరావు, కాకినాడ, 51. నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం, 52. జి.లింగయ్యగారి వేంకటేశం, చిక్కడపల్లి, 53. వాసా లీలాపద్మావతి, విశాఖ, 54. బి.వి.నరసింహారావు, పేరాల, 55. గండ్లూరి బలరామశాస్త్రి, మల్లాపూర్, 56. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 57. కోలా సత్యనారాయణ, విశాఖ, 58. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 59. యు.ఝాన్సీలక్ష్మి, న్యూపాల్వంచ, 60. జె.జయశ్రీ, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 61. సి.ఆల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 62. పేర్వేల రాంబాబు, మణికొండ, 63. దుర్గా ప్రవళ్ళిక, మల్కాజ్‌గిరి, 64. టి.చంద్రకళ, ఆర్.కె.పురం, 65. డా.కె.రాఘవాచార్య, కాకినాడ, 66. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 67. నండూరి కార్తికేయాచార్య, కూకట్‌పల్లి, 68. ఎస్.జయరామ్ మోహన్, నిజాంపేట్, 69. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, 70. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 71. వి.సరోజినీ ప్రభూజీ, మచిలీపట్నం, 72. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, తూ.గో.జిల్లా, 73. పక్కి శ్రీదేవి, గంట్యాడ, 74. టి.ఆర్.బాలకృష్ణారావు, రాజమహేంద్రవరం, 75. బి.రామమోహన్‌రావు, హైదరాబాద్, 76. యస్.రాజు, కర్నూలు, 77. కరణం సుబ్రమణ్యం, అనంతపురం, 78. బందెల బాబూరావు, ఉయ్యూరు, 79. లింగబత్తుల భవ్యశ్రీ, మహబూబాబాద్, 80. ఎన్.విజయ, కాకినాడ, 81. జి.భ్రమరాంబాదేవి, కాకినాడ, 82. వేమూరి భవాని, వరంగల్, 83. తటవర్తి రామలక్ష్మి, తాళ్ళగడ్డ, 84. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 85. విస్సాప్రగడ వెంకట సుబ్బారావు, రాజమహేంద్రవరం, 86. యు.ఎన్.ఎమ్, లాలాపేట్, 87. ఇయ్యాణ్ణి రోహిణి, తణుకు, 88. ఎస్.ఆర్.కె.మూర్తి, విజయవాడ, 89. కె.వి.ఎస్.ఎన్.మూర్తి, విశాఖ, 90. మారెడ్డి ప్రభాకర్, హైదరాబాద్, 91. కె.నాగభూషణం, మౌలాలి, 92. పి.శైలజ, మంగళగిరి, 93. దోనెపూడి హనుమ అన్నపూర్ణ, జూలేపల్లె, 94. టి.హేమలత, మచిలీపట్నం, 95. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 96. నియాజ్ అలి, హైదరాబాద్, 97. ఎ.స్వరూపరాణి, ఎర్రమంజిల్, 98. మహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, 99. కూనపరెడ్డి సత్యనారాయణ, పెనుగొండ, 100. యు.యు.యు, కర్నూలు, 101. దేవగ్రాజు వెంకట (..128లో)

చిటికెలో రుచిగా..!

# అరిసెలు

## కావలసిన పదార్థాలు

* బియ్యం - అరకిలో
* బెల్లం - 300 గ్రాములు
* యాలకుల పొడి - 1/2 టీస్పూను
* తెల్ల నువ్వులు - 1/3 కప్పు
* నెయ్యి - 2 టేబుల్ స్పూన్లు
* నూనె - అరిసెలు వేయించడానికి సరిపడ

## తయారుచేయు విధానం

ముందురోజు రాత్రి బియ్యం నానబెట్టాలి. ఉదయాన్నే నీళ్లు పూర్తిగా పోయేవరకు బియ్యాన్ని వడకట్టాలి. తర్వాత వాటిని మెత్తగా పిండి పట్టించుకోవాలి. లోతుగా ఉన్న మందపాటి పెద్ద గిన్నెలో చిదిమిన బెల్లం, 1/4 కప్పు నీళ్లు పోసి సన్నని మంట మీద పెట్టాలి. బెల్లం పూర్తిగా కరిగాక దాన్ని వడకట్టాలి. బెల్లంలో ఏదైనా చెత్తచెదారం ఉంటే పోతుంది. ఇపుడు మళ్లీ బెల్లం నీటిని శుభ్రమైన వెడల్పాటి గిన్నెలో పోసి పాకం వచ్చేవరకు కలుపుతూ ఉండాలి. పాకం వచ్చిందీ లేనిదీ తెలియాలంటే ఒక ప్లేటులో నీళ్లు పోసి అందులో బెల్లం పాకం రెండుమూడు చుక్కలు వెయ్యాలి. అది విడిపోకుండా ముద్దగా వస్తే పాకం వచ్చినట్లే. ఇపుడు యాలకుల పొడి, నెయ్యి, నువ్వులు వేసి కలిపి గిన్నెను పొయ్యి మీద నుంచి దించాలి. తర్వాత పాకంలో కొద్దికొద్దిగా పిండి వేస్తూ ఉండలు లేకుండా బాగా కలపాలి. మెత్తని ముద్ద అయ్యేవరకు పిండి వేస్తూ కలపాలి. తర్వాత కళాయిలో నూనె పోసి వేడి చేయాలి. పిండిని చిన్న చిన్న ముద్దలుగా చేసి ప్లాస్టిక్ పేపర్ లేదా పెద్ద సైజు ఆకుల మీద కావలసిన సైజులో వత్తి నూనెలో వేసి ఎర్రగా అయ్యేవరకు వేయించాలి. కళాయి నుంచి తియ్యగానే వాటిని అరిసెలు వత్తే చక్కలతో వత్తాలి. అలా చేయడం వల్ల ఎక్కువగా ఉన్న నూనె బయటికి వస్తుంది. నోరూరించే తియ్యని అరిసెలు రెడీ!



# నువ్వుల పులగం

## కావలసిన పదార్థాలు

- కొత్తబియ్యం - కప్పు
- నువ్వులు - 1/2 కప్పు
- బెల్లం తరిగినది - 2 కప్పులు
- నెయ్యి - 4 టేబుల్ స్పూన్లు
- జీడిపప్పు - 10
- బాదం - 10
- యాలకుల పొడి - 1/2 టీ స్పూను

## తయారుచేయు విధానం

నువ్వులు వేయించుకుని మిక్సీ పట్టుకుని పక్కన పెట్టుకోవాలి. పాన్‌లో రెండు టేబుల్ స్పూన్ల నెయ్యి వేసి కాగాక బాదం పప్పు, కిస్‌మిస్‌లను వేర్వేరుగా వేయించి పెట్టుకోవాలి. ఓ గిన్నెలో మూడు కప్పుల నీళ్లు మసిలాక అందులో కడిగిన బియ్యం వెయ్యాలి. అందులో నువ్వుల పొడి వేసి అన్నం పూర్తిగా ఉడికాక తరిగిన బెల్లం వేసి పది నిమిషాల పాటు సన్నని మంట మీద ఉడకనివ్వాలి. తర్వాత యాలకుల పొడి, మిగిలిన నెయ్యి వేసి కలపాలి. చివరిగా బాదం పప్పు, కిస్‌మిస్ వేసి మంట తీసేయాలి. నువ్వుల పులగం రెడీ! వేడిగా ఉన్నపుడే పాలు లేదా నెయ్యితో తింటే రుచిగా ఉంటుంది.

# చతురంగం - 70 ఆధారాలు

## అడ్డం

1. జనవరిలో వచ్చే జాతీయ పర్వదినం (8)
6. రాయి (2)
7. సన్యాసి, పరివ్రాజకుడు అటునుంచి (2)
8. రాశులలో ఇది ఒకటి (2)
10. పక్షి (3)
12. వార్ధక్యం (2)
14. నీచుడు (3)
15. 'ప్రాఫిట్'కు తెలుగు (3)
16. కోర్టులో లాయర్లు చేసేది (3)
18. - - మహర్షి వ్యాసుని కుమారుడు (2)
19. పూజలో ఉపయోగించే పవిత్ర జలాల చెంబు లేదా బిందె (3)
21. కోతి (2)
22. వసంతసేనను చెరబట్టాలనుకున్నవాడు (4)
23. పాండవులలో నాలుగోవాడు (4)
24. - - - అప్పలస్వామి గొప్ప ఆంగ్ల ఆచార్యుడు, శ్రీశ్రీ సమకాలికుడు (3)
27. 'చూసిన' లాటిదే కానీ తల తెగింది (2)
28. పల్లెటూరు (2)
29. 'మా వల్ల అవుతుందా? ' మరోలా (4)
30. తెలుగు సంవత్సరాలలో 'యువ' ముందుది (2)
31. పిండాన్ని పితరులకు చేర్చేది (2)
32. రంధ్రం అటునుంచి (2)
33. మనస్సు (2)
34. 'మాయాబజార్' సినిమాలో రారాజు పాత్రధారి (4)

## నిలువు

1. - - - - గోదారి కదలిపోతుంటేను (4)
2. కాలగర్భంలో కలిసిపోయిన 'టెలిగ్రామ్'కు తెలుగు (2)
3. మూడు, ముగ్గురు (3)
4. వ్రతం (2)
5. వాటాలు (3)
6. జుట్టు (2)
9. చాలా స్వల్పం (4)
11. మంచి, మంగళకరం శీర్షాసనం వేసింది (3)
13. సూర్యుడే మరో రూపంలో (5)
14. ముక్క (3)
17. జాతీయ పతాకం నిర్మాత పింగళి - - - (3)
18. గ్రామసింహాలే తడబడ్డాయి (4)
20. ఎంత మంచి కూరయినా ఇది లేకుంటే రుచి ఉండదు (3)
22. మాయాజూద కర్త (5)
24. వెంట్రుక (2)
25. పిల్లలు - - - - నవ్వుతారు (4)
26. 'మెడల్'కు తెలుగు (3)
28. కొండ (3)
29. తల్లి (2)
31. పురుషార్థాల్లో మూడోది (2)

(125వ పేజీ తరువాయి...)

నసింహారావు, చైతన్యపురి, 102. తిప్పావఝుల తులశమ్మ, మల్కాజ్‌గిరి, 103. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 104. ఆకొండి సత్యనారాయణమూర్తి, కాకినాడ, 105. ఎం.వసంత వీరేశ్, మద్దికెర, 106. గోగాడ సోమశంకర సుహాసీ, హోస్‌పేట్, 107. ఎ.ఆర్.శర్మ, సైదాబాద్. 108. యు.నారప్ప, మద్దికెర. 109. ఎస్.టి.పి.కృష్ణమాచార్యులు, నాగోల్. 110. చింతలపాటి శివశంకర శాస్త్రి, బి.హెచ్.ఇ.ఎల్. 101. అన్నంరాజు పూర్ణచంద్రరావు, విశాఖ. 102. కె.ఎ. ప్రకాశ్, నంద్యాల. 103. గుళ్ళపూడి సృజన్‌కుమార్, మచిలీపట్నం, 104. వి.ఇందిరా సుబ్రమణ్యాం, సోమాజీగూడ, 105. ఎం. శ్రీవాణి గిరిజాదేవి, రాజమండ్రి, 106. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 107. ఆకెళ్ళ శశికళ, విశాఖ, 108. బి.మోహనకుమారి, చెన్నై, 109. గరికిపాటి కృష్ణమూర్తి, కడప, 110. కోడుగంటి విజయలక్ష్మి, విశాఖ, 111. టి.పురుషోత్తం, కొత్తపేట, 112. ఎ.వి.రామకృష్ణ, కాట్రేనికోన, 113. వడ్డే.సుశీల, సికింద్రాబాద్, 114. సోంపాక సీత, భద్రాచలం, 115. గరికిపాటి ఇందిర, కాకినాడ, 116. వి.వెంకట సుబ్బారావు, బెంగళూరు, 117. కంజర్ల అనంతాచార్యులు, జగిత్యాల, 118. జె.రాజగోపాలరావు, ఎ.ఎస్.రావ్ నగర్, 119. ఎం.అరుణరేఖ, ఎల్.బి.నగర్.

# చతురంగం - 70

**రూ.150/- బహుమతి** | **గడువు తేది : జనవరి 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | | 2 | 3 | | 4 | | 5 | ■ |
| 6 | | ■ | 7 | | ■ | | ■ | 8 | 9 |
| 10 | | 11 | ■ | 12 | 13 | ■ | 14 తు | | |
| ■ | 15 | | | ■ | 16 | | | ■ | |
| 17 | ■ | | ■ | 18 | | ■ | 19 | 20 | |
| 21 | | ■ | 22 | | | | ■ | | ■ |
| | ■ | 23 | | | | ■ | 24 రో | | 25 |
| ■ | 26 | ■ | 27 | | ■ | 28 | | ■ | |
| 29 | | | మా | ■ | 30 | వ | ■ | 31 | |
| 32 | | ■ | 33 | | ■ | 34 | | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------

----------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# మహిళ తనకు తానే కాన్పు చేసుకోగలదా?

రోడ్డు నిర్మాణ కూలీపనికి ఓ తండాలోంచి నిండు గర్భిణి అడవిబాటలో వెళుతోంది. మార్గంలోనే విపరీతమైన ప్రసవవేదన! జనావాసానికి వెళ్లేంతవరకూ కాన్పు కాకుండా నరాలు బిగపట్టాలనుకుంది. కానీ అంతలోనే కళ్లు తిరిగి ఓ గోతిలో పడింది. సాయంకోసం ఆర్తనాదాలు చేసింది. ఆ తర్వాతేమైంది? మహిళకు పునర్జన్మగా భావించే ప్రసవ సమయంలో ఓ మాతృహృదయం తెగువను చిత్రించిన **ముల్క్‌రాజ్ ఆనంద్** భారతీయాంగ్ల కథ **కాన్పు**

'మహిళల ఆనందం, శక్తి, జీవం అన్నీ వారి అందంలోనే ఉంటాయి. కానీ ఆ అందం వారి జీవితాల్లో కొన్నేళ్లే ఉంటుంది. మనం రోజూ అద్దంలో చూసుకుంటున్నా వయసు పైబడుతున్నట్లు గమనించలేం. కానీ నాకు మాత్రం ముసలాడినయ్యాననే జ్ఞానోదయం ఓ భయంకర పద్ధతిలో కలిగింది. అప్పట్నుంచి వాస్తవాన్ని అంగీకరించడం నేర్చుకున్నాను' అన్నాడు పీటర్. ముంచుకొస్తున్న వృద్ధాప్యాన్ని మనుషులెందుకు గ్రహించలేరు? అందం, యవ్వనం, వృద్ధాప్యం గురించి లోతుగా ఆలోచింపజేసే **గైడీ మపాసా** ఫ్రెంచ్ కథ **వీడ్కోలు**




మనిషి అవినీతిపరునిగా మారకుండా ఈ సమాజంలో జీవించే పరిస్థితులు ఉన్నాయా? అనే ప్రశ్నను రేకెత్తించిన **ఫకీర్‌చంద్ శుక్లా** హిందీ కథ **క్షుద్రసంధ్య** 35 ఏళ్లనాటి విపుల కథలో! పసందైన పద్దెనిమిది కథలతో పాటు

* **రింగరింగారింగరింగారే..!**
* **పేరడీ బీరెడీ** ఇంకా మరెన్నో

జనవరి విపులలో..!

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Medchal District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# ఏమిటా పరిస్థితి..?

అమెరికా వెళ్ళి ఆరేళ్ళు దాటినా ఒక్కసారి కూడా ఇండియాకి రాలేకపోయాడు.
అమ్మమీది అంతులేని బెంగను గుండెల్లో దాచివుంచాడు.
నాన్నను చూడాలనే దిగులును ఎదలో దిగమింగుకున్నాడు.
నాన్నమ్మను చూడాలనే కాంక్షను కనురెప్పలకింద తొక్కిపెట్టాడు.
మాతృదేశం మీది మమకారం అనుక్షణం వేధిస్తున్నా కదలలేకపోయాడు.
రావాలనే ఆశ.. రానివ్వని పరిస్థితుల మధ్య నలిగిపోయిన యువకుడి జీవితానికి అక్షరచిత్రణ
**పోల్కంపల్లి శాంతాదేవి** నవల
**దీపమై వెలిగించు..**
చతుర జన్మదిన కానుక



బోనస్‌గా..

* *నవలావలోకనంలో..*
  సాంఘిక యజ్ఞంలో సమిధలుగా మారుతున్న యువకులు, అందుకు ఆజ్యం పోస్తున్న రాజకీయాలు, విద్యార్థుల స్వార్థం, సంకుచితత్వం విద్యా, ఆర్థిక విధానాలు వాళ్లను బలి తీసుకుంటున్న తీరును కళ్లకు కట్టే **ఎమ్వీయెల్** నవల **నిన్న స్వప్నం - నేడు సత్యం**పై సమీక్ష
* *కాలాతీతంలో..*
  జీవితం అంటే ఏంటి..? వాస్తవానికి, ఊహా జీవితానికి తేడా ఏంటి? మనిషి గుండెను పట్టుకునే ప్రయత్నం చేసిన నోబెల్ గ్రహీత **సాల్‌బెల్లో** నవల **హెర్జోగ్**

**CHATURA** Telugu Monthly, Dt. of publication : Jan 1, 2017.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978